# చతుర

జులై 2016
రూ.15/-

* బి. గీతిక అద్వైతం .... 06
* కాలాతీతం టోనీ మారిసన్ ది బ్లూయెస్ట్ ఐ .... 110
* నవలావలోకనం కె.ఎన్.వై. పతంజలి ఖాకీవనం .... 115



ఎవ్లిన్ శర్మ
సౌందర్య రహస్యం ..122

వారెవ్వా!

# సరస్సుపై సరిగమలు!



నీటిపై తేలియాడుతున్న ఓ అద్భుతమైన వేదిక ఇది! ఆస్ట్రియాలోని బ్రిగెంజ్ ప్రాంతంలో కాన్‌స్టన్స్ సరస్సుపై 2011లో మ్యూజిక్ ఫెస్టివల్ కోసం దీన్ని ఏర్పాటు చేశారు! ఫ్రెంచి విప్లవ సమయంలో రాడికల్ జర్నలిస్టు 'జేన్ పాల్ మరట్' హత్యకు గురైనపుడు బాత్‌టబ్‌లో ఎలా ఉన్నాడో, ఆ గదిలోని అద్దం, పెద్ద పుస్తకం, ఒక జర్నల్ పేజీ.. అచ్చంగా అదే దృశ్యాన్ని ఇలా కళ్లకు కట్టారు! మొట్టమొదటిసారి 1946లో మ్యూజిక్ ఫెస్టివల్‌కు భవనం దొరక్కపోవడంతో ఆ సరస్సుపై వేదికను, ఒడ్డున గ్యాలరీని ఏర్పాటు చేశారు. అప్పటి నుంచి రెండేళ్లకోసారి రకరకాల నేపథ్యాలతో వేదికలు నిర్మిస్తున్నారు.

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్ సెన్స్ ఉంటే చాలు...
మీ అభిమాన విపుల / చతురకు మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా - పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదే సైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ : ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.**
**ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.**

★ ఫొటోలు పంపేవారు విధిగా తమ ఫోన్‌నెంబర్లుసహా తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.

★ ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజిస్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

**చిరునామా :** సంపాదకులు, చతుర / విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









సంపుటి : 39
సంచిక : 6
పేజీలు : 132
జులై 2016
462 వ సంచిక

# చతుర

## ఇదీ వరస...!



'ఇప్పుడే లైఫ్ స్టార్ట్ చేశారు. అప్పుడే పిల్లలు, వాళ్ల కేరింగూ అంటూ బరువు మీద వేసుకోకు. డాక్టర్ని కలిసి రెండు మూడేళ్లు ఫ్యామిలీ ప్లానింగ్ తీసుకో' మందలింపుగా అంది సుమణి, కొత్తగా పెళ్లయిన కూతురు వర్ణతో.

'నందూకి చెబుతా. అతనూ ఓకే అంటే..' అంది వర్ణ.

'ప్రతి విషయానికీ అతని ఇష్టాయిష్టా లకే వేల్యూ ఇస్తూ వెళ్లకు. అట్‌లీస్ట్ మన చేతుల్లో ఉండే విషయాల్లకైనా ఇంపార్టెన్స్ ఇచ్చుకుంటేనే మనకంటూ ఓ వేల్యూ ఉంటుంది. ఆడవాళ్లు ఎప్పటికీ మా మీద డిపెండెంటే అన్న ఫీలింగ్ మగవాళ్లందరికీ పుట్టుకతోనూ, పెరుగుదలలోనూ వచ్చేస్తుంది' రెట్టిస్తూ అంది తల్లి.

'ఓకే మమ్మీ. ఆ విషయాలు వదిలేయ్. అత్తయ్యాళ్ల ఇంటికెళ్లాం. వాళ్లేమన్నారో తెలుసుకోవాలని లేదా?' తల్లి మాటల్ని డైవర్ట్ చేసింది వర్ణ.

వర్ణ పుట్టింటికొచ్చినా అత్తగారిని తలచుకోవడానికి కారణమేంటి? కూతురికి బోధలు చేసే సుమణి నేపథ్యమేంటి? భార్యాభర్తల సంబంధాన్ని మూడు కోణాల్లో చూపుతూ ఆసక్తిగా సాగే బి. గీతిక నవల **అద్వైతం** ..పేజీ నెం. 6



జంబీరంబు .. బీరంబు / రాజీవంబు .. జీవంబు / కోదండంబు.. దండంబు- ఇలా కొత్తకొత్త పదబంధాలతో, వేరు వేరు అర్థాలతో అలరించే భావ బంధురంతో అద్భుతమైన స్త్రీ సౌందర్య వర్ణన కోసం **చమత్'కారం'** తిలకించాల్సిందే! ..పేజీ నెం. 27

శ్రీరామునితో యుద్ధసమయం నాటికి రావణుని వయస్సు ఎంత? దీపారాధన తరువాత స్త్రీలు గంట కొట్టవచ్చా? నవగ్రహాలకు ప్రదక్షిణ చేసిన తరువాత కాళ్లు కడుక్కోవచ్చా? శ్రీకృష్ణుడు, ఏకలవ్యుడు అన్నదమ్ములా? ఇలాంటి ఆధ్యాత్మిక, పౌరాణిక ధర్మ సందేహాలు నివృత్తి కావాలంటే **చతుర ప్ర.జ.** చూడాల్సిందే!

..పేజీ నెం. 119



అణచివేత ఉన్నచోట ప్రతిఘటన తప్పదు. బాని సత్వం ఉన్నచోట తిరుగుబాటు తప్పదు. ఏ వ్యవస్థలోనైనా ఇది సహజం. తిరగుబాట్లను అణచివేసే డిపార్టుమెంటులోనే తిరుగుబాటు... **కె.ఎన్.వై. పతంజలి** ఖాకీవనం నవల చెప్పే సత్యమిది. 'చతుర' ప్రచురించిన ఈ నవల పాఠకలోకంలో పెను సంచలనం కలిగించింది. తొలి నవలతోనే పతంజలి గొప్ప రచయితగా ప్రసిద్ధికెక్కారు. **ఖాకీవనం**పై సమీక్ష ఈ నెల నవలావలోకం ప్రత్యేకం









ప్రపంచం గర్వించదగ్గ రచయిత్రి టోనీ మారిసన్. తాను స్వయంగా జాతివిద్వేషాన్ని ఎదుర్కొన్నప్పటికీ టోనీ ఆత్మస్థయిర్యంతో ఉన్నతస్థానాలకు ఎదిగి, వివిధ హోదాల్లో పనిచేశారు. అత్యున్నతమైన నోబెల్ పురస్కారం, నేషనల్ బుక్ అవార్డు, పులిట్జర్ ప్రైజ్, గౌరవ డాక్టరేట్ ఇంకెన్నో సత్కారాలు పొందారు. వర్ణవివక్ష నేపథ్యంగా **టోనీ మారిసన్** నవల **ది బ్లూయెస్ట్ ఐ** విశేషాలు తెలుసుకోవాలంటే **కాలాతీతం** చదవాల్సిందే





హాలీవుడ్‌లో తొలి అవకాశం కొట్టేసింది ఆ భామ. ఆ తర్వాతే బాలీవుడ్‌లో అడుగుపెట్టింది. జర్మనీలో పుట్టి పెరిగి భారతీయుల్ని ఆకట్టుకుంటోన్న ఆ తార ఎవరు? ఆమె అందచందాల రహస్యమేంటి? తెలుసుకోవాలంటే తెరవండి.. 

మతిమరుపుతో ఏ పనీ చేయలేకపోతున్నారా? మెదడులో చురుకుదనం తగ్గిందా? అయితే ఈ చిట్కా పాటించండి..



బొప్పాయితో చర్మసౌందర్య చిట్కాలు..

**బొప్పాయితో సోయగంలో**.. 

ఎదుటివాళ్ల భాష మనకు రాకపోయినా ఫర్వాలేదు.. మన భాష వాళ్లకు రాకపోయినా ఇబ్బంది లేదు.. ఎవరి భాషలో వాళ్లు మాట్లాడినా ఎదుటివాళ్లకు స్పష్టంగా అర్థమైపోతుంది! ఎలాగంటారా? ఈ యాప్ ఉపయోగించండి.. **'టెక్‌గురూ!'** 

రుచికి రుచి.. ఆరోగ్యానికి ఆరోగ్యం.. రెండూ కలగలిసిన నువ్వు పప్పుండల తయారీ..



కొవ్వొత్తులు ఎక్కువసేపు వెలగాలంటే? తురిమిన కొబ్బరి ఎక్కువరోజులు నిలవ ఉండాలంటే.. ఇలాంటి అనేక సందేహాలకు సమాధానాల నిధి **'చిట్కాలక్ష్మి'** 

'ఉక్కుమనిషి'గా సుప్రసిద్ధులైన సర్దార్ వల్లభాయ్ పటేల్ హాస్య చమక్కులు.. 

మధురమైన పానకంలో చురుక్కుమనిపించే మిరియంలా హాయిగా సాగిపోయే కథ కొసలో మెరుపులాంటి చమత్కారంతో అలరించే చిట్టిపొట్టి **చతురకత** 

ముఖచిత్రం : మీనా    రెండో కవరు : వారెవ్వా!    చివరి కవరు : బేబీ గాయత్రి

పుస్తకాలంకరణ : రాజుయాట

e-mail: vipula.chatura@eenadu.net /
vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

'శ్యామలా! నేను ఆఫీసుకు వెళ్తున్నాను. నా మాట మీద గౌరవం లేనివాళ్లు నా ఇంటికి రానవసరం లేదని చెప్పు. ఇన్నేళ్లూ మంచివాడిగా పేరు తెచ్చుకున్నాను. ఈ రోజు వాడు తప్పటడుగు వేసి, ఆ తప్పును సరిదిద్దుకోవడం కోసం అందరిలో నన్ను విలన్‌ని చెయ్యొద్దని చెప్పు. నలుగురూ వాడు తండ్రి మాట వినలేదని అనుకోరు. తండ్రే వాడి ఇష్టాన్ని కాదన్నాడని, ఇంటికి వచ్చినా మాట్లాడని కర్కోటకుడనీ అందరూ అనుకునేలా నన్ను చెడ్డవాడ్ని చేయొద్దని చెప్పు వాడికి..'

ఆశీర్వాదం కోసం వచ్చిన కొడుకూకోడళ్లను చూసి తులసీరామ్ భార్యనుద్దేశించి అన్నమాటలివి. ఇంతకీ తులసీరామ్ కొడుకు చేసిన నేరమేంటి? భిన్నమైన కోణంలో ఆద్యంతం ఆసక్తిగా సాగే నవల అద్వైతం చతుర జులై కానుక!

# అద్వైతం

## - బి. గీతిక



రి జిస్ట్రార్ ఆఫీస్...

నూతన వధూవరుల సంతకాలూ, సాక్షి సంతకాల కార్యక్రమం పూర్తయిన తరువాత స్నేహితులు ఇచ్చిన పూల దండల్ని మరోసారి మార్చుకున్నారు వధువు వర్ణ, వరుడు నందకిషోర్‌లు.

వాళ్ళిద్దరూ ఈ రోజు తెల్లవారుఝామునే గుడిలో పెళ్ళి చేసుకుని, ఆ పెళ్ళి బట్టలతోనే రిజిస్ట్రార్ ఆఫీస్‌కి వచ్చారు.

నందకిషోర్, వర్ణ ఇద్దరూ ఒకళ్లకొకళ్లు దండలు వేసుకుంటుంటే సరిగ్గా అప్పుడే, "ఆలస్యం చేసేశానా..!" అంటూ హడావుడిగా లోపలకు వచ్చాడు నందకిషోర్ క్లోజ్ ఫ్రెండ్ భగవాన్‌దాస్.

"అదేం లేదులే! రారా! నువ్వు చేయ్యాల్సిన సంతకం మిగిలే ఉంది" అంటూ జేబులోంచి పెన్ను తీసి ఇచ్చాడు వరుడు నందకిషోర్.

"మాదగ్గరుందిలే బాబూ!" అంటూ తన జేబులోంచి పెన్ను తీసి, మ్యారేజ్ రిజిస్ట్రేషన్ పుస్తకంలో భగవాన్‌దాస్ కూడా సాక్షి సంతకం చేశాడు. నందకిషోర్, వర్ణల వంక చూస్తూ "హమ్మయ్య! ఇంక మీ లవ్‌కి శుభం కార్డు పడిపోయిందిరా!" అని నిశ్చింతపడుతున్నట్టుగా నవ్వాడు.

"పెళ్ళితో శుభం కార్డు పడేది సినిమాల్లోరా దాసూ! నిజజీవితాల్లో పెళ్ళనేది ముహూర్తం షాటురా! అన్నీ ఇక్కణ్నుంచే స్టార్టవుతాయి" అని అదోలా నవ్వుతూ అన్నాడు ఇంకో ఫ్రెండ్ రఘు.

"ముహూర్తం షాటో? శుభం కార్డో? న్యూ లైఫ్ స్టార్ట్ చేస్తేనే కదరా మాకు తెలిసేది!" అని వర్ణ వంక చూసి నవ్వుతూ అన్నాడు నందకిషోర్.

వర్ణకి ఇది మొదలో? తుదో? ఆలోచించలేనంత ఉద్విగ్నంగా, ఉద్వేగంగా ఉంది.

మ్యారేజ్ రిజిస్ట్రేషన్‌కి సంబంధించిన ఫార్మాలిటీస్ అన్నీ పూర్తిచేసుకుని, మధ్యాహ్నం పన్నెండుగంటలకి రిజిస్ట్రార్ ఆఫీస్ లోనుంచి బయటకు వచ్చారు అందరూ.

తమ పెళ్ళికి వచ్చినందుకు అందరికీ మరీ మరీ థ్యాంక్స్ చెప్పి, బైక్‌ని స్టాండ్ లోంచి బయటకు తీశాడు నందకిషోర్.

పూలదండలూ, మ్యారేజ్ రిజిస్ట్రేషన్ పేపర్లూ అన్నీ బ్యాగ్‌లో పెట్టి, ఆ బ్యాగ్‌ని నందకిషోర్ బైక్‌కి తగిలించింది వర్ణ. ఆమెకి ఇదంతా ఇంకా నమ్మశక్యం కావడం లేదు. ఏ రోజూ తల్లిదండ్రులని 'అది కావాలి.. ఇది కావాలి' అని పేచీపెట్టని తాను, పెళ్ళి విషయంలో మాత్రం గట్టిగా పట్టుబట్టి వాళ్ళిద్దరూ లేకుండానే, ఇలా పెళ్ళి చేసుకోవడం ఆమెకి ఎంతో ఆశ్చర్యంగా అనిపిస్తోంది.

చుట్టూ ఫ్రెండ్స్ అందరూ ఉన్నారు. కానీ, ఉండాల్సిన తమ ఇద్దరి తల్లిదండ్రులూ పెళ్ళిలో లేరన్న బాధని పైకి కనబరచకపోయినా వర్ణ, నందకిషోర్‌ల మనసుల్లో మాత్రం అది తీరలోటుగా అనిపిస్తూనే ఉంది. దాంతో చేస్తున్న ఏ పనీ పూర్తి ఇష్టంతో చేయలేకపోతున్నారు వాళ్ళిద్దరూ.

ఫ్రెండ్స్‌కి బై చెప్పి బైక్ స్టార్ట్ చేశాడు నందకిషోర్. అందరికీ కళ్ళతోనే కృతజ్ఞతలు చెప్పి బైక్ మీద కూర్చుంది వర్ణ. మరుక్షణమే బైక్‌ని రయ్యిన ముందుకు దూకించాడు అతను.

కొంతదూరం వెళ్ళిన తరువాత బైక్ స్లో చేస్తూ, "వర్ణా! ముందు మీ ఇంటికి వెళదామా? " అని కొంచెం అనుమానంగానే అడిగాడు నందకిషోర్.

ఆమెకు తల్లిదండ్రుల మాటలు గుర్తొచ్చాయి. పెళ్ళి గురించి ఇంట్లో జరిగిన చర్చ అంతా గుర్తొచ్చింది. అంతే! ఏ మాత్రం ఆలోచించకుండా, "ఊహుహుఁ! వద్దు నందూ! తరువాతొస్తామని డాడీతో ఆల్రెడీ చెప్పాలే. పర్లేదు! మీ ఇంటికి పోనియ్!" అని వెంటనే చెప్పింది వర్ణ.

ఆమె భావాన్ని అర్థంచేసుకున్నవాడిలా, "ఆంటీ, అంకుల్‌తో నేను మాట్లాడతా

లే..!" అన్నాడు నందకిషోర్.

"ఎందుకు నందూ! ఈ రోజు పెళ్ళి చేసుకుంటామని వాళ్ళకి ముందే చెప్పాం కదా! ఫ్యూచర్‌లో ఎవరితోనూ మాట పడకూడదని వాళ్ళ గురించి మాత్రమే ఆలోచించుకుంటున్నారు వాళ్ళు..." అంటూ కోపంగా ఇంకా ఏదో అనబోయింది వర్ణ.

"వర్ణా! పెళ్ళికి దగ్గరయితే ఉండమన్నారు. కానీ, ఒప్పుకున్నారు కదా!" అంటూ నచ్చజెప్పబోయాడు నందకిషోర్.

"నందూ! ఇప్పుడు వాళ్ళు ఇంట్లో ఉండరు. రేపు సండే లంచ్‌కి వస్తామని డాడీకి ఫోన్ చేసి చెప్తాలే. ప్రెజెంట్ మాత్రం మీ ఇంటికి వెళదాం పదా!" అని మొండిగా అందామె.

"మా ఇంటికా..? అమ్మయితే ఓకే! నాన్న గురించి నీకు చెప్పానుగా..!" అని ఆపేశాడతను.

రెండు సెకన్ల మౌనం తర్వాత, "సరే! అయితే ఇంకేం చేస్తాం! మీ ఇంటికీ వద్దు, మా ఇంటికీ వద్దు. మన ఇంటికి పదా!" నిదానంగా అందామె.

వర్ణని పెళ్ళి చేసుకుంటానని చెప్పగానే నందకిషోర్ వాళ్ళ నాన్న తులసీరామ్ లావాని వెళ్ళగక్కే అగ్నిపర్వతమే అయ్యారు. ఆయన తన మిత్రునికి మాట ఇచ్చాననీ, అతని కూతురినే పెళ్ళి చేసుకోవాలనీ నందకిషోర్‌పై చాలా ఒత్తిడి తెచ్చారు. కానీ, తాను వర్ణని మనస్ఫూర్తిగా ఇష్టపడ్డానని, ఆమెని తప్ప వేరొకర్ని పెళ్ళి చేసుకోలేనని కరాఖండిగా చెప్పేశాడు నందకిషోర్. 'నామాట వింటేనే నా ఇంట్లో ఉండు.. లేకపోతే బయటికి పో!' అన్నారు తులసీరామ్‌గారు.

దాంతో నందకిషోర్ అతను పనిచేసే కాలేజ్‌కి దగ్గరలోనే ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. వర్ణతో కలిసి ఇప్పుడా ఇంటికి వచ్చిన వెంటనే తల్లికి ఫోన్ చేశాడతను.

"ఎలా ఉన్నావురా నందూ..? పెళ్ళి బాగా జరిగిందా?" అని ఫోన్ ఎత్తిన వెంటనే ఆత్రుతగా అడిగింది శ్యామల.

తల్లి మాటల్లో పొంగిపొర్లుతున్న ప్రేమకి నందకిషోర్ కళ్ళలో పల్చని నీటి తడి మెరిసింది. అతన్ని చూసి దగ్గరకు వచ్చి అతని భుజం మీద తలవాల్చి కూర్చుంది వర్ణ.

"బాగానే జరిగిందమ్మా! నువ్వూ, నాన్నా లేకుండా పెళ్ళి చేసుకోవడమే మా ఇద్దరికీ ఏదోలా ఉంది" అని దిగులు నిండిన గొంతుతో చెప్పాడు నందకిషోర్.

"బాధపడకురా! నాన్న పట్టింపు అంతే! నీకు తెలిసిందేగా! మీరు బావుంటే చాలు! పెళ్ళికి వర్ణ అమ్మానాన్నా వచ్చారా..?" అని ధైర్యం చెప్తూ అడిగింది శ్యామల.

"ఊహుఁ! రాలేదు. మీరు లేకుండా వాళ్ళు మాత్రమే మా పెళ్ళిలో ఉంటే, వాళ్ళ మీదకి లేనిపోని మాటలొస్తాయని 'రాలేము' అని మాతో ముందే చెప్పారమ్మా!" అని నిదానంగా చెప్పాడు నందకిషోర్.

"అదేంట్రా నందూ! అయితే వాళ్ళు కూడా మీ పెళ్ళిలో లేరా! మీ ఇద్దరికీ అమ్మానాన్నలం ఉన్నా కూడా ఎవరూ లేనట్టు పెళ్ళి చేసుకున్నారా?" అని బాధతో ఒక క్షణం ఏమీ మాట్లాడలేకపోయిందావిడ. ఆ తరువాత, "ఇంటికి వచ్చేటప్పుడు మీ పెళ్ళి ఫొటోలు తీసుకురారా! కనీసం వాటినయినా చూస్తే నీ పెళ్ళిని కళ్ళారా

## కొత్తగాలి...

**నూకలిస్తే మేకలు కాస్తావా?**
**పిల్లల ఆట!**
**నోటులిస్తే ఓటు వేస్తావా?**
**నాయకుల మాట!**

– కుంటముక్కుల సత్యవాణి,
కాకినాడ

చూసినట్టు ఉంటుంది" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూనే, గొంతులోని దుఃఖాన్ని ఆపుకుంటూ అంది శ్యామల.

తల్లి గొంతులో వచ్చిన మార్పుని విన గానే ఆమె ఏడుస్తోందని అర్థమైంది నంద కిషోర్‌కి. అతనికీ దుఃఖం పొంగుకొ స్తుంటే, "ఇంకొన్నాళ్ళు ఆగి ఉండాల్సిందే మోనమ్మా! నేనే పెళ్ళికి తొందరపడ్డాను" అని పశ్చాత్తాప పడుతూ అన్నాడు.

కొడుకులోని దుఃఖాన్ని గ్రహించి తను నిబ్బరాన్ని తెచ్చుకుంటూ, "ఏంట్రా అది? శుభమా అని పెళ్ళి చేసుకుని.. ఛఛ!! బాధపడకు! ఫోన్ వర్ణకివ్వు" అంటూ ఫోన్‌లోనే కొడుకుని గట్టిగా మందలిం చింది శ్యామల.

వాళ్ళ ఫోన్ సంభాషణని వింటున్న వర్ణకీ కొంచెం దిగులుగానే అనిపించింది. బేలతనం నిండిన ముఖంతో నందకిషోర్ ముఖంలోకి చూడసాగింది. నందకిషోర్ ఫోన్ ఆమెకి ఇవ్వగానే "హలో! ఆంటీ!" అంది వర్ణ.

"వాడు జాగ్రత్తమ్మా! ఏమీ తెలీదు.. పిచ్చివెధవ! అన్నిటికీ ఫీలవుతూ ఉంటాడు. వాణ్ని నువ్వే జాగ్రత్తగా చూసు కోవాలి!" అని కొడుకు గురించి దిగులు పడుతూ చెప్పింది శ్యామల.

కూతుర్ని అప్పజెబుతున్నట్టుగా 'జాగ్రత్త' అని చెబుతుంటే, ఆ మాటల్లో ఆవిడలోని మాతృత్వపు ప్రేమానురాగాలు స్పష్టంగా తెలిశాయి వర్ణకి. ఆవిడలో కొడుకు మీద ఉన్న ప్రేమకి చలించిపోతూ, "చాలా బాగా చూసుకుంటానాంటీ!" అని మన స్ఫూర్తిగా చెప్పింది వర్ణ.

"ఆంటీ కాదమ్మా! అత్తయ్యా అనో? అత్తమ్మా అనో? పిలువు. నాకు తృప్తిగా ఉంటుంది" అని చెప్పింది శ్యామల.

"అలాగే అత్తయ్యా! మీరు నందూ గురించేమీ బెంగ పెట్టుకోకండి. నేను చాలా బాగా చూసుకుంటాను" అని చిరు నవ్వుతో అంది వర్ణ.

"సరేనమ్మా! ఉంటాను! మీ మామయ్య గారు భోజనానికి వచ్చే టైమవుతోంది" అని ఫోన్ పెట్టేసిందావిడ.

లైన్ కట్ అయిపోవడంతో ఫోన్ వంక చూసి, నందకిషోర్ వంక చూసింది వర్ణ. 'ఈ రోజుల్లో కనీసం సెల్‌ఫోన్ కూడా లేకుండా ఇంకా ల్యాండ్‌లైన్ మీదే ఆధార పడ్డ ఇల్లాలు.. భర్తకి ఇంకా భయపడు తూనే బతుకుతున్న ఇల్లాలు..' అనుకోగానే శ్యామల మీద జాలి కలిగింది వర్ణకి. 'ఒక నాటి మేల్ డామినేషన్ జెనరేషన్‌కి ఇంకా మిగిలున్న నిదర్శనం ఈవిడ' అని మన సులో అనుకుంది వర్ణ.

ఆత్రుతగా ఆమెవంకే చూస్తూ నందకి షోర్ "అమ్మ ఇంకేమంది? " అనడిగాడు.

"నిన్ను చాలా జాగ్రత్తగా చూసుకోమ న్నారు. నీకు నచ్చినవాటిని అమ్మలా వండి పెట్టమన్నారు. టైంకి నిద్రపోబెట్టమ న్నారు. జాబ్‌కి వెళ్ళనని మారం చేస్తే, చేయి పట్టుకుని తోడు వెళ్ళి, దించి రమ్మ న్నారు.." ఇంకా ఏవో చెప్పబోయింది వర్ణ.

అప్పటికే.. "ఓయ్! అవన్నీ అమ్మ చెప్పిందా? " అంటూ ఆమె భుజం మీద చరిచాడు నందూ.

మరో దెబ్బ వెయ్యబోయిన అతని చేతిని గట్టిగా పట్టుకుని మురిపెంగా నవ్వుతూ నందకిషోర్ గుండెల్లో ఒదిగిపో యింది వర్ణ. అంతలోనే తలెత్తి, "నందూ! నువ్వు ఏడుస్తావు కూడానా! ఫస్ట్ టైం చూస్తున్నాను, మగవాళ్ళు ఇలా ఏడవడం! ఏడుస్తున్నా భలే స్మార్ట్‌గా ఉన్నావు తెలుసా!" అని రాబోతున్న నవ్వుని ఆపు కుంటూ అంది వర్ణ.

"ఏడుస్తాను, ఏడ్చేవాళ్ళని చూసి నవ్వేవా ళ్ళని కొరికేస్తాను కూడా.." అంటూ చటు క్కున ఆమె బుగ్గని మునిపళ్ళతో గట్టిగా పట్టుకున్నాడు నందకిషోర్.

బుగ్గల్లో జివ్వుమన్న ఆ స్పర్శ వర్ణ శరీ

## విశిష్ట వారధులు

వంతెనలు ఓ తీరం నుంచి మరో తీరానికి చేర్చే కట్టడాలు. కొన్ని విశేషమైన వంతెనలు..

★ చైనాలోని షాండన్ ప్రావిన్స్‌లోగల మౌంట్‌టాయ్, ఆ దేశంలోని ఐదు పవిత్ర పర్వతాల్లో ఒకటి. ఇక్కడ ఇమ్మార్టల్ బ్రిడ్జ్ ఉంది. మూడు పెద్ద బండ రాళ్ళు, అనేక చిన్నరాళ్ళతో ఓ లోయ మీద, రెండు పర్వతాలకి మధ్య ఉన్న ఈ వంతెన విశిష్ట మైనది. ఇది సహజంగా ఏర్ప డిందో లేక ఎవరైనా ఏర్పాటు చేశారో తెలీదు.



★ ఉత్తర ఐర్లండ్‌లో 'బేలిం టాయ్' అనే చోట తాళ్ళతో పేనిన సస్పెన్షన్ బ్రిడ్జ్ ఉంది. ఇది మెయిన్ లేండ్ నుంచి కేరిక్ ద్వీపాన్ని కలుపుతుంది. ఇరవై మీటర్ల పొడవుగల ఇది పర్యాటక ఆకర్షణగా మారడంతో ఏటా సగ టున రెండున్నరలక్షలమంది సందర్శిస్తున్నారు.

★ కొలరేడోలోని కేనన్ సిటీలో 955 అడు గుల ఎత్తున ఆర్కన్సాస్ నది మీద గల 'ది రాయల్ గార్డ్జ్ బ్రిడ్జ్' పొడవు 1, 260 అడు గులు. ఇది ప్రపంచంలో సముద్ర మట్టానికి అతి ఎత్తులో ఉన్న బ్రిడ్జ్!

★ ప్రపంచంలో అతి ప్రమాదకరమైన వంతెన ఉత్తర పాకిస్థాన్‌లో ఉంది. రావల్పిం డిలో ఉన్న ఈ వంతెనను అనేక నదులు, వాగుల మీద నిర్మించారు. దీని పేరు హుస్సయినీ హేంగింగ్ బ్రిడ్జ్. తాళ్ళ వంతెన మీద అడ్డంగా పరిచిన చెక్కలలో కొన్ని శిథిలమయ్యాయి. దీన్ని దాటడానికి అనుభవం అవసరం.

★ సైబీరియాలో విటెం నది మీద గల చెక్క వంతెన కూడా ప్రమాదకరమైనదే. 1870 అడుగుల పొడవున్న ఈ వంతెన ఓ కారు ప్రయాణిం చేంత వెడల్పు మాత్రమే ఉంది. వంతెనకి అటుఇటు రైలింగ్స్ లేవు! నిపుణులైన డ్రైవర్లు మాత్రమే సురక్షితంగా వంతెనను దాటగలరు. దీన్ని దాటడానికి మూడున్నర నిమిషాలు పడుతుంది. 15మీటర్ల అడుగున దీని కింద నీళ్ళు ప్రవహిస్తుంటాయి.

★ బదరీనాథ్‌కి సుమారు పదికిలోమీటర్ల దూరంలో సరస్వతి నది పుట్టేచోట ఉన్న ఓ వంతెనను 'భీముడి వంతెన' అని పిలుస్తారు. నదికి అటుఇటు గల రెండు పర్వతాల మధ్య బలమైన అతిపెద్ద శిల ఇరుక్కుని వంతెనగా ఉపయోగపడుతోంది. భీముడు స్వర్గయాత్ర ప్పుడు దీన్ని ఏర్పాటు చేశాడని స్థానికులు చెప్తారు!

రంలోని నరనరాన్ని ఉద్రేకపరిచింది. వెంటనే తన్మయత్వంతో కళ్ళు మూసుకుని, మౌనంగా అతనికి మరింత దగ్గరగా జరిగి రెండు చేతులతో అతన్ని చుట్టేసిందామె.

ఇంతకుముందు వారించే వర్ణ.. ఇప్పుడు అతనికి స్వేచ్ఛనిచ్చినట్టుగా అలా తనకు తానుగా హత్తుకుపోవడంతో, ఆమె ఇప్పు డు తన అర్ధాంగి అన్న భావన మెదిలి అమాంతం ఒక్కసారిగా ఆమెని ముద్దుల్లో ముంచెత్తాడు నందూ. ఆ క్షణంనుంచి వా ళ్ళిద్దరి ఊపిరులూ, ఉద్వేగాలూ ఒక్కటిగా మారడానికి ప్రయత్నం మొదలుపెట్టాయి.

★ ★ ★

ఏమో గిన్నెల చప్పుడు వినిపిస్తోంటే బద్ధకంగా కళ్ళు తెరిచింది వర్ణ. కళ్ళు తెర వగానే తన చుట్టూ ఉన్న వాతావరణం లోని తేడాకి ఉలిక్కిపడిందామె.

నిన్న నందకిషోర్‌తో జరిగిన పెళ్ళి గుర్తుకు రాగానే, చటుక్కున మంచం మీద నుంచి దిగింది వర్ణ. చప్పుడు కిచెన్ లోప ల్నుంచి వినిపిస్తోంటే అటు నడిచింది.

అక్కడ నందకిషోర్ స్టవ్ వెలిగించి పాలగిన్నెని దాని మీద పెడుతున్నాడు. స్టవ్ మీద అప్పటికే పెట్టిన కుక్కర్ విజిల్ పైకి లేస్తూ ఒక్కసారిగా సుయ్యిమంది.

అతన్నలా కిచెన్‌లో చూడగానే ఆమె

పెదవులు చిన్నగా విచ్చుకున్నాయి. "గు డ్మాణింగ్ నందూ!" అని ముద్దుగా అంటూ అతన్ని వెనకనుంచి హత్తుకుని, అతని వీపుకి చెంపని ఆన్చి, నిశ్చింతతో కనులు మూసుకుంది వర్ణ.

"గుడ్మార్నింగ్! నిద్ర బాగా పట్టిందా? " అంటూ ఆమె చేతుల్ని విడిపించుకుంటూ వెనక్కి తిరిగాడతను.

అంతకుముందు రోజూ పగలు చూసే ముఖానికి భిన్నంగా ఉంది ఆ ఉదయపు కాంతిలో వర్ణ ముఖం. ఇంకా పూర్తిగా తెరుచుకోని కళ్ళు.. ముడుచుకుని ముద్దగా ఉన్న పెదవులు.. పల్చబడక విశాలమవని చెంపలూ.. నిద్ర బిగువుతో నునుపెక్కిన చర్మం.. ఇంకా భావోద్వేగాలు ఆక్రమించు కోని వర్ణ ముఖాన్ని చూస్తుంటే ఒక మధు రానుభూతిలా అనిపించింది నందూకి.

అప్పుడే నిద్రలేచిన పసిపిల్ల ముఖంలా మాయామర్మం అంటనట్టు చాలా అందంగా కనిపిస్తున్న వర్ణని అలాగే చూస్తుండిపోయాడు నందకిషోర్.

"ఇద్దరం ఫోర్ డేస్ లీవ్ తీసుకున్నాం కదా! ఇంత ఎర్లీగా లేవడం, ఇలా కిచెన్‌లో హైరానా పడడం ఎందుకు? " అని గారంగా అంటూ నందకిషోర్ ముఖంలోకి చూసింది వర్ణ.

"డైలీ ఎర్లీగా లేవడం అలవాటు. ఈ రోజూ అలాగే మెలకువ వచ్చేసింది. సర్లే! త్వరగా రెడీ అవ్వు! మా ఇంటికి వెళదాం! ఇన్‌స్టెంట్ ఇడ్లీ పౌడర్ ఉంది. టిఫిన్ ప్రిపేర్ చేసేస్తున్నాను. సాంబార్ కూడా పెడుతున్నాను. ఇడ్లీ సాంబార్ నీకు ఓకేనా? " అన్నాడు నందూ.

నిన్న వాళ్ళ అమ్మగారితో మాట్లాడాక అతనికి వాళ్ళ పేరెంట్స్ మీద బెంగగా ఉందేమో? ఆ ఫీలింగ్‌తో రాత్రి సరిగా నిద్రపోయి ఉండడు అనిపించింది వర్ణకి.

అతని వంక ఇష్టంగా చూస్తూ "ఓకె! అయితే.. నాకు దమ్ముంది! నీకు దమ్ముందా? నాకు టెన్ మినిట్స్‌లో రెడీ అయి వచ్చే దమ్ముంది! నీకు టెన్ మిని ట్స్‌లో వంట ఫినిష్ చేసే దమ్ముందా? " అని సినిమా డైలాగుల్తో ఛాలెంజ్ చేస్తు న్నట్టుగా నవ్వుతూ అడిగింది వర్ణ.

"హలో! దమ్మేంటమ్మా..? పెళ్లయిన ఫస్ట్ డే అని ఏదో మోజుతో పెళ్ళానికి వంట చేసి పెడుతున్నాను. ఈ రోజుకి దమ్ములూ, ఛాలెంజ్‌లూ ఓకే! రేపట్నుంచి మాత్రం కాదు" అన్నాడతను.

అతని ముఖంలోని భావాన్ని చూసి, "నిన్ను ఇబ్బంది పెట్టనులేరా నందూ! తొందరలోనే వంట చెయ్యడం నేర్చేసుకుం టాలే!" అంటూ నవ్వింది వర్ణ.

"అదేంటి? కొంచెం వచ్చన్నావ్‌గా!"

"కొంచెం కొంచెం వచ్చు! స్టవ్ వెలిగిం చడం.. ఆఫ్ చెయ్యడం.. గిన్నెల్ని స్టవ్ మీద పెట్టడం! లాంటివన్నీ వచ్చు. ఇక ఆ గిన్నెలో ఇన్‌పుట్ వేసి, అవుట్ పుట్ రప్పించే ప్రాసెసింగ్ ఒక్కటి మాత్రమే నేర్చుకోవాలి!" అని కళ్ళని పెద్దవి చేసి టక టకా చెబుతున్న వర్ణని చూసి గట్టిగా నవ్వాడు నందకిషోర్.

ఇంకా నవ్వుతూనే, "ఈ మాటలు ఇక్కడ కాదమ్మా! ఇప్పుడు మా ఇంటికి వెళుతున్నాంగా! అక్కడ మా అమ్మ ముందు చెప్పు!" అన్నాడు.

అతని నవ్వుని చూస్తూ, 'తాము ఎప్పుడూ ఇలా నవ్వుతూనే లైఫ్‌లాంగ్ చాలా హ్యాపీగా ఉండాలి' అనుకుంది వర్ణ.

ఆమె కూడా చిన్నగా నవ్వుతూ, "వద్దో ద్దులేగానీ, ప్రస్తుతానికి పనుల్ని ఇద్దరం షేర్ చేసుకుందాం! సాంబార్ నువ్వు చెయ్యి. ఇన్‌స్టెంట్ ఇడ్లీ పౌడర్ ఉందన్నా వుగా! నేను ఇడ్లీ చేస్తాను. ఏదీ పిండి ఎక్కడుంది? " అడిగింది వర్ణ.

మరో అర్థగంటకి ఇద్దరూ రెడీ అయ్యి టిఫిన్ చేయడానికి డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నారు.

సాంబార్‌లో ఇడ్లీని స్పూన్‌తో తింటూ, "హబ్బ! ఎక్సలెంట్ నందూ!" అందామె.

వర్ణ ఇష్టంగా తింటుండడాన్ని చూసి చిన్న నవ్వు నవ్వాడతను.

ఇద్దరూ టిఫిన్ చేసిన తరువాత ఇంటికి తాళం వేసి, బయటకు వచ్చారు.

లేత గులాబిరంగు చీరలో పువ్వుకంటే అందంగా, సుకుమారంగా ఉన్న వర్ణ వంక అపురూపంగా చూశాడు నందూ. రోజూ పంజాబీ డ్రెస్‌లూ, చుడీదార్లూ, జీన్స్ ప్యాంట్లు, క్యాప్రీలూ, టాప్స్‌లో ఉండే వర్ణ ఇప్పుడు రోజుటికంటే చాలా అందంగా కనిపిస్తోంది అతని కళ్ళకి. పెళ్ళి తర్వాత ఆమెలో ఒకలాంటి ముగ్ధత్వం కనిపిస్తూ, ఆమెలోని అందం అతని కళ్ళకి భిన్నంగా మరీమరీ బాగా తెలుస్తుంటే, వర్ణపైనుంచి కళ్ళని తిప్పుకోలేకపోతున్నాడు అతను.

నందూ స్టార్ట్ చేసిన బైక్ మీద ఒద్దికగా కూర్చుంది వర్ణ.

మరో పావుగంటకల్లా ఇద్దరూ నందకిషోర్ వాళ్ళ ఇంటికి చేరుకున్నారు.

వాళ్ళిద్దరూ ఇంటికి వెళ్ళేసరికి నందకిషోర్ వాళ్ళనాన్న తులసీరామ్‌గారు హాల్లోనే కూర్చుని ఉన్నారు.

నందకిషోర్, వర్ణ గుమ్మం దాటి నిదానంగా ఇంట్లోకి అడుగుపెట్టారు.

ఆయనను చూస్తూనే దగ్గరకు వెళ్ళి "ఆశీర్వదించండి మామయ్యగారు!" అంటూ వంగి తులసీరామ్‌గారి కాళ్ళకు నమస్కరించింది వర్ణ.

హఠాత్తుగా జరిగిన ఆ సంఘటనకి ఉలిక్కిపడిన తులసీరామ్‌గారు తలెత్తి కొడుకు వంక సీరియస్‌గా చూసి, లేచి గబగబా లోపలికి వెళ్ళిపోయారు.

ఇలా జరుగుతుందని ముందుగానే ఊహించిన నందకిషోర్ ఏమాత్రం బాధపడకుండా, "రా వర్ణా! అమ్మని కలుద్దాం!" అంటూ వర్ణ చేయి పట్టుకున్నాడు.

మామగారి తిరస్కారాన్ని పట్టించుకోకుండా అతని వెంట చనువుగా ఇంట్లోకి

## కొత్తగాలి...

**కలపకు త్వరలో**
**కరువొస్తుందేమో!**
**సామాన్యుడికే ప్రతిశాఖలో**
**పెద్దపీట వేస్తామంటున్నారు!**

– తటవర్తి రామకృష్ణ,
హైదరాబాద్

నడిచింది వర్ణ.

వంటగదిలో హడావుడి పడుతూ వంట చేస్తున్న శ్యామల.. అలికిడికి అసంకల్పితంగా వెనక్కి తిరిగి చూసింది.

హఠాత్తుగా ప్రత్యక్షమైనట్టు ఎదురుగా నిలబడున్న కొడుకుని చూడగానే ఆవిడ కళ్ళు ఆశ్చర్యంతో విప్పారాయి. ఆనందంతో వెలిగిపోతున్న ఆవిడ ముఖం పువ్వులా విచ్చుకుంది. "ఏరా నందూ! ఇది నిజమా! ఇంత పొద్దున్నే ఇద్దరూ వచ్చారా? " అంటూ కొడుకునీ, పక్కనే ఉన్న కోడల్నీ నమ్మలేనట్టుగా చూస్తూ అంది శ్యామల.

లేత రంగు కలనేత చీరలో, నుదుట గుండ్రని పెద్ద కుంకుమబొట్టుతో, కళ్ళకి నల్లని కాటుకతో, చేతుల నిండుగా ఆకు పచ్చరంగు మట్టిగాజులతో, పసుపు పచ్చని శరీరంతో, సన్నగా ఉన్న శ్యామలనీ, ఆమెలోని సంతోషాన్ని అపురూపంగా చూస్తూ వంగి కాళ్ళకి నమస్కరించింది వర్ణ.

"ఆశీర్వదించండి అత్తయ్యా!" అంటున్న వర్ణని గబుక్కున లేపుతూ "మీ ఇద్దరూ నిండు నూరేళ్ళపాటూ చల్లగా ఉండాలమ్మా!" అంది శ్యామల.

ఆ వెంటనే కొడుకుతో "నందూ! నాన్నతో మాట్లాడావా? రా! ఇద్దరూ నాన్నకు కనిపించండి!" అంటూ కొడుకు

చేతిని పట్టుకుని గబగబా వంట గది లోంచి బయటకు వచ్చింది శ్యామల.

ఇంట్లోకి అడుగుపెట్టగానే జరిగిన విషయాన్ని ఆవిడకి చెప్తే ఫీలవుతుందేమోనని, చెప్పలేదు నందకిషోర్, వర్ణలు.

"ఏమండీ!" అని పిలుస్తూ కిచెన్‌లోంచి హాల్లోకి వచ్చిన శ్యామల, అక్కడ భర్తని చూసి ఆశ్చర్యంతో నిలబడిపోయింది.

కొన్నిక్షణాల క్రితం వరకూ లుంగీ, బనీనుతో ఉన్న ఆయన, ఇప్పుడు.. ఇంకా ఎనిమిది గంటలు కూడా కాకుండానే హఠాత్తుగా ప్యాంటూ షర్టులో కనిపించేసరికి బిత్తరపోయింది శ్యామలు.

రోజూ తొమ్మిది గంటలు దాటిన తరువాతే ఆఫీస్‌కి బయల్దేరే మనిషి ఈ రోజు ఇంత పెందళకడే బయలుదేరుతున్నారూ అంటే... వీళ్ళని చూసే అలా వెళ్ళిపోతున్నారని అర్థమైంది ఆవిడకి.

శ్యామల వంకా, ఆమె పట్టుకున్న కొడుకు చేతి వంకా, నందకిషోర్ వంకా, కోడలి వంకా మార్చి మార్చి చూసి "శ్యామలా! నేను ఆఫీస్‌కి వెళ్తున్నా! నా మాట మీద గౌరవం లేనివాళ్ళు నా ఇంటికి రానవసరంలేదని చెప్పు. నేను ఇన్నేళ్ళూ మంచివాడిగా ఉన్నాను, మంచివాడిగా పేరు తెచ్చుకున్నాను. ఈ రోజు వాడు తప్పటడుగు వేసి ఆ తప్పుని సరిదిద్దుకోవడం కోసం అందరిలో నన్ను విలన్‌ని చెయ్యొద్దని చెప్పు. నలుగురూ వాడు తండ్రి మాట వినలేదనుకోరు. తండ్రే వాడి ఇష్టాన్ని కాదన్నాడనీ, ఇంటికి వచ్చినా మాట్లాడని కర్కోటకుడూ అని అందరూ అనుకునేలా నా మంచితనం మీద చెడ్డవాణ్నన్న ముద్ర వేయొద్దని చెప్పు వాడికి.." అని అరిచినట్టు గట్టిగా చెప్పి, ఇంట్లోంచి విసవిసా వెళ్ళిపోయారు తులసీరామ్.

కొత్తజంట కళకళలాడుతూ ఇంటికి వచ్చినా ఇంకా పంతం వదలక ఇంట్లోంచి వెళ్ళిపోతున్న భర్త వంక నిస్సహాయంగా చూస్తుండిపోయింది శ్యామల.

'ఇక ఈ ఇంటికి రావద్దు' అని చెప్పకనే చెప్పిన తండ్రి మాటల్ని విన్న తరువాత కూడా ఇంకా అక్కడ ఉండబుద్ధి కాలేదు నందకిషోర్‌కి.

తల్లి వంక తిరిగి, "వెళ్ళొస్తానమ్మా!" అని మాటలు రానట్టు నిదానంగా అన్నాడు.

'కొడుకూ, కోడలూ వచ్చారు.. ఈ రోజు ఇక్కడే ఉంటారు' అనుకుంటూ ఎన్నో ఊహించుకున్న శ్యామల ఆనందం కొన్ని క్షణాల్లోనే ఆవిరిగా మారిపోయింది. భర్త ఆజ్ఞకి కట్టుబడి కొడుకూ, కోడల్ని ఇంట్లోంచి వెళ్ళమని చెప్పలేక కళ్ళనిండా నీళ్ళతో వాళ్ళ వంక చూసింది.

అత్తగారి మనసులోని భావాల్ని చదివినట్టుగా వెంటనే శ్యామల చేతిని తన చేతిలోకి తీసుకుంది వర్ణ. "మామయ్యగారి కోపంలో అర్థం ఉంది అత్తయ్యా! మా మమ్మీడాడీలు ఇంటర్ క్యాస్ట్ మ్యారేజ్ చేసుకోవడం వల్ల అటువైపు బంధువుల్నీ, ఇటువైపు బంధువుల్నీ చాలా మిస్సయ్యాం! అంకుల్ కూడా ఇలాంటి ప్రాబ్లెంస్ గురించే ఆలోచించి ఉంటారనిపిస్తోంది. అలా చూస్తే అంకుల్ ఆలోచనలూ కరెక్టే. ఆయనకి ఇష్టం లేదని తెలిసినా నందూ, నేనూ పెళ్ళి చేసుకున్నాం. తప్పు మాదే" అని మామయ్యగారి కోపాన్ని సమర్థిస్తున్నట్టుగా, పశ్చాత్తాపంతో అంటుంటే కళ్ళు తడిబారి మాట్లాడ్డం ఆపేసింది వర్ణ.

ఆ మాటలకి చలించిపోతూ "అయ్యో! ఇందులో తప్పొప్పులనే మాటలు ఎందుకమ్మా! స్నేహితుని కూతుర్ని నందూకి మాట్లాడిన విషయం ఆయన నందూతో చెప్పలేదు. నిన్ను ఎప్పటి నుంచో ఇష్టపడుతున్న విషయం నందూ మాతో చెప్పలేదు. అయినా ఆయనొట్టి భోళామనిషి! కోపం తగ్గితే, ఆయనే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తారు" అని చెబుతూ కోడలి తల నిమిరింది శ్యామల.

అ
క్ష
రం

దేశం అభివృద్ధి చెందడమంటే
అద్దాల మేడలు, రంగుల గోడలు కాదు!
పౌరుని నైతికాభివృద్ధే నిజమైన అభివృద్ధి!

– డా. బి.ఆర్. అంబేడ్కర్



చిన్నగా తల ఊపుతూ, "వెళ్ళొస్తాం అత్తయ్యా!" అంది వర్ణ.

నందకిషోర్ తల్లి వంక చూస్తున్నాడు తప్ప ఏమీ మాట్లాడలేకపోతున్నాడు.

'తండ్రి స్నేహితుని కూతురికి పెళ్ళి గత సంవత్సరం జరిగిపోయింది. తానూ పెళ్ళి చేసేసుకున్నాడు. ఇక తండ్రి కోపం తగ్గిపోతుందిలే!' అనుకున్నాడు తను. కానీ ఇకపై ఇక్కడకి రావద్దని తండ్రి అంత పట్టుదలతో కోపంగా చెప్పడం చూసిన తర్వాత ఇక ఈ ఇంటి నుంచి తన జీవితం వేరు పడిందనీ, తల్లిదండ్రులకి దూరమై తామిద్దరమే ఏకాకుల్లా ఉండాలనీ అర్థమవుతోంది అతనికి. అందుకే.. అతని నోట్లోంచి మాటలు రావడం లేదు.

శ్యామల కొడుకు వంక అనురాగంగా చూస్తూ "జాగ్రత్తరా నందూ! నాన్న గురించి ఆలోచనేం పెట్టుకోకు. ఆయన కోపం తగ్గిపోతుందిలే! అప్పుడప్పుడు నేను ఫోన్ చేస్తూంటాను" అని లోలోపల బెంగ పడుతూనే చెప్పింది.

చిన్నగా తలూపి అక్కడ నుంచి బయటకు నడిచాడు నందకిషోర్. అతన్ని అనుసరించి కదిలింది వర్ణ.

వాళ్ళిద్దరూ బైక్ మీద వెళ్ళిపోతుంటే, గుమ్మంలో నిలబడి అలాగే చూడసాగింది శ్యామల. ఆవిడ గుండెల్లో ఓ మూల ఏదో తెలియని బాధగా అనిపించింది. కొడుకూ, కోడలుతో ఇల్లు కళకళలాడాలి అని ఎప్పుడూ ఊహించుకునే ఆవిడకి.. ఇప్పుడు వాళ్ళు కనీసం కళ్ళ ముందు కూడా లేకపోవడం, భర్త వాళ్ళని ఇంకెప్పుడూ రావద్దనడం చాలా బాధని కలిగిస్తోంది.

'వర్ణని ఫలానా రోజున పెళ్ళి చేసుకుంటున్నా' అని నందూ చెప్పినప్పుడు ఇంట్లోంచి పొమ్మని కోపంగా అన్న తులసీరామ్‌గారు ఆ మర్నాడే, 'పొమ్మంటే మాత్రం ఇంట్లోంచి వెళ్ళి అద్దె కొంపలో ఉండడమేనా! తండ్రన్నాక ఆ మాత్రం తిట్ట కూడదా!' అన్నారు.

మొన్న కొడుకు ఇంటికి వచ్చి.. గుళ్ళో పెళ్ళికి రమ్మని పిలిచినప్పుడు మౌనంగా ఉన్నారే తప్ప కోపంతో కేకలేయలేదు. అందుకే భర్తకి కొడుకు మీద కోపం పోయుంటుంది అనుకుందామె.

వస్తున్న కన్నీళ్లని తుడుచుకుంటూ, కనుమరుగవుతున్న కొడుకు బండి వంకే చూడసాగింది శ్యామల.

★ ★ ★

నిర్లిప్తంగా బైక్ నడుపుతున్నాడు నందు.

వాచ్ వంక చూసుకుని, "నందూ! మా ఇంటికి కూడా వెళ్ళొచ్చేద్దామా!" అని సడెన్‌గా అడిగింది వర్ణ.

ఏదో ఆలోచనలో కూరుకుపోయిన నందూకి వినబడక, "ఏంటీ? " అన్నాడు.

"మా ఇంటికి పోనివ్వు!" అని మళ్ళీ చెప్పింది వర్ణ.

"నిన్న వద్దన్నావ్!" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవున్లే! కానీ, కలిస్తే బావుంటుందనిపించింది!" అందామె.

"సరే!" అంటూ బైక్‌ని వర్ణా వాళ్ళ ఇంటి వైపు పోనిచ్చాడు. మరో పావుగంటకి వాళ్ళిద్దరూ వర్ణ ఇంటి ముందు ఉన్నారు.

అయిదొందల గజాల స్థలంలో చూడ

ముచ్చటగా కట్టుకున్న ఇండివిడ్యువల్ హౌస్ అది. ఇంటి మెయిన్‌గేటుకి ఒక పక్కనున్న పిల్లర్ మీద 'బి. సుమణి, రీజనల్ మేనేజర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా' అనీ, మరో పక్కనున్న పిల్లర్ మీద 'జె. ప్రతాప్‌రెడ్డి, సివిల్ ఇంజినీర్, కాంట్రాక్టర్' అని చెక్కిన గ్రానైట్ రాళ్ళు మెరుపులీనే అక్షరాలతో అందంగా అమర్చి ఉన్నాయి. మెయిన్‌గేటు దాటగానే కుడి పక్కన పెద్ద లాన్, ఆ పక్కగా కొబ్బరి, జామ, మామిడి, బొప్పాయి చెట్లున్నాయి.

ఉదయాన్నే వచ్చిన వాళ్ళిద్దర్నీ చూసి ఆశ్చర్యపోతూనే ఆహ్వానించారు వర్ణ వాళ్ళ అమ్మ సుమణి, నాన్న ప్రతాప్‌లు.

వర్ణ ముఖంలో పెళ్ళికళ వచ్చిందా? లేదా? అన్నట్టు పరిశీలనగా చూస్తూ "పెళ్ళి ఎలా జరిగిందే? మీరేం ఇబ్బంది పడలేదు కదా! అన్నీ కరెక్ట్‌గానే జరిగాయా? " అని ఆరాగా అడిగింది సుమణి.

"బాగానే జరిగింది.." అని ముభావంగా చెప్పింది వర్ణ.

నందకిషోర్ వెనకగా లోపలకు వచ్చి ప్రతాప్‌గారు డోర్ వేసి "హౌ ఆర్యూ న్యూ హస్‌బెండ్? " అని నవ్వుతూ అల్లుడిని పలకరించారు.

చిన్నగా పెదవులు కదిల్చి "ఫైన్ అంకుల్!" అన్నాడు నందకిషోర్.

"నో! యూ ఆర్ రాంగ్! అసలు నీలో ఆ న్యూ ఫైర్ ఎక్కడా కనిపించట్లేదేం..! హస్‌బెండ్‌ని అప్పుడే బెండ్ చేసేసిందా న్యూ మిసెస్!" అంటూ వాళ్ళిద్దరినీ టీజ్ చేస్తున్నట్టుగా అన్నారు ప్రతాప్.

నవ్వి ఊరుకున్నాడు నందకిషోర్.

"ఊఁ!.. సంథింగ్ ఈజ్ రాంగ్ మైడియర్ నందూ! యూ లుక్ లైక్ మి!" అని మళ్ళీ టీజ్ చేశారు ప్రతాప్‌గారు.

తల్లి వెనక కిచెన్‌లోకి వెళుతున్న వర్ణ వెనక్కి తిరిగి చూసి "డాడీ! డోన్ట్ ప్లే జోక్స్ నౌ! మేం నందూ వాళ్ళ ఇంటి నుంచి వస్తున్నాం!" విసురుగా చెప్పింది.

'అవునా!' అన్నట్టు కనుబొమ్మలు పైకెత్తి నందకిషోర్ వంక చూశారు ప్రతాప్.

సుమణి, వర్ణ కిచెన్‌లోకి వెళ్ళారు. అప్పటికే డైనింగ్ టేబుల్ మీద టిఫిన్ రెడీ చేసి ఉంది. సుమణి టేబుల్ మీద మరో రెండు ప్లేట్లు పెట్టబోతుంటే "మేం టిఫిన్ చేసే వచ్చాం మమ్మీ!" అంది వర్ణ.

"మీ అత్తగారింట్లోనా..!" అని ఆశ్చర్యంగా అడిగింది సుమణి.

'అసలు నందూ వాళ్ళ పేరెంట్స్ వర్ణతో సరిగ్గా మాట్లాడుతారో? లేదో? అని అనుకుంటోంది. అలాంటిది టిఫిన్ కూడా పెట్టి పంపారా? ' అన్న అనుమానం తొంగి చూసింది సుమణిలో.

"ఊహు! మా ఇంట్లోనే తిని బయలుదేరాం. ఇడ్లీ సాంబార్! నందూ చేశాడు" అని గబుక్కున అనేసింది వర్ణ.

కనీకనిపించనట్టు నవ్వుతూ కూతురు ముఖంలోకి చూసింది సుమణి. "ఓహో! టూ నైస్! వంట వచ్చిన హస్‌బెండ్ దొరకడం కూడా లక్కీనే!" అంటూ వర్ణ బుగ్గని ముద్దుగా లాగింది. అంతలోనే ఏదో గుర్తుకొచ్చినట్టుగా కూతురి ముఖంలోకి పరిశీలనగా చూస్తూ "ఫ్యామిలీ ప్లానింగ్ ఏమైనా ప్లాన్ చేసుకున్నావా? " అని ఆరా తీస్తున్నట్టుగా అడిగింది సుమణి.

నొసలు ముడిచి "ఫ్యామిలీ ప్లానింగా? అంటే.. కిడ్స్ గురించా..? " అంది వర్ణ.

"ఊఁ! ఇద్దరూ ఇప్పుడే లైఫ్ స్టార్ట్ చేశారు. అప్పుడే పిల్లలూ, వాళ్ళ కేరింగూ అంటూ బరువుని మీద వేసుకోకండి. ఏమంత పెద్ద వయసొచ్చేసిందనీ. మొన్నేగా ఇరవై అయిదు కంప్లీట్ అయ్యింది. డాక్టర్‌ని కలిసి రెండు మూడేళ్ళు ప్లానింగ్ తీసుకో. ఈ లోపు మీ అత్తామామలు కూడా కోపం పోయి మీకు దగ్గరవుతారు" అంది సుమణి.

"నందూకి చెబుతాను. అతనికీ ఓకే

## భూప్రదక్షిణ విశేషాలు

చతుర సమాచారం

భూమి మీద ఓ వైపు బయలుదేరి దిక్కులు మారకుండా మళ్లీ అక్కడికే చేరితే భూప్రదక్షిణ పూర్తవుతుంది. ప్రపంచంలో దీన్ని సాధించినవాళ్లు చాలాతక్కువమంది. అలాంటి కొందరి గురించి..

★ 'రన్నింగ్ మేన్'గా పేరు పొందిన బ్రిటిష్ రన్నర్ రాబర్ట్‌గార్‌సైడ్ ఐదేళ్ల ఎనిమిది నెలల పాటు 35 వేల మైళ్లు పరిగెత్తి భూప్రదక్షిణ పూర్తి చేశాడు. మొత్తం 30 దేశాలు దాటాడు.



★ న్యూజిలాండ్‌కు చెందిన లారాడెకర్ అనే పద్నాలుగేళ్ల అమ్మాయి జిబ్రాల్టర్ నుంచి ఆగస్టు 2010లో 38 అడుగుల పడవలో ప్రయాణం ఆరంభించి ఏడాదిన్నర తర్వాత జనవరి 2012కి కరీబియన్ ఐలండ్స్‌లోని సెయింట్ మార్టిన్‌కి చేరుకుని భూప్రదక్షిణ పూర్తి చేసింది.

★ 1999లో బెర్ట్రాండ్ పికార్ట్(41), బ్రియన్ జాన్స్(51) అనే ఇద్దరు హాట్ ఎయిర్ బెలూన్‌లో భూమికి 36 వేల అడుగుల ఎత్తున ఇరవై రోజులు ప్రయాణం చేసి మధ్యలో దిగకుండా భూప్రదక్షిణ చేశారు. ఇందుకు 3.7 టన్నుల ఇంధనాన్ని ఉపయోగించారు.

★ మైక్‌హోల్ అనే బ్రిటిష్ ఇంజనీరు 2012లో సైకిల్ మీద ప్రపంచయాత్ర ఆరంభించి 107 రోజుల తర్వాత బయలుదేరిన చోటికే చేరుకున్నాడు. 92 రోజులు సైకిల్ మీద సగటున రోజుకు 200 మైళ్లు చొప్పున 25 వేల మైళ్లు ప్రయాణించాడు. మిగిలిన 15 రోజులు విమానంలో ఖండాలు దాటాడు.

★ సోలార్ శక్తితో నడిచే పది హార్స్‌పవర్ 'సోలార్ ఇంపల్స్' అనే విమానంలో బెర్ట్రాండ్ పికార్డ్ ఏండ్రీబోర్ష్ బెర్గ్‌తో కలిసి అబుదాబీ నుంచి బయలుదేరి నాలుగు నెలల తర్వాత హవాయి దీవికి చేరుకున్నాడు. వీరు గంటకు సగటున 39 మైళ్ల వేగంతో ప్రయాణించారు. ఇంకా వారి ప్రయాణం కొనసాగుతోంది.

★ 1998లో కార్ల్‌బుష్ బై అనే బ్రిటిష్ పేరాట్రూపర్ ఇంగ్లండ్ నుంచి హిచ్‌హైకింగ్(లిఫ్ట్) ద్వారా ప్రపంచ యాత్ర చేపట్టాడు. దాన్ని 20 సంవత్సరాలలో పూర్తి చేయబోతున్నాడు. ఇప్పటికే సౌత్ అమెరికా, సెంట్రల్ అమెరికా, కెనడా, అలస్కాలని దాటి రష్యాలో ఉన్నాడు.

అంటే.." అని నిదానంగా అంది వర్ణ.

"నందూ ఓకే అంటేనేనా..? మతి ఉండే మాట్లాడుతున్నావా? రేపు నువ్ ప్రెగ్నెంటు అయితే బిడ్డని మొయ్యాల్సిందీ, కనాల్సిందీ, పెంచాల్సిందీ నువ్వే! నందూ కాదే ఫూల్.." అని ఒకింత కోపంగా అంది సుమణి.

తల్లి భావాల గురించి బాగా తెలిసిన వర్ణ ఎప్పట్లానే ఇంక ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయింది. కొన్నిసార్లు తల్లిదండ్రుల మధ్య రిలేషన్‌ని చూసినప్పుడు.. వర్ణలో తొంగిచూసే ఆలోచనలే మళ్ళీ ఇప్పుడూ మెదిలాయి.

మమ్మీ, డాడీలు లవ్ మ్యారేజ్ చేసుకున్నా కూడా ఇలా 'నువ్వూ నేనూ, నీదీ నాదీ' అంటూ ఎందుకు ఇంకా సెపరేట్‌గా ఉండిపోయారు?

'పిల్లల విషయంలో నందూతో మాట్లాడనవసరం లేదు, అది నీ ఒక్కదాని ఇష్టమే' అన్నట్టుగా తల్లి మాట్లాడుతుంటే.. ఇప్పుడు.. ఆ మాటలు ఎందుకో వర్ణకి అస్సలు రుచించడం లేదు.

కూతురు ఏం మాట్లాడకుండా ఆలోచనలో పడడం చూసి "ప్రతీ విషయానికీ 'నందూ.. నందూ..' అంటూ అతని ఇష్టాయిష్టాలకే వేల్యూ ఇచ్చుకుంటూ వెళ్ళకు!




ముందు నీకు నువ్వు ప్రయారిటీ ఇచ్చుకోవడం నేర్చుకో! అన్నిట్లో కాకపోయినా అట్‌లీస్ట్ మన చేతుల్లో ఉండే విషయాలకైనా మనకి మనం ఇంపార్టెన్స్ ఇచ్చుకుంటేనే, మనకంటూ వేల్యూ ఉంటుంది. వింటున్నావా..? " రెట్టిస్తూ అంది సుమణి.

లోలోపల ఆలోచనల్లో మునిగిపోతూ పైకి మాత్రం, "ఉఁ!.." అంది వర్ణ.

"ఆడవాళ్ళు ఎప్పటికీ మా మీద డిపెండెంటే అన్న ఫీలింగ్ మగవాళ్ళందరికీ పుట్టుకతోనూ, వాళ్ళ పెరుగుదలలోనూ వచ్చేస్తుంది. అలాంటి ఫీలింగ్ నాకు తెలిసీ నందూలో కనబడలేదు. ఇకపై కనబడనివ్వకు కూడా.." అంది సుమణి.

"ఓకే మమ్మీ! ఆ విషయాలు వదిలెయ్! ఇంకేమైనా మాట్లాడు. మా న్యూ లైఫ్ ఎలా ఉందని అడగవేంటీ..? అత్తయ్యా వాళ్ళ ఇంటికి వెళ్ళాం. వాళ్ళు ఏమన్నారో తెలుసుకోవాలన్న క్యూరియాసిటీ లేదా నీకు? " అంటూ తల్లి మాటల్ని డైవర్ట్ చేసింది వర్ణ.

"న్యూ లైఫా? నీ ముఖం చూస్తే అర్థమవుతోంది! అసలు ఆ ముఖంలో ఉండాల్సిన యాక్టివ్‌నెస్ ఏది..? ఓసారి అద్దంలో చూసుకో! మీ అత్తయ్యావాళ్ళు ఏమన్నారో గుర్తు చేసి నిన్ను మళ్ళీ బాధ పెట్టడం నాకు ఇష్టం లేదు. జరిగిపోయిన దాని గురించి కాదు, ఫ్యూచర్ గురించి ఆలోచిస్తేనే ఎవరమైనా డెవలప్ అవ్వగలం.." అంది సుమణి.

తల్లి చెప్పింది నిజమేనని అనిపిస్తుంటే, చిన్నగా తలాడించింది వర్ణ.

సుమణి టైం చూసుకుని "ఈ రోజు బ్యాంక్‌కి రానని చెప్పేస్తాను. అందరం ఏదైనా మూవీ చూసి, బయట లంచ్ చేద్దాం! సరేనా! మీ మ్యారేజ్ పార్టీ నువ్వు ఎలాగూ ఇవ్వవుగా!" అని కూతురి ఆలోచనల్ని పోగొట్టటానికి నవ్విస్తూ అంది.



"నా మ్యారేజ్ పార్టీనా? అసలు మ్యారేజ్ చెయ్యాల్సింది, అందరికీ పార్టీ ఇవ్వాల్సింది నువ్వూ, డాడీ. అదెలాగూ లేదు. రివర్స్‌లో నన్ను పార్టీ అడుగుతున్నావా..!" కొంచెం కోపంగా అంది వర్ణ.

"ఊరకే అన్నాలేవే! మైండ్ ఎంత ఆబ్సెంట్‌లో ఉన్నా నువ్వూ, మీ నాన్నా లాజిక్‌లు వదలరు!" అంటూ కూతురు భుజం మీద చరిచి నవ్వేసింది సుమణి.

సరిగ్గా అప్పుడే, "సుమణీ! ఈ పూట నేను ఆఫీసుకి రానని ఫోన్ చేసి చేప్పేశాను. నువ్వూ బ్యాంక్‌కి సెలవు పెట్టకూడదూ!" అంటూ నందూతో పాటు అక్కడకు వచ్చారు ప్రతాప్‌గారు.

"నేనూ జస్ట్ ఇప్పుడే వర్ణతో అంటున్నా పెతాప్! బ్యాంక్‌కి లీవ్ పెట్టేస్తానని.." అని నవ్వుతూ అంది సుమణి.

ఆవిడ భర్తని వెరైటీగా 'పెతాప్' అని పిలుస్తుంటే ఆ గమ్మత్తయిన పిలుపునకు ఎప్పట్లానే వింతగా చూశాడు నందూ.

తల్లి చేయి పట్టుకొని, "లేదమ్మా! మాకు చిన్న పనుంది. మేం బయల్దేరతాం.." అంది వర్ణ.

కూతురి ముఖంలోకి గుచ్చిగుచ్చి చూస్తూ, "ఏంటే? అప్పుడే మీకంత పనులు!" అని మందలింపుగా అంది సుమణి.

ఇంక ఏం మాట్లాడినా తల్లి ఇలానే అంటుందనుకుంటూ తండ్రివైపు తిరిగి, 'నాకు చిన్న వర్క్ ఉంది డాడీ! అదీకాక కొలీగ్స్ వస్తామన్నారు కూడా!" అని తండ్రికి చెప్పింది వర్ణ.

ఇంట్లో దేనికైనా తల్లి ఒప్పుకోదు అనుకు

న్నప్పుడు దాన్ని తండ్రివైపు నుంచీ మ్యానేజ్ చేయడం వర్ణకి మామూలే.

"నీ ఇష్టంరా తల్లీ! క్యారీ ఆన్.." అంటూనే గబగబా బెడ్రూంలోకి వెళ్ళారు ప్రతాప్‌గారు. వెళ్ళిన రెండో నిమిషంలోనే తిరిగొచ్చి రెండు కీలూ, కొన్ని డాక్యుమెంట్స్ తీసుకొచ్చి వర్ణకి ఇచ్చారు ఆయన.

కనుబొమ్మలు ముడిచి 'ఏంటవి? ' అన్నట్టుగా చూసింది వర్ణ.

"ఇది నీ మ్యారేజ్‌కి మమ్మీ గిఫ్ట్! డబుల్ బెడ్‌రూం ఫ్లాట్! ఇది మీ ఇద్దరికీ నా గిఫ్ట్! హోండా సిటీ కార్! జాలీగా గడపండి!" అని నవ్వుతూ ఉత్సాహంగా ఫ్లాట్ డాక్యుమెంట్స్, కీస్ కూతురు చేతిలో పెట్టారు ప్రతాప్‌గారు.

భర్త పక్కకు వచ్చి నించుంటూ, తృప్తిగా కూతురి వంక చూసింది సుమణి.

తల్లిదండ్రులిద్దరి వంకా చూసి చిన్నగా నిట్టూర్చింది వర్ణ. ఆ వెంటనే నందూ వంక చూసింది. అతని ముఖంలో ఏ భావమూ లేదు. వర్ణని అలా చూస్తున్నాడంతే!

వెంటనే వర్ణ, తల్లి చేతినందుకుని ఆవిడ చేతుల్లో కాగితాల్నీ, కీస్‌నీ పెడుతూ, "మాకు మీరిచ్చే ఈ వేల్యుబుల్ గిఫ్ట్స్ కంటే, మా మ్యారేజ్‌లో మీ ఇద్దరి ప్రెజెన్సే నాకు ఇంకా ఎక్కువ హ్యాపీ ఇచ్చుండేది మమ్మీ! వెళ్ళొస్తాం..!" అని చెప్పి, తండ్రి కళ్ళలోకి చూసి గిరుక్కున వెనుదిరిగింది వర్ణ.

ఆమె చేసిన పనికీ, మాటలకీ ఆశ్చర్యపోతూనే ఆమె వెంట కదిలాడు నందూ.

వర్ణ వెళ్ళిపోతుంటే, ఆమె మాటల్లోని అర్థం నిదానంగా మెదడుల్లోకి చేరింది ప్రతాప్, సుమణిలకి. సుమణి చేతుల్లోని డాక్యుమెంట్స్, కీ జారి కింద పడ్డాయి. ఆ వెంటనే బయట బైక్ స్టార్ట్ అయిన శబ్దం వినిపించింది వాళ్ళిద్దరికీ.

★ ★ ★

ఇంటికొచ్చేదాకా మాట్లాడలేదు నందూ. 'తమ ఇంట్లో జరిగినదానికి హర్టయిన ఫలితంగానే, వర్ణ వాళ్ళ అమ్మానాన్నలని అలా హర్ట్ చేసేలా మాట్లాడిందా..!' అనిపించింది నందూకి. ఇంటికి రాగానే, అతను మంచినీళ్ళు తాగి వర్ణకీ తెచ్చిచ్చాడు.

"థాంక్యూ..!" అని వాటర్‌బాటిల్ తీసుకుని గటగటా నాలుగు గుక్కలు తాగి, పక్కన పెట్టిందామె.

వర్ణకి ఎదురుగా కుర్చీలో కూర్చుని ఆమెని చూస్తూ, "నువ్వు మీ పేరెంట్స్‌తో అలా మాట్లాడి ఉండాల్సింది కాదు వర్ణా!" అని మెల్లగా అన్నాడు నందూ.

"ఎలా మాట్లాడాలి? అయినా వాళ్ళని నేనేం అన్నానూ! అంత వేల్యూ ఉన్న గిఫ్ట్స్ కంటే వాళ్ళిద్దరూ మన పెళ్ళికి దగ్గర ఉంటే ఇంకా హ్యాపీగా ఫీల్ అయ్యేదాన్ని అన్నాను. అంతేగా! అది నిజం కాదా? తప్పేముంది? " అంటూ ఒక్కసారే అగ్నిపర్వతంలా బద్దలైంది వర్ణ.

"అది నిజమే! అందులో తప్పేం లేదు. కానీ, అప్పటికే నా దగ్గర అంకుల్ ఎంత ఫీల్ అయ్యారో తెలుసా! నిన్న వాళ్ళిద్దరూ లీవ్ పెట్టి ఇంట్లోనే ఉన్నారట! మనల్నే తలుచుకుంటూ భోజనం కూడా చెయ్యకుండా కూర్చున్నారట! 'ఒకే ఒక్క కూతురి పెళ్ళిని కళ్ళారా చూడలేకపోయామే' అని ఆల్రెడీ ఎంతో బాధ పడుతున్నారు వాళ్ళు. అలాంటి టైంలో వాళ్ళని ఇంకా బాధపెట్టడం కరెక్ట్ కాదు కదా!" అని వివరిస్తున్నట్టుగా అన్నాడు నందకిషోర్.

"ఏం? అంత బాధ పడేవాళ్ళు పెళ్ళికి రావచ్చుగా! గుడిలో జరిగిన పెళ్ళికి రాలేదు. పోనీ రిజిస్ట్రార్ ఆఫీసుకైనా రావచ్చుగా! సాక్షి సంతకాలు పెడితే వాళ్ళని ఎవరైనా క్వశ్చన్ చేస్తారు అనుకుంటే, పోనీ మధ్యాహ్నం నుంచి మనింటికైనా రావచ్చుగా నందూ! కనీసం మమ్మీ ఒక్క ఫోన్ అయినా చేసిందా? ఇలాంటప్పుడు కూడా ఎవరో ఏదో అనుకుంటారంటే ఎలా!" అని తల్లి మీద కోపాన్ని అతని మీద

చూపిస్తున్నట్టుగా గట్టిగా అడిగింది వర్ణ.

నవ్వుతూ వర్ణ దగ్గరకు వచ్చాడు నందూ. "వాళ్ళని అంటున్నావ్! ఏం? కనీసం నువ్వైనా ఒకసారి ఫోన్ చేయొచ్చుగా? పెళ్ళిలో మీ పేరెంట్స్ కోసం అటూ ఇటూ చూశావ్‌గానీ, ఆ టైంలో ఓసారి ఫోన్ చేసి పెళ్ళి జరుగుతోందనీ, అయిపోయిందనీ, ఇంటికొచ్చామనీ,.. నువ్వయినా చెప్పొచ్చుగా!" అంటూ వర్ణని దగ్గరకు తీసుకున్నాడు.

అతని చేతిని తోసేస్తూ, "ఏంటీ? వాళ్ళ వైపు మాట్లాడుతున్నావ్! నీకేం గిఫ్ట్ ఇచ్చారేంటీ మీ మామయ్య ప్రతాపరెడ్డిగారు" అని అనుమానంగా చూస్తూ వ్యంగ్యంగా అడిగింది వర్ణ.

ఆమెని అలానే చూస్తూనే రెండు చేతులతో వర్ణని చుట్టేశాడు నందకిషోర్. ఆమె బుగ్గమీద పెదవులాన్చి, "నాకు బాపూ బొమ్మలాంటి అందమైన భార్యని ఇచ్చారు. ఇంతకంటే ఇంకేం కావాలి? " అని మంద్రమైన గొంతుతో చెప్పాడు.

సీరియస్‌గా ఉన్న ఆమె ముఖంలో ఒక్కసారిగా సిగ్గు తొంగిచూస్తుంటే, బరువెక్కిన కనురెప్పల్ని భారంగా కిందకి వాల్చుకుంది వర్ణ.

"వర్ణా! చీరలో నువ్ చాలా బాగున్నావ్! రోజూ కట్టుకోవచ్చుగా!" మైమరపుగా అన్నాడతను.

"ఊహుఁ! శారీతో బండి మీద ఆఫీసుకి వెళ్ళడం కంఫర్ట్ కాదు"

"నేను బైక్ మీద డ్రాప్ చేస్తానుగా!"

"ఊఁ! సరేగానీ నందూ! ఒక మాట!" గోముగా అంటూ "ఊహు ఏం లేదూ! మనం కొన్నాళ్ళు ఫ్యామిలీ ప్లానింగ్ తీసుకుందామా? " అని అడిగింది.

"అలాగే నీ ఇష్టం!"

"ఫ్యామిలీ ప్లానింగ్ అనుకున్నాంగా! వదులు మరీ!" అందామె.

"రేపు డాక్టర్‌ని కన్సల్ట్ చేద్దాంలే! ఈ రోజుకి వదిలేయ్ ప్లీజ్!"

"ఊఁ! ఈ రోజుకా.. ఒకసారికా.." అని కొంటెగా అని నందూ ముఖంలోకి చూసి, అతని గుండెల్లో ఒదిగిపోయింది వర్ణ.




రాత్రి పది గంటల సమయం.

విశాలమైన ఆ ఇండివిడ్యువల్ హౌస్ నిదానంగా ఒక్కో విద్యుద్దీపపు వెలుగునీ కోల్పోతూ చీకటిలోకి మునుగుతోంది.

వరండాలోని లైట్లతో పాటూ హాల్లోని లైట్ స్విచ్ కూడా ఆఫ్ చేసి బెడ్‌రూమ్‌లోకి వచ్చింది సుమణి. అక్కడ బెడ్ మీద వాలుగా పడుకుని, రీడింగ్ గ్లాసెస్ పెట్టుకొని ఏదో ఇంగ్లీష్ నావెల్ చదువుకుంటున్నారు ప్రతాప్‌గారు.

భర్తని చూసి నిట్టూర్చి, వచ్చి మంచం మీద కూర్చుందామె.

వర్ణ ఉన్నంతవరకూ ఈ ఇల్లు బోలెడు మందితో ఉన్న ఇల్లులా కళకళలాడింది.

ఇప్పుడు వర్ణ లేకపోయేసరికి ఇల్లంతా బోసిగా అనిపిస్తోంది. 'ఒక్క మనిషిలోటు ఇంతగా ఉంటుందా? ' అనిపిస్తుంటే, మళ్ళీ భర్త వంక చూసిందామె.

తాను వర్ణని బాధ్యత అనుకుని పెంచి పెద్ద చేసింది. కానీ, ప్రతాప్ ప్రాణాలన్నీ వర్ణమీదే పెట్టుకున్నట్టు ఉండేవాడు. ప్రతి చిన్న విషయాన్ని కూడా వర్ణతో షేర్ చేసుకోనిదే ఆయనకి నిద్ర పట్టేది కాదు.

'ఇప్పుడు వర్ణ పెళ్ళిచేసుకొని వెళ్లిపోవడం

తనకే వెలితిగా ఉంటే, ప్రతాప్‌కి ఇంకెంత పెయిన్‌గా ఉంటుందో!' అనుకుంటూ భర్తకి దగ్గరగా కూర్చుంది సుమణి.

ప్రతాప్‌గారు రీడింగ్ గ్లాసెస్‌లోంచి కళ్ళెత్తి చూస్తూ "ఏంటీ? " అన్నారు.

"ఊహుఁ!" అంటూ తల అడ్డంగా ఊపింది సుమణి.

ఆయన మళ్ళీ పుస్తకంలో తలదూర్చి "నిద్ర రావడం లేదా? " అన్నారు.

"వర్ణ పెళ్ళిని దగ్గరుండి మనమే చెయ్యాల్సిందేమో పెతాప్!" నిదానంగా అందామె.

శబ్దం వచ్చేలా నిశ్వసించి పుస్తకాన్ని మూసి పక్కనే ఉన్న స్టూల్ మీద పెట్టారు ప్రతాప్‌గారు. తిరిగి భార్యవైపు చూస్తూ, "నువ్వు నీ డెసిషన్ గురించి బాధపడుతున్నావా!" అన్నారు.

ఆయన మాటల్లోని భావం అర్థం కానట్టు చూసింది సుమణి.

"ఒకసారి నిర్ణయం తీసుకున్నాక దాని గురించి మళ్ళీ ఆలోచించవు కదా! ఇప్పుడు జరిగిపోయిన వర్ణ పెళ్ళి గురించి బాధపడుతున్నావా? అన్నారాయన.

"బాధ పడడం కాదు పెతాప్! ఆలోచిస్తున్నాను. వర్ణ మనల్ని పాయింట్ ఔట్ చేసిందంటే దానికి కారణం.. రెండు వైపులా కన్నవాళ్ళు వాళ్ళని ఒంటరి వాళ్ళని చేశారన్న ఫీలింగ్. ఆ అకేషన్ మళ్ళీ వెనక్కి రాదుగా పెతాప్! అందుకే వర్ణ అంతగా హర్టయ్యిందనుకుంటున్నాను. నువ్వు వెళదామని అన్నావు. బట్! నందూ వాళ్ళ పేరెంట్స్ లేకుండా మనం ఒక్కళ్ళమే దగ్గరుండి పెళ్ళిచేస్తే, రేపేదైనా ఓరోజు వాళ్ళు మనల్ని క్వశ్చన్ చేసే స్టేజ్ మనకి రాకూడదు అనుకున్నాను.." అని బాధగా చెప్పింది సుమణి.

ప్రతాప్‌గారు చిన్నగా నిట్టూర్చి, "ఇప్పుడు నీ బాధ వర్ణ పెళ్ళి చూడలేకపోయినందుకా? లేక వర్ణ హర్టయ్యి మనం ఇచ్చిన గిఫ్ట్స్ తీసుకోనందుకా? " అని సూటిగా భార్య ముఖంలోకి చూస్తూ అడిగారు.

కళ్ళు చిట్లించింది సుమణి. "ఇప్పుడు కూడా నీ లాజిక్కులు వదలవా? అలా చేయబట్టే కదా ఇలా ఫీలవ్వాల్సి వచ్చిందని నేను రెండిటికీ ఫీల్ అవుతున్నాను. అయినా నువ్వేంటీ? నిన్నంతా తెగబాధ పడినవాడివి ఈ రోజు ఇంత ధీమాగా ఉన్నావు!" అని రోషంతోనూ, అంతలోనే ఆశ్చర్యంతోనూ అడిగింది సుమణి.

భార్య ప్రశ్నకి చిన్నగా నవ్వారు ప్రతాప్‌గారు. పక్కన స్విచ్‌బోర్డ్‌లో ట్యూబ్‌లైట్ స్విచ్ తీసి బెడ్‌లైట్ వేశారు.

"సీరియస్‌గా అడుగుతుంటే అలా చిన్మయానందస్వామిలా నవ్వుతావే..! అడిగిన దానికి జవాబు చెప్పకుండా ఇలా నవ్వితేనే ఒళ్లు మండుతుంది" అని ఆయన వంక చూస్తూ రుసరుసలాడింది సుమణి.

మునివేళ్లతో తల కొట్టుకుని, "నవ్వక ఏం చెయ్యను సుమణీ! చెబితే వినవు! నిన్ననే విని ఉంటే ఇప్పుడు ఇలా బాధపడే పని తప్పేది కదా అని నవ్వాను" అంటూ మళ్లీ నవ్వారు ప్రతాప్‌గారు.

మూతి ముడుచుకుని ఇటువైపుకి తిరిగి పడుకుంది సుమణి.

నిదానంగా భార్యకి దగ్గరగా జరిగి, "సుమణీ! నిన్న అనేది ఆ క్షణం మన చేతుల్లోనే ఉంది. అందుకే వర్ణ పెళ్లికి వెళదామని అన్నిసార్లు అన్నాను. వెళ్లలేకపోతున్నందుకు బాధ పడ్డాను. కానీ నిన్న జరిగిపోయినదానికి ఈరోజెందుకు బాధ పడడం? మనం వెళదామని అనుకున్నా, ఇప్పుడు ప్రయోజనం ఉండదుగా! ఏదైనా మన చేతుల్లో ఉన్నప్పుడే ఆలోచించాలి. అయిపోయిన తరువాత ఎందుకు? వర్ణ స్టేజ్‌లో యాజిటీజ్‌గా మనం ఉన్న రోజున మనం ఎలా ఫీల్ అయ్యామో? ఎలా ఆలోచించామో? ఒకసారి గుర్తుచేసుకో! నన్ను మా నాన్న ఇంట్లోంచి పొమ్మన్నారు. నిన్ను పెళ్లి చేసుకుంటే ఆస్తిలో

ఒక పైసా కూడా ఇవ్వనన్నారు. ఆ రోజు మనం ఆయన నుంచి డబ్బుని ఆశించామా? ఆయన ఆశీర్వాదాలు కావాలనుకున్నామా?" నిదానంగా ఆమెని అనునయిస్తున్నట్టుగా అడిగారాయన.

ఇరవై ఆరు సంవత్సరాల క్రితం సుమణి, ప్రతాప్‌ల పెళ్లి జరిగిన రోజు.. ఇప్పుడు ఒక్కసారిగా గుర్తొస్తూ, ఆ పెళ్లి చుట్టూ జరిగిన సంఘటనలన్నీ సుమణి కళ్ల ముందు మెదిలాయి. ఆ రోజు సుమణి ఉన్న స్థితిలోనే ఈ రోజు ఆమె కూతురు వర్ణ ఉన్నా కూడా, ఆమె ఏ సహాయం చేయకుండా చూస్తూ ఉన్నందుకు ఆమె మనస్సాక్షి ఆమెని నిలదీస్తోంది ఇప్పుడు. ఈ రోజు ఉదయం వర్ణ అన్న మాటలు గుర్తు వస్తుంటే, పశ్చాత్తాపంతో సుమణికి కన్నీళ్లు పక్కలకు జారాయి. ఆ పశ్చాత్తాప భావం మరికొన్ని క్షణాలకే ఆమెని మరింత దుఃఖంలో ముంచేసింది.

ఎగసి పడుతున్న భుజాల కదలికని బట్టి సుమణి ఏడుస్తున్నదని గ్రహించి ఓదార్పుగా భార్య భుజం చుట్టూ చేయి వేశారు ప్రతాప్‌గారు.

★ ★ ★

ఆ మర్నాడు ఉదయం పది గంటలవుతుంటే, వర్ణని బైక్ మీద వాళ్ల కంపెనీ క్యాంపస్‌లో దించాడు నందకిషోర్.

అప్పుడే మెయిన్ గేటులోంచి లోపలకు వచ్చిన వర్ణ కొలీగ్స్ ఇద్దరు.. ఆఫీస్‌లోకి వెళ్లబోయేవాళ్లల్లా ఆగి వర్ణనీ, నందూనీ పలకరించారు. నవ్వుతూ వాళ్లకి బదులిచ్చి, వాళ్లతో పాటూ వర్ణకీ బై చెప్పి, బైక్ మీద వెళ్లిపోయాడు నందూ.

వర్ణతోపాటూ లోపలకు నడుస్తూనే, "నాలుగురోజులు లీవ్ తీసుకుని కూడా, రెండ్రోజులకే ఆఫీసు మీద బెంగ పెట్టుకున్నట్టు ఇలా హడావుడిగా వచ్చేశావేంటి తల్లీ?" అని కామెంట్ చేసింది ఫ్రెండ్ దీప.

"శారీలే కట్టాలి, పూరీలే చెయ్యాలి అని ఇదుగో ఇలా ఇంట్లో కండీషన్లు పెడుతుంటే రాకేం చేస్తుంది? దీపా డాళింగ్ యామై రైట్?" అని దీపని చూసి కన్నుగీటి, వర్ణ వంక చూసింది మరో కొలీగ్ రాగా.

రాగ చేతి మీద చిన్నగా చరుస్తూ, "ఏయ్ రాగా! ఆ రబ్బిష్ థాట్స్ ఆపవే! వి ఆర్ పర్‌ఫెక్ట్ కపుల్. మా మధ్య కండిషన్లు ఏమీ ఉండవు" అని నందూని తలుచుకుంటూ, గర్వంగా చెప్పింది వర్ణ.

"అబ్బ ఛా..! మీరిద్దరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్ అంటావ్, అంతేనా! సరేలే! ముందు ముందు మేం చూస్తూనే ఉంటాంగా!" అంటూ లిఫ్ట్ బటన్ ప్రెస్ చేసింది రాగా.

"చూడు బాగా చూడు. ఇప్పుడున్న స్పెట్స్ సరిపోతాయా? ఇంకా పెద్ద భూతద్దాలు కూడా తెచ్చిపెట్టనా?" అని వెక్కిరింతగా అంది వర్ణ.

ఆమె మాటల్ని దీపతో పాటూ రాగ కూడా తేలికగా తీసుకుని నవ్వేసింది. ముగ్గురూ ఆఫీస్‌లోకి రాగానే వాళ్లవాళ్ల కేబిన్లలోకెళ్లి వర్క్‌లో పడ్డారు. వర్క్ ముందు కూర్చున్న వర్ణకి టైం తెలియనే లేదు.

మధ్యాహ్నం లంచ్ టైంలో నందూ ఫోన్ చేశాడు. "లంచ్‌కి ఇంటికి బయల్దేరుతున్నాను. పికప్ చేసుకోవడానికి రానా? ఇంకా టైం పడుతుందా?" అని అడిగాడు.

"ఊఁ! వర్క్ ఎక్కువగా ఉంది నందూ!

## కొత్తగాలి...

**నీరు**
**నీ నేస్తం..!**
**నీకు అదే కదా**
**సమస్తం!**

– కె. ఎన్నార్‌నమ్మి,
మార్టేరు, ప.గో. జిల్లా

## కొత్తగాలి...

**కేదార కన్య**
**కడుపు పండి**
**పంటపిల్లల్ని ప్రసవించాలంటే**
**నీటి పురుషుడుండాలి కదా!**

– మాధవీ సనారా,
అనకాపల్లి

ఈ పూట క్యాంటీన్‌లో లంచ్ చేసేస్తాను. సాయంత్రం నీ కాలేజ్ అవర్స్ అవగానే వచ్చేయ్.." అని చెప్పిందామె.

"ఓకే ఓకే! సాయంత్రం త్వరగా వచ్చేస్తాలే మూవీకెళదాం!" అన్నాడు నందూ.

"మూవీకా!" అని హుషారుగా ఓకే చెప్పింది వర్ణ.

వాళ్లిద్దరూ వర్క్ ముగించుకుని, సాయంత్రం ఫస్ట్ షో చూసి ఇంటికి వచ్చేసరికి టైం రాత్రి తొమ్మిది గంటలైంది. ఇంట్లో రెడీగా ఉన్న డిన్నర్‌ని చూసి ఆశ్చర్యపోయింది వర్ణ.

మధ్యాహ్నం నందూ లంచ్‌కి వచ్చి రాత్రి కోసం డిన్నర్ ప్రిపేర్ చేసుంచాడా! ఇందుకే వచ్చే దారిలో తాను హోటల్లో తిందామని అన్నా నందూ వద్దన్నాడని అర్థమైంది వర్ణకి.

వెంటనే అతని బుగ్గమీద గట్టిగా ముద్దు పెడుతూ "థ్యాంక్యూ డియర్" అంది.

"ఇంత కష్టపడితే ఉత్తి థ్యాంక్సేనా!"

"ఇంకా కష్టపెట్టడం ఎందుకని!" అని గలగలా నవ్విందామె.

"నా కష్టం తగ్గించాలంటే ముందు త్వరగా వంట నేర్చుకో!" అన్నాడు నందూ.

"అలాగేలే! రేపూ, ఎల్లుండీ సెలవేగా నేర్పించవోయ్ మొగుడా!" అని అతన్ని కొంటెగా టీజ్ చేస్తూ అల్లరిగా నవ్వింది వర్ణ.

నందూకి హఠాత్తుగా తల్లి గుర్తొచ్చింది.

అతను చూస్తుండగా తన తల్లి శ్యామల ఇంత ఆనందంగా ఉండడం, గలగలా నవ్వడం చాలా అరుదు అనిపించింది.

తల్లి కూడా వర్ణలా ఇలా సంతోషంగా గలగలలాడుతూ హాయిగా ఉండొచ్చు కదా అనుకున్నాడు. తల్లి అలా ఉండలేకపోవడానికి కారణం తండ్రే అనిపించిందతనికి. ఇలా ఉండాలి, అలా ఉండకూడదంటూ అందరికీ ఎప్పుడూ కండిషన్స్ పెట్టినట్టు మాట్లాడే తండ్రి తత్వం గుర్తొచ్చి నిస్పృహాయంగా దీర్ఘంగా ఊపిరి పీల్చి వదిలాడు.

"ఏంటోయ్ నందూ! ఇంతలోనే అంత ఆలోచన!" అంటూ నందూ చెవి పట్టుకుని లాగింది వర్ణ.

"ఏం లేదులే. పదా భోజనం చేద్దాం.." అంటూ కిచెన్‌లోకి నడిచాడు.

అతనికి తల్లో తండ్రో గుర్తొచ్చి ఉంటారని అర్థమైంది వర్ణకి.

★ ★ ★

మర్నాడు ఉదయం కుక్కర్‌ని స్టవ్‌మీద పెట్టిన తరువాత వంకాయ కూర ఎలా వండాలో అడుగుతూ, నందూ చెప్పినట్టుగా చేస్తోంది వర్ణ.

"పసుపు ఫస్టే వేసెయ్యాలా? లాస్ట్‌లో వెయ్యకూడదా? చివరికి ఎలాగూ అన్నీ కలుస్తాయిగా!" సందేహంగా అడిగింది.

"ఏది ఎప్పుడైనా వేసెయ్యొచ్చు బంగారం! కానీ, ఈక్వేషన్స్‌లో లాగానే ఒకదాంతో చర్య జరిగిన తరువాత మరో దాంతో కలిపితే ఒకలా ఉంటుంది. దానినే రివర్స్ చేస్తే రిజల్ట్ ఇంకోలా ఉంటుంది. అందుకే ఏది బెస్ట్ మెథడో కరెక్ట్ ప్రాసెస్సో చూసుకుని, దాన్నిబట్టి.." అంటూ ఇంకా చెప్పబోతున్నాడు అతను.

"నాయనా నందకిషోరా! నీ కెమిస్ట్రీ క్లాసులు తర్వాత చెబుదువు. ముందు కూర విషయం చెప్పు. ఇందాక పసుపు వెయ్యడం మర్చిపోయాను. ఇప్పుడు ఆఖర్న వెయ్యొచ్చా? వెయ్యకూడదా?"

"భేషుగ్గా వెయ్యొచ్చు వర్ణమ్మా! వంకాయ కూరలో పసుపుని ముందుగా నూనెలో వేస్తే, అది నూనెతో బాగా కలిసి వంగము క్కలకు ఇంకా బాగా పట్టుకుని, నల్లని రంగులో ఉండే వంకాయ ముక్కల స్కిన్ కలర్‌ని ఆకర్షణీయమైన ఆకుపచ్చ రంగు లోకి మార్చుతుంది. అలా కాకుండా, పసుపు ఆఖర్న వేస్తే.." అంటూ ఇంక చెప్తున్నాడు అతను.

రెండు చేతులూ రపీమని శబ్దమయ్యేలా జోడించి, "మీకో నమస్కారం ప్రొఫెసర్ గారు! కూర విషయం చెప్పకుండా ఏదేదో చెబుతున్నారు తమరు. స్కిన్ కలరూ, స్కిన్‌షోలూ అని చెప్తే ఎలా వండాలనేది నా మైండ్‌లోకి ఎలా వెళుతుంది సార్? కన్‌ఫ్యూజ్ అయిపోతున్నాను. ఇలా అ యితే తమరి దగ్గర వంట నేర్చుకోనుగాక నేర్చుకోను! ఆ పైన రోజూ మీరే.." అతన్ని బెదిరిస్తున్నట్టుగా అంది వర్ణ.

"అంత మాటనకు బంగారం! నేనైనా ఏదో ఒక పూట అంటే చెయ్యగలనుగానీ, రోజూ వంట చెయ్యాలంటే నా వల్లా కాదు. ఇంక నీట్‌గా నీకు అర్థమయ్యేలా చెబుతానుగా.." అంటూ ఆమెను బుజ్జ గిస్తూ, గడ్డం పట్టుకున్నాడు నందూ.

సరిగ్గా అప్పుడే కాలింగ్‌బెల్ మోగింది.

"అదిగో బెల్! నేను వంట బాగా నేర్పి స్తానన్న మాట! ముందు కూరని కలు పు.. అడుగంటుతున్నట్టుంది. పొయ్యి మీ ద పడేసి అలా కూర్చుంటే దానంతటదే అయిపోదు. కూరని మధ్యమధ్యలో కలు పుతూ ఉండాలి.." అన్నాడు నందూ.

"నువ్వొచ్చేవరకూ స్టవ్ కట్టేస్తాగానీ, ఎవ రో చూడు" కంగారుగా అంది వర్ణ,

"కట్టొద్దులే డియర్! ఇంకెవ్వరై ఉంటారు, వీకెండ్ కదా భగవాన్‌దాస్‌గాడు వచ్చా డేమో..!" అంటూ డోర్ తీయడానికి వె ళ్లాడు నందకిషోర్.

నందకిషోర్ కిచెన్‌లోంచి వెళ్లిన మరుక్ష ణంలోనే ఏదో అంటూ ఒక్కసారిగా నవ్వు

## కొత్తగాలి... 

**నాడు మంత్రాలకి**
**నేడు యంత్రాలకి**
**బానిస**
**మనిషి!**

– యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

తున్న తండ్రి గొంతు వినిపించింది వర్ణకి. అంతే! కనీసం చేతిలోని గరిటెని అక్కడ పెట్టకుండా దాంతోనే కిచెన్‌లో నుంచి పరుగున బయటకొచ్చిందామె. ఎదురుగా హాల్లోకి వస్తున్న తల్లినీ, తండ్రినీ చూడ గానే ఎక్కడ లేని ఉత్సాహం వచ్చేసింది ఆమెకి. "రండి డాడీ! మమ్మీ రా!" అని సంతోషంగా అంది వర్ణ.

సుమణి, ప్రతాప్‌లు చిరునవ్వుతో వచ్చి కుర్చీల్లో కూర్చున్నారు.

లుంగీతో ఉన్న నందూ గబగబా బెడ్ రూంలోకి వెళ్లి షర్ట్ వేసుకుని వచ్చాడు.

"ఏంట్రా తల్లీ! నువ్వు వంట చేస్తు న్నావా! అయితే ఇక మరి మేం బయల్దే రతాం" అంటూ హాస్యమాడుతూనే కుర్చీ లోంచి పైకి లేచారు ప్రతాప్‌గారు.

"డాడీ! నందూ ఎదురుగా నన్ను టీజ్ చెయ్యకండి. వాడు మరీ కామెంట్ చేస్తాడు" అని గారాబంగా అని అంతలోనే నందూ వంక చూసి గబుక్కున నాలుక కరుచుకుంది వర్ణ.

కూతురు అల్లుడిని వాడు అనడంతో, ఉలిక్కిపడిన ప్రతాప్‌గారు కూడా నందకి షోర్ వంక చూశారు. కానీ, అదేమీ పట్టిం చుకోనట్టుగా ఉన్న అల్లుడిని చూసి నిశ్చిం తగా ఊపిరి పీల్చుకున్నారు ఆయన. వెంటనే కూతురి వంక చూసి, "సరేలే!

అలగకురా! నీ చేతి వంట ఎలా ఉన్నా తినే వెళతాంలే!" అన్నారు ప్రతాప్‌గారు.

అంతే! హఠాత్తుగా ఏదో గుర్తొచ్చినట్టు కిచెన్‌లోకి పరిగెత్తాడు నందూ.

స్టవ్ మీద కూర పెట్టి మర్చిపోయానని గుర్తుకు రాగానే, మళ్ళీ నాలుక కరుచుకుంది వర్ణ.

'నందూ వెళ్ళాడుగా చూస్తాడులే!' అనుకుని, తల్లిదండ్రుల దగ్గర కూర్చుంది.

"వర్ణా! మనం ఈ రోజు మీ మామయ్యగారి ఇంటికి వెళదాం. ఇంతకు ముందు ఆయనతో జస్ట్ ఫోన్‌లో మాత్రం మాట్లాడాం. ఎవరికో మాటిచ్చి ఉండడం వల్ల ఆయన కోపగించుకున్నారు. కానీ ఆ తరువాత కనీసం మేం ఫోన్ కూడా చెయ్యలేదు. ఆ రోజు ఆయన కోపంతో ఏదో అనుండొచ్చు కానీ, కూతుర్ని కన్నందుకు మా బాధ్యతగా నందూ వాళ్ళ ఇంటికి వెళ్ళి మరోసారి అడిగి ఉండాల్సింది. ఆయనేదో అన్నారన్న ఈగోతో మేమూ మాట్లాడకుండా ఉండిపోయాం. కానీ ఇప్పుడు మీ ఇద్దరూ ఒకటయ్యారు. కుటుంబపెద్దగా ఆయన అండ మీకు ఎప్పుడూ కావాలి. అదీకాక.. వాళ్ళకీ ఉన్నది నందూ ఒక్కడే.." అంటూ కూతురి ముఖంలోకి చూస్తూ, తాము ఈ రోజు ఉదయమే ఇక్కడకు రావడంలోని కారణాన్ని వివరించి చెప్పారు ప్రతాప్‌గారు.

తండ్రివైపు ఆశ్చర్యంగా చూసింది వర్ణ. వెంటనే 'ఇది తండ్రి నిర్ణయమా? తల్లి ఆలోచనా?' అనుకుంటూ తల్లివైపు చూసింది.

అప్పుడే సుమణి కూడా లేచి వర్ణ దగ్గరకొచ్చింది. కుర్చీలో కూర్చున్న వర్ణ తల మీద చేతిని వేసి "నీకు సంతోషాన్ని ఇచ్చే పనులే చెయ్యాలని మీ డాడీ, నేనూ ఎప్పుడూ అనుకుంటాం వర్ణా! నందూని పెళ్ళి చేసుకోవడం సంతోషమన్నావ్. ఒప్పుకున్నా.. పెళ్ళి దగ్గరుండి చేయకపోవడం పొరపాటే! దాని గురించి మర్చిపోరా! ఇకపై ఎప్పుడూ నువ్వు సంతోషంగానే ఉండాలి. దాని కోసం మమ్మల్ని ఏం చెయ్యమన్నా చే స్తాం" అంది సుమణి.

తల్లి మాటలు వినగానే వర్ణకి చాలా ఆనందం కలిగింది. వెంటనే, "థ్యాంక్స్ మమ్మీ!" అంది.

కిచెన్ డోర్ వద్దనే నిలబడి వాళ్ళ మాటల్ని వింటున్న నందూ మౌనంగా ఉండిపోయాడు. ఇప్పుడు వీళ్ళు వెళ్ళి తన తండ్రితో మాట్లాడినా, ఆయన శాంతిస్తారన్న నమ్మకం లేదు అతనికి. అందుకే వాళ్ల మాటల్ని విన్నా కూడా విననట్టు ఉండిపోయాడు.

ఉదయం పదకొండు గంటలవుతుంటే.. నందూ, వర్ణ, సుమణి, ప్రతాప్‌లు కలిసి భోజనం చేశారు. భోజనం చేస్తున్నప్పుడే నందూ వాళ్ళ ఇంటికి వెళదామనుకున్న ఆలోచన అతనితో చెప్పారు ప్రతాప్‌గారు.

"అమ్మతో ఫోన్‌లో మాట్లాడుతూనే ఉన్నాను అంకుల్. ప్రస్తుతానికి మా ఇంటికి వద్దనిపిస్తోంది. మనం ఎప్పుడు వెళ్ళాలో సమయం చూసి నేనే చెబుతాను.." అని సున్నితంగా వారించి, ఇక ఆ టాపిక్‌ని మార్చేశాడు నందూ.

★ ★ ★

వర్ణా, నందకిషోర్‌లకి పెళ్లయి ఆరు నెలలు పూర్తయింది. ఈ ఆరునెలల కాలంలో అభిరుచులూ, ఇష్టాయిష్టాలు ఒకరికొకరికి బాగా అర్థమవుతూ వాళ్ళ అనుబంధమూ బలపడుతోంది.

సుమణి, ప్రతాప్‌లు అప్పుడప్పుడు వచ్చి వెళుతున్నారు. కానీ, నందకిషోర్ వాళ్ళ అమ్మానాన్నలు మాత్రం ఇంకా వాళ్ళకి దూరంగానే ఉన్నారు.

ఆ రోజు ఉదయం ఏడు గంటలకు హడావుడిగా రెడీ అవుతున్నాడు నందూ.

"వర్ణా.. నా టై ఎక్కడుందీ..? అని గట్టిగా అరిచాడు.

చమత్కారం

# అక్షరాలా పదాలగారడీ!

పద భావచిత్రాలలో కొత్తదనం.. పదబంధాలలో కొంటెతనం ఉంటేనే కదా కవిత్వం! అమ్మాయిల అందాన్ని పొగిడే విషయంలో ఈ కవి ఎంతటి చమత్కారం చేశాడో చూడండి! రాజుగారు అనగానే చుట్టూ చెలికత్తెలు, వందిమాగధులు, మంత్రులు మామూలే కదా! ఇక్కడ ఆ చెలికత్తెలు ఎంత అందంగా ఉన్నారో ఇలా వర్ణిస్తున్నాడీ కవి..

**బిగువుం జన్నులు గాంచి, మాను నలజంబీరంబు బీరంబు! క్రొం**
**జిగి మోముం గని, సిగ్గునన్ వదలు రాజీవంబు జీవంబు! విం**
**తగు భ్రూరేఖలు గాంచి, భీతినిడు కోదండంబు దండంబు! త**
**జ్జగతీనాథుని మ్రోలనున్న చెలులం జర్చింపగా పాడియే?**

ఈ పదాల్ని చూడండి.. జంబీరంబు .. బీరంబు / రాజీవంబు .. జీవంబు /

కోదండంబు.. దండంబు

ఇక్కడ ప్రతి పదంలో మొదటి అక్షరం తొలగించి మరో పదాన్ని మరో అర్థాన్నీ వెదికి పట్టుకున్నారు ఈ కవిగారు. ఎలాగంటే.

చెలికత్తెల పాలిండ్లను చూచి జంబీర ఫలాలు.. అంటే గజ నిమ్మ పండ్లు. (స్తనాల్ని గజ నిమ్మ పండ్లతో పోల్చడం కవిసమయం) వాటంత అందంగా లేమని బీరాన్ని వదిలాయట! అంటే తమ గర్వాన్ని వదిలాయన్నమాట! వాళ్ల అందమైన ముఖాల్ని చూచి రాజీవము అంటే పద్మం- తను ఆ చెలుల ముఖమంత అందంగా లేనని సిగ్గుపడి ప్రాణాన్నే వదిలేసిందట! పడతి ముఖాన్ని పద్మంతో పోల్చడం కవులు చేసే పనే! దాన్నింత చమత్కారంగా చెప్పాడీ కవి. ఇక సొగసైన వాళ్ల కనుబొమలను చూసి కోదండము అంటే విల్లు- మీ సొగసు నాకేది అంటూ ఒక్క దండం పెట్టేసిందట! అందమైన ఆడపిల్లల కనుబొమలను విల్లుతో పోల్చడం మనందరికీ తెలిసిందే. అబ్బో! ఇంతటి సుందరాంగులైన ఈ చెలికత్తెల అందాన్ని పొగడడానికి నేను తగుదునా! అని ఆశ్చర్యం ప్రకటిస్తున్నాడీ కవి. అసలీ కవి చమత్కారాన్ని చూసి మనందరం ఆశ్చర్యం ప్రకటించాల్సిందే కదూ!



సేకరణ: చంద్రప్రతాప్

"ఎక్కడ పెడితే అక్కడే ఉంటుంది" అని కిచెన్ లోంచి అంతకంటే గట్టిగా బదులిచ్చింది వర్ణ.

"పొద్దునే జోక్స్ ఏంటీ? నాకు అవతల టైమవుతోంది. ఈ రోజసలే జూనియర్ లెచ్చరర్ల ఇంటర్వ్యూలు ఉన్నాయని చెప్పానా.." విసుగ్గా అన్నాడు నందూ.

వంట గదిలోంచి గబగబా వచ్చింది వర్ణ. "జూనియర్ లెక్చరర్ల ఇంటర్వ్యూలు ఉన్నాయన్న విషయం మీకు ఇప్పుడు గుర్తొచ్చిందా..? స్టూడెంట్స్‌ని మాత్రం ఎగ్జామ్‌కి ముందురోజు రాత్రే అన్నీ రెడీగా పెట్టుకోవాలని చెబుతారే.." అని వెక్కిరిస్తున్నట్టుగా అందామె.

"అబ్బా! ఏంటి వర్ణా! నా టై గురించి అడుగుతుంటే ఏదేదో చెబుతావ్.! కాస్త వెతికి పెట్టొచ్చుగా.." అని ఇంకొంచెం విసుగ్గా అన్నాడతను.

"ఏం చేస్తాం! ఆరు నెలలకి వారు వీరౌ తారంట కదా. ఒకటడిగితే ఏదేదో చెప్పే నీ అలవాటు నాకొచ్చేసింది. అయినా తమరు టై కట్టి నాలుగు నెలలైంది. అక్కడా ఇక్కడా ఎందుకుంటుంది? " అంటూనే, బీరువా తెరిచింది వర్ణ.

బీరువా డోర్‌కి ఉన్న బ్యాంగిల్ రాడ్ మీద, ఆమె గాజులకి పక్కనే వేలాడుతూ ఉన్న టైల్లోంచి డార్క్ కలర్ టైని తీసి రిబ్బన్‌లా ఎగరేస్తూ అతనివైపు విసిరింది.

దాన్ని క్యాచ్ అందుకుంటూ "ఓస్ అక్కడుందా..! దీని కోసం ఎంతసేపు టైం వేస్ట్ చేసుకున్నానో చూశావా.." అని బాధపడిపోతున్నట్టుగా అన్నాడు నందూ.

కిచెన్‌లోకి వెళ్ళబోయేదల్లా గబగబా అతని దగ్గరకు వచ్చింది వర్ణ. భర్త చేతుల్లోంచి టైని తీసుకుని అతని మెడలో వేసి ముడి వేస్తూ, "వెడ్డింగ్ నాట్ పడ్డాక, వేస్టాఫ్ టైం గురించి వర్రీ అవకూడదు నందూ. ప్రతీ మినిట్ వాల్యుబుల్ అనుకోవాలి. మనకున్న టైం కొంచెం కాదు, ఇద్దరి జీవితాలున్నాయి. కావలసినంత టైం ఉంది. దాని సద్వినియోగం చేసుకునే సెట్ ఆఫ్ మైండ్ వుంది. అందుకే టైం లేదు, టైం వేస్ట్ అయిపోయింది అనకు. నాకు నచ్చట్లేదు అలా.." అంది వర్ణ.

"ఓహ్..! సూపర్.." అంటూ చటుక్కున వర్ణ చెంప మీద ముద్దు పెట్టి 'పాఠాలు చెప్పే ప్రొఫెసర్‌కి పాఠం చెప్పిన పెళ్ళాం" అని వార్తల్లోని హెడ్‌లైన్ చదివినట్టుగా అన్నాడు నందకిషోర్.

అతను చెప్పిన విధానానికి గట్టిగా నవ్వేస్తూ, టై ముడిని బిగించింది వర్ణ.

"ఓయ్! స్లో.. స్లో! నీ కోపం ఇక్కడ చూపించకు" అని టై ముడిని పట్టుకుని భయపడిపోతున్నట్టు అభినయించాడు నందకిషోర్.

"అబ్బో! చాలా ఎక్కువైంది గానీ, రా! టిఫిన్ చేద్దాం..!" అంది వర్ణ.

ఆమె వెంట డైనింగ్ టేబుల్ వైపు నడుస్తూ, "ఈ రోజూ క్యారేజీనేనా.. మధ్యాహ్నం ఇంటికా..? " అనడిగాడు.

"రైస్ ఇప్పుడే కుక్కర్‌లో పెట్టాను. అయినా ఆఫ్టర్‌నూన్ ఇంటికి వచ్చేద్దాంలే. ఎగ్జాక్ట్‌గా వన్ థర్టీకి మా క్యాంపస్‌కి రా.." అంది వర్ణ.

హాట్ బాక్స్‌లోంచి తీసి ప్లేట్‌లో పెట్టుకున్న ఇడ్లీలో ఒకదాని మీద నెయ్యి వేసుకుంటూ, "ఎస్ మేమ్" అని చిరునవ్వుతో అన్నాడు నందూ.

అతని చేతిలోంచి నేతి గిన్నె లాక్కుని "ఆఫ్టర్‌నూన్ కోసం ముద్దపప్పు చేశాను. అందులోకి మళ్ళీ ఆవకాయ్, నెయ్యా వేసుకుంటావ్. అందుకే ఈ పూటకి సగం కట్.." అని గడుసుగా అంటూ ముసిముసిగా నవ్వింది వర్ణ.

వేడి ఇడ్లీ మీద పడి కరుగుతున్న పూస నెయ్యిని వేళ్ళతో ఇడ్లీ మొత్తానికీ రాస్తూ, "మా అమ్మయితే ఎంత కావాలంటే అంత వేసుకోనిచ్చేది తెలుసా.." అని గారంపోతు

అ
క్ష
రం

కష్టపడకుండా, ప్రయత్నం చేయకుండా
బతుకుని పండించుకోవాలనుకోవడం
మూర్ఖుల లక్షణం

– హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ



న్నట్టుగా అన్నాడు.

"నేన్నీకు అమ్మనైతే, నువ్వు బుల్లి నందూవైతే, నేను కూడా మీ మమ్మీలాగే ఎంత కావాలంటే అంత వేసేదాన్ని. ఇప్పుడు నువ్వు చిన్నపిల్లాడివి కాదు. ఈ ఆరునెలల్లో నువ్వో ఆరు కేజీలూ, నేనో మూడు కేజీలూ బరువు పెరిగాం. ఇలాగే ఉంటే, నువ్వు సంవత్సరానికి పన్నెండు కేజీలు పెరుగుతావ్.." అంటూ తన ప్లేటులో రెండు ఇడ్లీలు వేసుకుంది వర్ణ.

"హబ్బా! నీ డైటింగుల్తో పడలేకపోతు న్నా. ఇలాగయితే మా ఇంటికి వెళ్ళిపోతా" బెదిరిస్తున్నట్టుగా అన్నాడు నందూ.

"వెళ్ళు! నేనేమన్నా వద్దన్నానా.? మేమూ నీ వెనక వస్తాం. ఎప్పుడు మీ ఇంటికి వెళదామంటావా? అని నేనూ, డాడీ, మమ్మీ ఎదురు చూస్తున్నాం.." అని రాబోతున్న నవ్వుని లోలోపలే ఆపు కుంటూ అంది వర్ణ.

"ఛఛ! మళ్ళీ ఇక్కడకే వచ్చిందా మన టాపిక్కు. సర్లే కబుర్లాపి తిను ముందు" అన్నాడు నందకిషోర్.

రెండో ఇడ్లీని కూడా తిని ప్లేట్ చేత్తో పట్టుకుని లేస్తూ... "టాపిక్ ఇక్కడకి వచ్చి ఆగాక ఇంక కబుర్లేముంటాయ్‌లే.." అని రిటార్ట్ ఇచ్చింది వర్ణ.

"రెండు ఇడ్లీల్నీ చిటికెలో తినెయ్యక పోతే, మొగుడికోసం కాస్త నిదానంగా తినొచ్చుగా.." అంటూ ఆఖరి ఇడ్లీ ముక్కని నోట్లో పెట్టుకుని లేచాడు నందు.

"తినొచ్చులే! ఎలాగూ కుక్కర్‌లో రైస్ అయిపోయిందిగా. నేనూ నీతో కలిసి వచ్చేద్దామని లేచాను. దారిలో మమ్మీ వాళ్ళింట్లో దించు నన్ను. రాత్రి ఏవో శారీస్ తీసుకున్నానంది మమ్మీ. ఎలా ఉన్నాయో చూసి, అటు నుంచి ఆఫీస్‌కి వెళతాను.." అంది వర్ణ.

చేతులు వాష్ చేసుకుని మూతి తుడు చుకున్నాడు నందకిషోర్. "దారిలో మమ్మీ వాళ్ళింట్లోనా..! మీ మమ్మీవాళ్ళ ఇంటికి దారి ఇటు, మా కాలేజ్ రూట్ అటు. దారిలో నిన్ను దించాక మళ్ళీ ఇంత దూరం వెనక్కు వచ్చి అటు కాలేజ్‌కి వె ళ్ళాలి. హుఁ! ఏ క్షణంలో నిన్ను డ్రాప్ చేస్తాను అన్నానో గానీ, ఆ క్షణానికి ఓ దణ్ణం. ఆ రోజు నుంచీ నీ స్కూటీని కనీసం గేటు బయటకే తియ్యలేదు.." అని అలుగుతున్నట్టుగా అన్నాడు.

"డ్రైవరూ, పెట్రోలూ ఫ్రీగా వస్తుంటే నా వెహికల్‌కి డిప్రిసియేషన్ ఎందుకు నం దూ దండగ.." అని నవ్వింది వర్ణ.

"నా బైక్ కాబట్టి సరిపోయింది. అదే మీ డాడీ ఇచ్చిన కారు గనక నువ్వు తీసు కుని ఉంటే, నా జీతమంతా ఆ కారు పెట్రోలుకే అయిపోయేది.." అని ఒక పిచ్చి నవ్వు నవ్వాడతను.

"సెటైర్లు సాయంత్రం వేసుకుందాం గానీ, నీకు ఇంటర్వ్యూలేవో ఉన్నాయన్నా వ్‌గా. నేనూ ఫైవ్ మినిట్స్‌లో రెడీ అయి వచ్చేస్తాను.. ఆగు.." అంటూ బెడ్‌రూం లోకి వెళ్ళింది వర్ణ.

ఆమె ఎలాగూ ఫైవ్ మినిట్స్‌లో రెడీ అవదని తెలిసి, తొందర పెట్టడం కోసం నందకిషోర్ కూడా వర్ణ వెనక వెళ్ళాడు.

★ ★ ★

ఉదయం తొమ్మిదిన్నర అవుతోంటే.. కంపెనీ క్యాంపస్ బయట తల్లి కారులోంచి కిందకి దిగింది వర్ణ. విండో దగ్గరకి వంగి తల్లికి బై చెప్పిందామె.

బుగ్గలు నునుపుదేలి మెరుస్తూ నిండుగా, కళగా, అందంగా ఉన్న వర్ణ ముఖాన్ని చూస్తూ ఒక క్షణం అలాగే ఉండిపోయంది సుమణి. వర్ణ బై చెప్ప డంతో తేరుకుంటూ, "నువ్వు కొనుక్కున్న స్కూటీ ఉంది, డాడీ మీ కోసం కొన్న కారుంది. అయినా సరే ఇలా నందూ మీదో, నా మీదో డిపెండ్ అవడం ఎం దుకే. ఏదో ఒక వెహికల్‌తో ఎక్కడకు కావాలంటే అక్కడకు, ఎప్పుడు కావాలంటే అప్పుడు హాయిగా వెళ్ళిరావచ్చు కదా!" అంటూ కూతురికి ఇంకా ఏదో చెప్పబో యింది సుమణి.

"మమ్మీ! చాలింక. ఇవే మాటలు ఇప్ప టికి పదిసార్లు చెప్పావ్. వినీవినీ విసుగొ స్తోంది. నేను చెప్పిన మోడల్స్‌లో ఇంకొన్ని శారీస్ తెప్పించుంచు. ఈ రోజు సోమవారం కదా! నెక్స్ట్ సండే నేనూ, నందూ ఇంటికి వస్తాం. అప్పుడు నచ్చినవి తీసుకుంటాను. మిగిలినవి రిటర్న్ చేయొచ్చు." అని తల్లికి చెప్పిందే అయినా మరోసారి గుర్తు చేసింది వర్ణ.

"అలాగేలేవే! ఇంకా వారం రోజులు టైం ఉందిగా! అయినా అప్పుడే పిల్లల్ని కనేసి, వాళ్ళకి పెళ్ళిళ్ళు చేస్తున్నదానికిలాగా కాటన్ శారీలే కావాలంటున్నావ్. చెప్తే వినవ్. పెళ్ళయ్యాక మరీ చాదస్తంగా తయారవుతున్నావ్.." అంటూ కారు విండో గ్లాస్ దించింది సుమణి.

ఆ గ్లాస్ మీద చెయ్యి వేసి ఆపి, "పెళ్ళ య్యాక అని పాయింట్‌ని అక్కడ పెట్టకు. నేనేమీ మారలేదు. పెళ్ళి అవక ముందూ చాదస్తమే, పెళ్ళయ్యాకా చాదస్తమే నాకు. కాలేజ్‌లో ఉన్నప్పుడు కాటన్ చుడీదార్స్ వేస్తానంటే, మోడ్రన్ డ్రెస్‌లు బావుంటాయి అంటూ అప్పుడూ ఇలానే చాదస్తం అన్నావ్.." ఇరిటేటింగ్‌గా అంది వర్ణ.

ఆ మాటలు విని తల కొట్టుకుంటూ "అన్నీ మనసులో జాగ్రత్తగా అట్టే పెట్టు కుని, సమయం చూసి ఒక్కో బాణం వేస్తారే మీ తండ్రీ కూతుళ్ళు. సరే, నేను వెళుతున్నా.." అని కారుని రివర్స్ చేసి, రయ్యిన వెళ్ళిపోయింది సుమణి.

చిన్నగా నిట్టూర్చి ఆఫీస్‌వైపు అడుగులే సింది వర్ణ.




'కృష్ణవేణి డిగ్రీ అండ్ పీజీ కాలేజ్' సిటీలో మంచి పేరూ, బాగా పాప్యులారిటీ ఉన్న ప్రైవేట్ పీజీ కాలేజ్ అది.

"మిస్ నందినీ..!" అని గట్టిగా రెండో సారి పిలిచాడు గుమస్తా.

చేతిలోని సెల్‌ని సైలెంట్ మోడ్‌లో పెట్టి వెంటనే పర్స్‌లోకి తోస్తూ, చంకలోని సర్టిఫికెట్ల కవర్‌ని చేతిలోకి తీసుకుని కంగారుగా వచ్చింది నందిని.

ఇంటర్వ్యూ రూమ్ డోర్ తీశాడు గుమస్తా. గబగబా లోపలికి నడిచిందామె.

గదిలో ఎదురుగా టేబుల్ ముందు ముగ్గురు మగవాళ్ళు కూర్చునున్నారు. వాళ్ళ ముందుకు వెళ్ళగానే, మధ్యలో ఉన్న అతను చేయి చాపాడు.

వెంటనే తన చేతిలో ఉన్న కవర్‌లోంచి సర్టిఫికెట్లు తీసి అందించింది నందిని.

అవన్నీ పరిశీలించిన తరువాత, ఆమె వివరాలకి సంబంధించి కొన్ని ప్రశ్నలు వేశాడాయన. ఇంటర్వ్యూ బోర్డ్ ముగ్గురిలో కుడివైపు చివర్న కూర్చున్న నందకిషోర్ ఆమె చెప్పే జవాబుల్ని వింటూ చిన్నగా తలపంకించి, తాను ప్రశ్నించాల్సినవంతు రాగానే, "ఇఫ్ క్లాజ్ గురించి చెప్పండి.." అన్నాడు.

ఎమ్.ఎ. ఇంగ్లీష్ చేసి, ఆల్రెడీ వేరే జూనియర్ కాలేజ్‌లో ఇంగ్లీష్ లెక్చరర్‌గా పనిచేస్తున్న నందిని.. తడుముకోకుండా వెంటనే ఇఫ్ క్లాజ్ గురించీ, దాన్ని వాడే సందర్భాల గురించీ, అందులోని కండిషన్ల గురించీ టకటకా చెప్పింది.

ప్రశ్నించిన నందకిషోర్‌కి ఆ జవాబు కన్‌ఫ్యూజన్‌గా అనిపించినా, మిగిలిన ఇద్దరూ బాగా శాటిస్‌ఫైడ్‌గా తలలు ఊపడంతో అతను కూడా తలూపాడు. ఆమె జవాబుల్ని బట్టి వాళ్ళు ముగ్గురూ మార్కులు వేసుకుంటున్నారు.

మధ్యాహ్నం వరకూ ఆగకుండా ఇంటర్వ్యూలు కొనసాగుతూనే ఉన్నాయి. ఒంటిగంటకి లంచ్ బ్రేక్ తీసుకుని బయటకు వచ్చాడు నందకిషోర్. ఇక మధ్యాహ్నం నుంచీ ఇంటర్వ్యూలు నిర్వహించడానికి మరో ముగ్గురితో ఇంకొక టీమ్‌ని నియమించింది కాలేజ్ యాజమాన్యం.

ఆఫీస్‌రూమ్ లోంచి బయటకు వస్తూ, వర్ణకి ఫోన్ చేశాడు నందూ.

హలో అనగానే, "ఎలా జరిగాయి ఇంటర్వ్యూలు? " అని అడిగింది వర్ణ.

"ఆ విషయాలు కలిశాక మాట్లాడుకోవచ్చు కదా! ఫోన్‌లో ఎందుకు డబ్బులు దండగ. నేను బయల్దేరుతున్నాను. నువ్వు క్యాబిన్‌లోంచి క్యాంపస్‌లోకి వచ్చేయ్!" అని బైక్‌వైపు నడుస్తూ అన్నాడు నందూ.

"డబ్బులు దండగా..! హహ్హహ్హా! అచ్చమైన మొగుడిలా మాట్లాడావు నందూ! అప్పుడప్పుడు ఇలా కూడా మాట్లాడేం! లేకపోతే నాకు మ్యారేజ్ అయ్యిందని మర్చిపోతానేమో!" అంటూ నవ్విందామె.

"ఒకేలే! బయల్దేరుతున్నా!" అంటూ ఫోన్ కట్ చేశాడు

మరో పది నిమిషాలకి వర్ణా వాళ్ళ ఐటీ కంపెనీ దగ్గరకొచ్చాడతను. అప్పటికే ఆమె రోడ్డు మీదకి వచ్చి వెయిట్ చేస్తోంది.

వర్ణ బైక్ ఎక్కుతూనే, "ఇప్పుడు చెప్పు నువ్వు ఇంటర్వ్యూ చేసిన సబ్జెక్టులు ఏంటి? " అని కుతూహలంగా అడిగింది.

చిన్నగా నవ్వుతూ, "అంత ఇంట్రెస్ట్ ఎందుకో? నీ సబ్జెక్టులు మాత్రం కాదులే! కెమిస్ట్రీ, ఇంగ్లీష్.." చెప్పాడు నందకిషోర్.

"ఇంగ్లీషా..! నువ్వు ఇంగ్లీష్‌లో చాలా పూర్ కదా నందూ!" అని ఆశ్చర్యంగా అందామె. మళ్ళీ వెంటనే, "ఇంగ్లీష్‌లో ఏం అడిగావు? ఇంటర్వ్యూ పేపర్ ముందే ప్రిపేర్ చేసి ఇచ్చారా? లేకపోతే నువ్వే నీకు తెలిసినవి అడిగేశావా? " అంది వర్ణ.

"నాకు తెలిసినవి కాదు, తెలీనివి అడిగాను" అని చెప్పి నవ్వాడు.

"అంటే..!? "

"అంటే ఏముందీ.. ఇఫ్ క్లాజో, కండిషనల్ సెంటెన్సెస్సో, యాడ్జెక్టివ్సో.. ఇంకేవో ఉంటాయిగా.. అవన్నీ అడిగేశాను.."

"అబ్బో..! అయితే కెమిస్ట్రీ, ఇంగ్లీష్‌లకి సెలెక్షన్ అయిపోయినట్టేనా? "

"ఆc! ఇద్దర్ని తీసుకున్నారు. ఇద్దరూ లేడీసే! ఈమధ్య ఎక్కడ చూసినా లేడీస్ డామినేషన్ ఎక్కువైపోతోంది"

"ఛా! సర్లేగానీ ఇంగ్లీష్ లెక్చరర్‌గా సెలెక్టయిన క్యాండిడేట్‌ని ఏంక్వశ్చన్ చేశావ్? "

"ఊc! ఇంగ్లీష్ లెక్చరర్‌నా? " అని గుర్తు చేసుకుంటూ "ఊc! ఇఫ్ క్లాజ్ గురించి అనుకుంటా..!" అన్నాడు నందకిషోర్.

"ఇఫ్ క్లాజా..!" అంటూ గట్టిగా నవ్వుతూ "జవాబేం చెప్పింది? " అడిగింది వర్ణ.

"ఏదేదో గడగడా చెప్పిందిలే. నాకు అర్థం కాలేదు.." అని నవ్వి, "పేరు

నందిని అనుకుంటా.. బ్యూటీపార్లర్ నుంచీ డైరెక్టుగా వచ్చిన హీరోయిన్‌లా ఉంది..” అన్నాడు నందూ.

అంతే! వెంటనే చురుక్కున అతని వంక చూసింది వర్ణ. కానీ బైక్ డ్రైవ్ చేస్తున్న నందూకి వర్ణ మనోభావాలు తెలియలేదు. సైడ్‌మిర్రర్‌లో ఎర్రగా కందిన తన ముఖాన్ని తానే చురచురా చూసుకుందామె. ముడుచుకుపోయిన ముఖంతో “నీకు ఆన్సర్ అర్థం కాకపోయినా ఆమెని సెలెక్ట్ చేసేశావా! అంటే రాంగ్ ఆన్సర్‌ని గడగడా చెప్పేసినా సెలెక్ట్ చేసేస్తావా!” ఒకింత ఉక్రోషంగా అడిగింది వర్ణ.

వర్ణ ఫీలింగ్స్‌ని గమనించకుండా, “నేనొక్కణ్నే కాదుగా సెలెక్ట్ చేసింది. మిగిలిన ఇద్దరూ ఇంగ్లీష్ ప్రొఫెసర్లే. వాళ్ళు కరెక్టేనన్నారులే!” అని చెప్పాడు నందూ.

“అంటే ఆ అమ్మాయి సెలెక్టయినట్టేనా? రేపట్నుంచీ డైలీ మీ కాలేజ్‌కి వస్తుందా? ” అని ఆత్రుతగా అడిగింది వర్ణ.

“మా కాలేజ్‌లో సెలెక్ట్ అయితే పక్క కాలేజీకి వెళుతుందా? ఏం మాట్లాడుతున్నావ్!” అని గట్టిగా నవ్వి, “ఈరోజు సెలెక్ట్ అయిన వాళ్ళందరి జాయినింగ్స్ నెక్స్ట్‌మంత్ ఫస్ట్ నుంచీ..” అంటూ, ఇల్లు రావడంతో బైక్ ఆపాడు నందూ.

ఆమెకి ‘తనలో తొంగి చూస్తున్నది జెలసీ ఫీలింగ్’ అని అర్థం అవుతోంది. దాన్ని కంట్రోల్ చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టుగా మౌనం వహించింది వర్ణ.

చాలా క్యాజువల్‌గా ఉన్న నందకిషోర్‌కి వర్ణ మనోభావాలు అస్సలు తెలియలేదు.

★ ★ ★

ఆదివారం.. ఉదయం టిఫిన్ తిన్న తర్వాత వర్ణ అమ్మావాళ్ళింటికి వచ్చారు వర్ణ, నందకిషోర్‌లు.

కాలింగ్‌బెల్ కొట్టాడు నందూ. తలుపు తీసి వాళ్ళిద్దర్నీ చూస్తూనే చాలా సంతోషంగా పలకరించారు ప్రతాప్‌గారు.

స్పెషల్ వంటలు చేయిస్తూ, వాళ్ళిద్దరి కోసమే ఎదురుచూస్తోంది సుమణి.

“ఏంట్రా తల్లీ! అల్లుడుగారు చిక్కినట్టున్నారు!” అని కూతుర్ని ఆటపట్టిస్తున్నట్టుగా అన్నారు ప్రతాప్‌గారు.

“అదేంటి అంకుల్! రివర్స్‌లో చెబుతున్నారు. నేను వెయిట్ పెరిగాను. మీ అమ్మాయే బాగా చిక్కింది. అయిదు రోజుల్నుంచి అసలు తిండి తినడమే మానేసింది” అని వర్ణ మీద ఫిర్యాదు చేస్తున్నట్టుగా చెప్పాడు నందూ.

ప్రతాప్‌గారు కూతురి వంక పరీక్షగా చూశారు. వర్ణ బుగ్గలు లాస్ట్ వీక్ చూసినప్పటికంటే కొంచెం లోపలకు పోయినట్లు స్పష్టంగా తెలిసింది ఆయనకి.

సుమణికి కూడా కూతురిలో తేడా తెలిసింది. ‘మొన్ననేగా కళగా ఉందనుకున్నాను! వారం రోజులకే ఇలా అయిపోయిందేంటీ? ’ అనుకుంటూ వర్ణ వంక ఆశ్చర్యంగా చూసిందావిడ. ఆ వెంటనే ఒకవేళ వర్ణ నెల తప్పిందా అన్న అనుమానం వచ్చింది.

ప్రతాప్‌గారూ, నందూ హాల్లో కూర్చుని మాట్లాడుకుంటుంటే కూతుర్ని తీసుకుని బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది సుమణి. తాను తెచ్చిన చీరల్నీ, వాటి మీదకి మ్యాచింగ్స్‌నీ తీసి బెడ్ మీద వేసింది. వాటిని విడదీసి, ఏ రంగులు వర్ణకి బావుంటాయో చెప్తూ చూపించసాగింది ఆవిడ.

వర్ణ అంత ఆసక్తి కనబరచపోవడాన్ని గ్రహించి, “వర్ణా! ఏంట్రా అలా ఉన్నావ్? ఒంట్లో బాగోలేదా..? నెల తప్పావా..? ” అని కూతురి ముఖంలోకి పరిశీలనగా చూస్తూ ఆదుర్దాగా అడిగింది సుమణి.

“అదేం లేదు మమ్మీ!” అంది వర్ణ.

“ఊహుఁ! నువ్వు ఈ మమ్మీ దగ్గర ఏదో దాస్తున్నావ్. నందూ బానే చూసుకుంటున్నాడా? ఒకవేళ నీమీద డామినేషన్ కోసం ట్రై చేస్తున్నాడా? ” అని అను

# ఉక్కుమనిషి చతురత!

సర్దార్ వల్లభాయి పటేల్ 'ఉక్కుమనిషి'గా సుప్రసిద్ధులు. న్యాయవాద వృత్తిని స్వీకరించిన పటేల్ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని మహాత్ముని అడుగుజాడల్లో నడిచి భారతదేశపు మొదటి ఉప ప్రధానిగా 500కు పైగా స్వదేశీ సంస్థానాలను స్వతంత్ర భారతదేశంలో విలీనం చేశారు. ఎప్పుడూ గంభీరంగా ఉండే ఆ ఉక్కుమనిషిలోనూ హాస్యం నిగూఢంగా ఉండేది. ఆయన చతురోక్తులలో కొన్ని..



★ మహాత్మాగాంధీ ప్రజల పక్షాన అసమ్మతి వెల్లడిస్తూ అనేక సందర్భాలలో నిరశనవ్రతం చేశారు. ఒక సమయంలో గాంధీ పటేల్‌తో 'నిష్కళంక దేశభక్తునిగా ప్రజలు మిమ్మల్ని అభిమానిస్తున్నారు, గౌరవిస్తున్నారు. మీరూ ప్రజాసమస్యల పరిష్కారానికి నిరశనవ్రతం చేస్తే సత్ఫలితం ఉంటుంది. ఈసారి ఆ అవకాశం మీకు ఇస్తున్నాం' అన్నారు.

'నేను గనక నిరశనవ్రతం ప్రారంభిస్తే దానిని విరమించి నేనెక్కడ బతికిపోతానోనని ప్రజలు అనుకుంటారు. మీరు ప్రారంభిస్తే ఎపుడు విరమిస్తారు, ఎంత చప్పున విరమిస్తారు? అని ఎదురు చూస్తారు' అన్నారు పటేల్ చమత్కారంగా.

★ పటేల్‌తో ఒకరు ఒక కోటీశ్వరుడి గురించి చెప్తూ 'ఆయన దగ్గర ఉన్నంత డబ్బు మనదేశంలో ఎవరి దగ్గరా లేదు' అన్నారు.

దానికి సమాధానంగా 'ఉండనీవయ్యా! ఆ డబ్బుని సమానంగా అందరికీ పంచితే మనిషికి పావలా అర్ధణా కంటే ఎక్కువ రాదు. కావలిస్తే ఆ పావలా అర్ధణా నేనే నీకు ఇస్తాను' అన్నారు పటేల్.

★ ఒకప్పుడు ఎన్నికలలో పోటీ చేయడానికి అర్హతా ప్రమాణాలున్న కాంగ్రెస్ అభ్యర్థులకు టిక్కెట్లు ఇచ్చేవారు. అప్పుడు అభ్యర్థులను ఎంపిక చేసే కమిటీకి పటేల్ అధ్యక్షులు. ఎన్నికలలో పోటీ చేయడానికి అవకాశం లభించనివారు పటేల్‌ని 'ఫాసిస్ట్, సెమీ హిట్లర్' అని విమర్శించేవారు.

దానికి పటేల్ స్పందిస్తూ 'టిక్కెట్లు లభించని కష్టకాలంలో వారు నాకు ఈ బిరుదులిచ్చి మనశ్శాంతి పొందుతున్నారు' అని అన్నారు.

సేకరణ : **తాజీప్రసాద్**

మానంగా అడిగింది సుమణి.

ఏదో ఒక కారణం చెప్పకపోతే తల్లి రకరకాలుగా ఆలోచిస్తుందని వర్ణకి తెలుసు. అందుకే వెంటనే, "ఛఛ! నథింగ్ మమ్మీ! మా కంపెనీకి ఓ కొత్త ప్రాజెక్ట్ ఓకే అయ్యింది. ఆ వర్క్ గురించి ఆలోచిస్తున్నాలే!" అంటూ నోటికొచ్చిన అబద్ధం చెప్పి ముఖంపై నవ్వుని పులుముకుంది వర్ణ.

"నువ్వు ఓకే కదా!" అంటూ అప్పటికి సంతృప్తిపడింది సుమణి.

ఇద్దరూ నచ్చిన చీరల్ని సెలెక్ట్ చేసి పక్కన పెట్టారు. వర్ణకి నచ్చిన వాటిని ప్యాకెట్లలో సర్ది, వర్ణ తీసుకెళ్ళడం కోసం ఒక పక్కగా ఉంచింది సుమణి.

తల్లిని గమనిస్తూ, "మమ్మీ! ఇందాక నందూ డామినేషన్ కోసం ట్రై చేస్తున్నాడా అనడిగావ్ కదా! డామినేషన్ అంటే..? ఏవిధంగా..? " అని సందిగ్ధంగా అడిగింది వర్ణ.

కూతురి వంక ఆశ్చర్యంగా, అనుమానంగా చూసింది సుమణి. వర్ణ దగ్గరకొచ్చి "డామినేషన్ అంటే.. మనకి వేల్యూ ఇవ్వకపోవడం! మనం చెప్పింది వినకపోవడం! మనల్ని తిట్టడం, కొట్టడం..!" అని వర్ణ కళ్ళ లోతుల్లోకి గుచ్చి చూస్తూ చెప్పింది.

"డాడీ నీతో అలా ఎప్పుడన్నా

ఉన్నారా? " అని ఆసక్తిగా అడిగింది వర్ణ.

"ఎందుకుండరు? ఆయనా మగవాడేగా!"

"అంటే కొట్టారా! మరి మీరు లవ్ మ్యారేజ్ చేసుకున్నారు కదా! అయినా కూడానా!" ఆశ్చర్యంగా అడిగింది వర్ణ.

వర్ణ ముఖంలో ఎన్నడూ లేనంత అమాయకత్వం కనిపిస్తుంటే, "కొట్టడమైతే ఎప్పుడూ లేదు. కానీ తిట్టడం నువ్వూ చాలాసార్లు చూశావుగా. లవ్ మ్యారేజ్ చేసుకుంటే, మగవాళ్ళు మగవాళ్ళు కాకుండా పోతారా? పిచ్చిమొహమా!" అంది సుమణి.

'నువ్వూ డాడీని చాలాసార్లు తిట్టావుగా! అదీ డామినేషనేనా? ' అని అడగాలని వర్ణ నోటి వరకూ వచ్చింది. కానీ ఎందుకో అడక్కుండా ఆగిపోయిందామె.

వర్ణ పక్కనే మంచంమీద కూర్చుని "అధికారపు నోరూ, ఆకర్షణపు కళ్ళూ మగవాళ్ళకి పుట్టుకతో వచ్చేస్తాయి బేబీ! వాటిని మనం ఏ మాత్రం మార్చలేం. కాకపోతే వాటిని గమనించగానే కొంచెం గ్రిప్‌లో పెట్టే ప్రయత్నం చెయ్యాలి. అప్పుడే మనకి భయపడి, వాళ్ళని వాళ్ళు అదుపులో పెట్టుకుంటారు" అని వివరిస్తున్నట్టు నిదానంగా చెప్పింది సుమణి.

"అంటే? " అయోమయంగా అంది వర్ణ.

"అంటేనా..? ఊc! పర్సనల్ స్పేస్‌లో ఎలా ఉన్నా, నలుగురిలో ఉన్నప్పుడు భార్యమీద అధికారం చూపిస్తే దాన్ని గొప్పగా ఫీల్ అవుతారు మగవాళ్ళు. అలాంటివాళ్ళది అధికారపు నోరు. అలాగే, పర్సనల్ రిలేషన్‌లో ఎంతో శాటిస్‌ఫైడ్‌గా ఉన్నా కూడా, బయట ఎట్రాక్టివ్‌గా ఎవరైనా కనిపిస్తే ఫ్లాట్ అయిపోతారు మొగుళ్ళు. వీళ్ళవి ఆకర్షణపు కళ్ళు. ఇవన్నీ మగవాళ్ళకి వయస్సుతో పాటూ నేచురల్‌గా వచ్చేస్తాయి. ఇలాంటి వాటిని గమనించగానే మొగ్గలోనే తుంచెయ్యాలి" అంది సుమణి.

తల్లి మాటలకి ఉలిక్కిపడింది వర్ణ.

'నందూ కూడా ఇలాంటి వాటికి అతీతం కాదా? అతనూ ఇలాగే ఉంటాడా? ' అని అనుకోగానే వర్ణ మనసులో సన్నని భయం ప్రవేశించింది.

"ఇప్పుడు 'సుమణీ' అంటూ నన్ను వదిలిపెట్టడం లేదుగానీ, మీ డాడీ వయసులో ఉన్నప్పుడు అస్సలు ఇంట్లో ఉండేవాళ్ళు కాదు. ఫ్రెండ్స్‌తో కలిసి ఎప్పుడూ తిరగడమే. వాళ్ళందరూ కలిసి దేశమంతా చుట్టొచ్చేవాళ్లు"

"డాడీకి ఫ్రెండ్స్ సర్కిల్ ఎక్కువ" అని తండ్రి వైపు మాట్లాడబోయింది వర్ణ.

"ఎక్కువేంటి ఎక్కువ? ప్రేమించి మా ఇంట్లోంచి తీసుకొచ్చి పెళ్ళి చేసుకున్న నన్ను ఇంట్లో ఒక్కదాన్నీ వదిలేసి మీ డాడీ పదేసి రోజులు ఫ్రెండ్స్‌తో టూర్లు తిరిగొస్తే ఎలా ఉంటుంది నాకు? నందూ నిన్నొక్కదాన్నీ వదిలేసి, వేరే రాష్ట్రాలకు వెళితే నువ్వు ఫీల్ అవ్వవా? " ఒకింత ఉద్రేకంగా అడిగింది సుమణి.

తల్లిదండ్రుల మధ్య కనీకనిపించని స్పర్థలు ఎన్నో ఉండుంటాయని కొత్తగా అనిపిస్తుంటే కొంచెం దిగులుగా అనిపించింది వర్ణకి. "ఇప్పుడు అవన్నీ తల్చుకుని బీపీ తెచ్చుకోకు మమ్మీ!" అని తల్లిని కూల్ చేస్తూ అంది వర్ణ.

"బీపీ కాదే! ఈ మగవాళ్ళనీ, వాళ్ళ బుద్ధుల్నీ తల్చుకుంటే నాకు ఇలానే ఉంటుంది. ఆడది అనగానే ఈ రంగు బట్టలే వేసుకోవాలి, ఇలానే ఉండాలి, ఇన్నింటికల్లా ఇంటికొచ్చేయాలి, వాళ్ళతో మాట్లాడకూడదు, వీళ్ళతో నవ్వకూడదు, ఇవే తినాలి.. అంటూ సవాలక్ష కండిషన్లు పెడతారు.." అని ఒకింత సీరియస్ అవుతూ అందావిడ.

తల్లి చేతిని తన చేతిలోకి తీసుకుని, "డాడీ నిన్ను సరిగ్గా చూసుకోలేదా? డాడీ కూడా నీకలాంటి కండిషన్లు ఏమైనా

## కొత్తగాలి...

**ఆకుపచ్చ చెట్లను**
**పెంచమని చదివేడు**
**పచ్చ నోట్లను**
**పెంచుకుంటూ పోతున్నాడు**

*- జి.జి.కె. రావు,*
*అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా*

పెట్టారా? " కుతూహలంగా అడిగింది వర్ణ.

వర్ణ చేతిని గట్టిగా బిగించి పట్టుకుంది సుమణి. పెదవుల్ని కదిల్చి "చాలామంది కంటే ఎంతో బాగా చూసుకున్నారు వర్ణా! కానీ.. నేను ఇంకా చాలా ఎక్స్‌పెక్ట్ చేసుకున్నాను. కండిషన్ల విషయంలో పెతాప్, నేనూ ఓరోజు కూర్చుని, మాకు మేమే ఆంక్షలు పెట్టుకుని మా మధ్య ఉన్న రిలేషన్‌ని మేమే డెలికేట్ చేసుకోకూడదు అని నిర్ణయం తీసుకున్నాం. ఆ రోజు నుంచీ ఇప్పటికీ మేమిద్దరం ఫ్రీబార్డ్స్" అని అప్పటికప్పుడే నవ్వుతూ చెప్పింది సుమణి.

తల్లి మాటలు విని ఒక క్షణం కళ్ళుమూసుకుని తెరిచి "నువ్వు డాడీకి ఇచ్చినంత ఫ్రీడంని నేను నందూకి ఇవ్వలేకపోతున్నాను మమ్మీ.." నిదానంగా చెప్పింది వర్ణ.

"ఫ్రీడం మనది అనుకుంటే బావుంటుందిగానీ, నీదీ నాదీ అనుకునే ఫ్రీడం లోన్లీగా కూడా అనిపిస్తుంది బేబీ! ఊఁ! నువ్వు అలా ఏమైనా ఫీలవుతున్నావా? " అని ఆశ్చర్యంగా అంది సుమణి.

"ఊహూఁ! లోన్లీ అని కాదు. అది సరే! ఆ తరువాత డాడీ మీద నీకు కంప్లైంట్స్ ఏమీ లేవా..? " అనడిగింది వర్ణ.

"ఎందుకు లేవు? చాలా ఉన్నాయి. కానీ పెతాప్‌లో రొమాంటిసిజమ్, భావుకతలు చాలా ఎక్కువ. క్యాజువల్‌గానే ఎవరు స్మార్ట్‌గా కనిపించినా, మంచి డ్రెస్ సెన్స్‌తో ఉన్నా అలాగే ఎడ్మైర్ అయ్యి చూస్తాడు. పెతాప్ ఎమోషన్లని అర్థం చేసుకున్నాక, ఇక నాలో జెలస్ ఫీలింగులన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. లైఫ్‌లోని ప్రతి మూమెంట్‌నీ కామెడీ సెన్స్‌తోనే చూస్తూ, పెతాప్‌లా హాయిగా ఎంజాయ్ చేస్తూ జాలీగా గడిపేవాళ్ళు చాలా రేర్. అది చూసి సాటిస్‌ఫాక్షన్ అనిపిస్తుంది. బట్ ఎట్ ది సేమ్ టైం, సీరియస్ విషయాన్ని కూడా సిల్లీగా తీసుకుంటాడేంటని కోపం వచ్చేస్తుంది" అని తనలో తానే చిన్నగా నవ్వుకుంటూ చెప్పింది సుమణి.

తల్లి మాటలు వింటూ చిన్నగా తలాడించింది వర్ణ.

పాతరోజుల్లోంచి బయటకు వస్తూ "మిగిలిన విషయాల్లో మా ఇద్దరికీ అభిప్రాయాలు కలిసినా కలవకపోయినా... నన్ను మాత్రం చాలా బాగా చూసుకున్నారు. ముఖ్యంగా ఎప్పుడో తెలుసా? " అంది సుమణి.

ఎప్పుడన్నట్లు ఆసక్తిగా తల్లి ముఖంలోకి చూసింది వర్ణ.

"నువ్వు కడుపులో ఉన్నప్పుడు! అప్పుడు నేను బీఎస్ఆర్‌బి ఎగ్జామ్స్‌కి ప్రిపేర్ అవుతున్నాను. ఎగ్జామ్స్ రాసి సెలెక్ట్ అయ్యాను. ఇంటర్వ్యూకి వెళ్లేప్పటికి నాకు నైన్త్ మంత్. ఇంటర్వ్యూలో సెలెక్టయిన తరువాత రోజే నువ్వు పుట్టావు. ఒకవైపు ప్రొబెషనరీ పిరియడ్‌లో ఉన్న జాబ్. మరో పక్క నువ్వు రోజుల బేబీవి. ఇంటి పనుల్లోనూ, కొత్త జాబ్‌తోనూ విసుగొచ్చేది. నువ్వేమో రాత్రుళ్ళు నిద్ర లేచేదానివి. అప్పుడు పెతాపే పాలు కాచి, చల్లార్చి నీకు పట్టి నిద్రపుచ్చేవాడు. ఒకవిధంగా, ఆ టైంలో మన ఇద్దర్నీ చాలా బాగా చూసుకున్నాడు" అని ఆ రోజుల్ని తలుచుకుంటూ మురిపెంగా చెప్పింది సుమణి.

క్షణం క్రితం తండ్రితో పాటూ మగవాళ్ళందరి మీదా మండిపడిన తల్లి ఇప్పుడు

తండ్రిని తలుచుకుంటూ ఆయనను మెచ్చుకుంటున్నట్టు మాట్లాడుతుంటే వర్ణకి చిత్రంగా అనిపించింది.

ఎప్పుడూ జాబ్ ట్రాన్స్‌ఫర్‌లూ, కాంట్రాక్టులతో సుమణీ, ప్రతాప్‌లు బిజీగా ఉండడంతో వర్ణని రెసిడెన్షియల్స్‌లోనూ, హాస్టల్స్‌లోనూ ఉంచి చదివించారు. అందువల్ల వాళ్ళిద్దరికీ వర్ణతో ఇలా కూర్చుని ప్రేమగా కుటుంబ విషయాలు మాట్లాడుకునే అవకాశం రాలేదు.

ఇప్పుడు తల్లి మాటల్లో తన చిన్నప్పటి రోజుల గురించి వింటుంటే, తల్లిదండ్రుల జీవితాల గురించీ తన బాల్యం గురించీ మరింత తెలుసుకోవాలన్న ఉత్కంఠా, ఉత్సాహం కలుగుతున్నాయి వర్ణకి. అందుకే, "అప్పుడు డాడీ ఏం జాబ్ చేసేవాళ్ళు? " కుతూహలంగా అడిగింది వర్ణ.

"డాడీ ఇంకా కాంట్రాక్టర్‌గా సెటిల్ అవలేదు అప్పటికి. ఇంజనీరింగ్ పూర్తిచేసి జాబ్స్ ట్రైల్ లో ఉన్నారు. పార్ట్‌టైం జాబ్స్ ఏవో చేసేవారు. ఆయన ఇప్పుడు నన్ను పిసినారి అని కామెంట్ చేస్తున్నారుగానీ, అప్పుడు మనీ విషయంలో ఎంత క్యాలిక్యులేటెడ్‌గా ఉండేవారో తెలుసా? " అని చిరునవ్వుతో చెప్పింది సుమణి.

తల్లి మాటల్లోని సంబోధనకి షాక్ అయినంతగా చూస్తూ ఉండిపోయింది వర్ణ. నలుగురి మధ్యా ఉన్నప్పుడు 'ఏమండీ, మీరు' అన్నా, ఇంట్లో మాత్రం 'ఓయ్, నువ్వూ' అనో, కనీసం 'ర' వత్తు పలక్కుండా గబుక్కున 'పెతాపూ' అని క్యాజువల్‌గా పిలిచే తల్లి ఇప్పుడు కూతుర్నయిన తనతో మాట్లాడుతూ కూడా 'ఆయన' అంటూ చెప్తుండడం చాలా విస్మయాన్ని కలిగించింది వర్ణకి.

తల్లిని 'చాలా మోడ్రన్' అనుకునే వర్ణకి ఇప్పుడు మరో కోణం కనిపిస్తోంది.

"ఇలా కబుర్లతో కూర్చుంటే భోజనం టైం దాటిపోతుంది. పద! వాళ్ళకి ఆకలేస్తోందేమో! నీకు ఇష్టమని నాన్‌వెజ్ వెరైటీస్ చేయించాను.." అంటూ వర్ణ చేయిపట్టుకుని లేపుతూ, మంచం మీద నుంచి లేచింది సుమణి.

ఆ పూట వర్ణ, నందూ, ప్రతాప్, సుమణిలు కలిసి కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశారు. సాయంత్రం వరకూ వాళ్ళతోనే గడిపి, చీకటి పడుతుండగా ఇంటికి బయల్దేరారు వర్ణ, నందకిషోర్‌లు.

తల్లి మాటలు పదే పదే గుర్తొస్తున్నాయి వర్ణకి. 'తాను బయాలజీలో మేల్ హార్మోన్స్, ఫిమేల్ హార్మోన్స్ గురించి ఎంతో స్పష్టంగా క్షుణ్ణంగా చదువుకొని కూడా చిన్నమాటకి ఇంత ఇరిటేట్ అయిపోయానెందుకూ? ' అనుకుంది వర్ణ.

'ఎవరో అమ్మాయి స్మార్ట్‌గా ఉంది అని నందూ క్యాజువల్‌గా అన్న మాటని మనసులో పెట్టుకుని, వారం రోజుల పాటు జెలస్‌గా ఫీలయ్యానా? ' అనుకుంటూ తనని తాను తరచి చూసుకున్నాక ఆమె ఆలోచనలు ఆమెకే చాలా సిల్లీగా, నాన్సెన్స్‌గా అనిపించాయి. తాను ఇన్నిరోజులూ ముభావంగా ఉండి, నందూని కూడా బాధపెట్టానా అనిపించింది వర్ణకి.

ఇంటికి రాగానే బైక్ స్టాండేస్తూ, "నేను అంకుల్‌గారికి రెంట్ ఇచ్చొస్తాను. నువ్వు పదా!" అన్నాడు నందకిషోర్.

సరేనని తమ పోర్షన్ వైపు నడిచింది వర్ణ. ఆమె బుర్రని పట్టి ఉన్న ఆలోచన కొంచెం కొంచెంగా వదిలిపోతుంటే, ఫ్రెష్‌గా స్నానం చేసి తల్లి తనకోసం తీసుకున్న కొత్త నెట్టెడ్ శారీని కట్టుకుంది వర్ణ.

నందూ ఇంట్లోకి వచ్చేసరికి, సుగంధాలీనుతూ అందంగా సంతోషంగా కనిపించిన వర్ణని చూసి ఆశ్చర్యపోయాడతను. 'వర్ణ ఈరోజు వాళ్ళ తల్లిదండ్రుల ఇంట్లో గడపడం వల్లనే ఇలా ఆనందంగా ఉందా? ' అనిపించింది నందూకి.

ఆమెనే ఆశ్చర్యంగా చూస్తూ "ఏంటీ?

ఈరోజు కొత్తగా ఉన్నావ్? " అన్నాడు.

"ఊఁ! ఈ రోజు ఈ కెమిస్ట్రీ ప్రొఫెసర్ గారిలోని కెమిస్ట్రీ తెలిసిందిలే!" అంటూ నవ్వింది వర్ణ.

"అహా..! ఏంటో తమరు తెలుసుకున్న ఆ కొత్త కెమిస్ట్రీ? " అని నవ్వుతూ అడిగాడు నందూ.

"మేల్ హార్మోన్స్ బాగా ఎక్కువనీ..!" కొంచెం వ్యంగ్యంగా చెప్పిందామె.

"ఫస్ట్‌నైట్ అప్పుడు తెలియాల్సిన విషయం ఇప్పటికి తెలిసిందా..!" అని కొంటెగా అని "ఇంతకీ ఈ టెస్టోస్టిరాన్ హార్మోన్స్ రిజల్ట్ ఏ టెస్టింగ్‌లో బయటపడిందో? " చాలా ఆసక్తిగా అడిగాడు.

తాను అనుకునే సైకలాజికల్ ఫీలింగ్స్ విషయానికీ, అతను అంచనా వేస్తున్న ఫిజికల్ టెస్ట్‌ల విషయానికి అసలు పోలికే లేకపోవడంతో, తన భాష అతనికి అర్ధమవదు అనుకోగానే నవ్వొచ్చింది వర్ణకి. కానీ, నందూ అడిగిన ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలో తెలీక దాన్ని కవర్ చేసుకుంటూ, "అన్నీ చెప్పేస్తామేంటీ? ఇలాంటివి ఎవరికి వారే ఏదో ఒక టెస్ట్ చేసి తెలుసుకోవాలి!" అంది.

ఆమె మాటలకి గట్టిగా నవ్వేశాడు నందూ. "పోన్లే! ఏదో ఒక టెస్ట్..! నిజం తెలిసిపోయింది కదా నీకు! ఇంకేం..!" అంటూ రెండు చేతులతో వర్ణని చుట్టేశాడు.

గువ్వలా అతని చేతుల మధ్య ఇమిడిపోయిన ఆమె రూపంతో పాటు ఆమెలోని ఆనందమూ అతనికి ఒకలాంటి మత్తుని కలిగిస్తోంది.

"ఓయ్ నందూ! వదులు! వెళ్ళి స్నానం చేసిరా! చెమట కంపు కొడుతున్నావ్ తెలుసా? బ్యాడ్‌బోయ్..!" అని మురిపెంతోనే కసిరినట్టుగా అంది వర్ణ.

"నన్ను కేకలేస్తావేంటీ? వెళ్ళి మీ నాన్నని గసురు. కొత్త ప్లాంట్స్ తెచ్చారంట. గునపం చేతికిచ్చి, చెమటలు కారేలా నా చేత పెద్దపెద్ద గోతులు తవ్వించారు. ఆయన మాత్రం మినిష్టర్ లాగా ఒక్కో మొక్కనీ ఆ గుంటలో పెట్టి మళ్ళీ నా చేతే వాటిని పూడిపించారు.." అని అలిగినట్టుగా బుంగమూతి పెట్టి విసుక్కున్నాడు నందూ.

అతని ముఖాన్ని, అతను అన్న విధానాన్ని చూసి నవ్వేసింది వర్ణ. వెంటనే "ఆగు! డాడీకి ఫోన్ చేసి, ఇలా అన్నావని చెబుతాను!" అని బెదిరించింది.

"చెప్పో! నాకేమన్నా భయమా? అల్లుడని కూడా చూడకుండా నా చేత అంత పని చేయించారు, అన్యాయమని ఆయన ముఖం మీద అనేశాను కూడా!" ధీమాగా అంటూ టవల్ తీసుకున్నాడు నందూ.

"ఛా..! డాడీని చూస్తే నోట్లోంచి మాటే రాదు. నిజంగా అలా అన్నావా? మరి డాడీ ఏమన్నారు? " అని అతను చెప్పిన దాన్ని నమ్మనన్నట్టుగా అడిగింది వర్ణ.

జవాబు చెప్పకుండా నవ్వుకుంటూ బాత్‌రూం వైపు వెళ్ళాడు.

"ఓయ్ నందూ! ఆగు! అడుగుతుంటే అలా వెళ్ళిపోతావేంటీ..? " అంది వర్ణ.

ఆగి వెనక్కి చూసి, "పోనీ మా అమ్మాయిని పిలుస్తాను, పెళ్ళాం చెబితే చేస్తావుగా! అన్నారు మీ డాడ్డీ" అని రోషంగా ఒత్తి పలుకుతూ, బాత్‌రూం డోర్‌ని ధబ్‌మని శబ్దమయ్యేలా వేసుకున్నాడు నందూ.

అతని మాటలకి నవ్వు ఆగలేదు వర్ణకి. తండ్రి సెన్సాఫ్ హ్యూమర్ మనస్తత్వం గుర్తొచ్చి ఇంకా నవ్వుతూనే ఉందామె. ఎందుకో వర్ణకి ఈ రోజు చాలా సంతోషంగా అనిపిస్తోంది. ఆమె మనసు చాలా తేలికగా, హాయిగా ఉండడం ఆమెకి స్పష్టంగా తెలుస్తోంది కూడా. తల్లి ప్యాక్ చేసి ఇచ్చిన వంటల్ని ఒక్కొక్కటీ నందకిషోర్‌కి కొసరి కొసరి వడ్డిస్తూ, అతను తిన్న దాన్ని తృప్తిగా చూసింది వర్ణ.

ఇద్దరూ భోజనం చేసిన తరువాత కబు

ర్లు చెప్పుకుంటూ డాబా పైకి వెళ్ళారు. చల్ల గాలిలో, పంచమినాటి వెన్నెల్లో వాళ్ళిద్దరూ ఒకరిలో మరొకరుగా ఏకమైపోయారు.




రోజులు చాలా వేగంగా కదులుతూ మూడు నెలలు గడిచిపోయాయి.

ఆరోజు ఉదయం వర్ణ తన ఐడి కార్డ్‌తో ప్రెజెంట్ నోట్ వేసి, తన కేబిన్‌లోకొచ్చి కూర్చోగానే ఆఫీస్ అసిస్టెంట్ వచ్చాడు.

"వర్ణా మేడమ్! మీరు రాగానే మిమ్మల్ని సుధాకర్ సార్ పిలవమన్నారు" అని చెప్పాడతను.

"నన్నా..!" అని దేనికన్నట్టుగా కనుబొమలు ముడిచి చూసింది వర్ణ.

"ఏమో మేడమ్! రాగా మేడంగార్ని కూడా వచ్చిన వెంటనే కలవమన్నారు.." అని చెప్పాడు.

"రాగాని కూడానా..!" అంటూ, "రాగ వచ్చిందా..? " అడిగింది వర్ణ.

"ఇంకా రాలేదు మేడం" అని చెప్పాడు.

"సరే! రాగానే నాకోసారి ఇన్‌ఫాం చెయ్యి" అని తన సిస్టం ఆన్ చేసింది.

అలాగేనంటూ వెళ్ళిపోయాడు ఆఫీస్ అసిస్టెంట్. వెళ్ళిన పది నిముషాలకే అతని వెంట రాగా కూడా వచ్చింది.

వాళ్ళిద్దర్నీ హెడ్ దగ్గరకు వెళ్ళమని మళ్ళీ చెప్పి అక్కడ నుంచి వెళ్లిపోయాడు ఆఫీస్ అసిస్టెంట్.

వర్ణని చూసి, "ఏమంటావ్ మ్యాటర్..! మన ఓప గాడు ఎందుకు రమ్మన్నాడే వర్ణా? " అని ఆత్రుతగా అడిగింది రాగ.

తెలీదన్నట్టుగా పెదవి విరిచి, "ఏమో మరి? మా బ్యాచ్ మొత్తంలో పెండింగ్ వర్క్ లేదు" అని ఆలోచిస్తూ అంది వర్ణ.

"మా టీమ్‌లోనూ పెండింగ్ లేదు" అని వెంటనే అంది రాగా.

"కొత్త ప్రాజెక్ట్ ఏదో వచ్చుంటుందిలే! పదా..! ఓసారి కనిపించి వద్దాం!" అంటూ లేచింది వర్ణ.

"హుం! ఇప్పుడు వీణ్ని మొయ్యలేక చావాలే బాబూ! దేవుడా! ఇలాంటి మోత మనుషుల వల్ల నీకేంటి ఉపయోగం..? " అంటూ తల పైకెత్తి చూసింది రాగా.

రాగా మాటలకి చిన్నగా నవ్వింది వర్ణ. "మొయ్యడం ఇష్టం లేకపోతే మానెయ్. నువ్వు అదో, నువ్వు ఇదో అని కంపల్సరీ మొయ్యాల్సిన రూలేం లేదుగా.." అని నవ్వుతూనే అంది.

"నీకేంటమ్మా! నువ్వు గార్జియస్. నువ్వేం మట్లాడకపోయినా జస్ట్ అలా.. చూస్తే చాలు, సెంట్ పర్సెంట్ మార్క్స్ పడిపోతాయ్. మాలాంటి ఏవరేజ్‌లు స్మార్ట్‌గా కనిపించడం కోసం ఎప్పుడూ నవ్వుతూ ఉండాలి. లీడర్లని ఇంప్రెస్ చేసేలా మాట్లాడాలి. అప్పుడే 'బెస్ట్ వర్కర్' అన్న పేరొస్తుంది" అని ముఖంలో బోలెడంత దిగులుని ఒలికిస్తూ అంది రాగా.

ఆ మాటలకి ఉన్నట్టుండి నందకిషోర్ మాటలు గుర్తొచ్చాయి వర్ణకి. రాగా అన్నట్టుగానే అతనూ ఆ నందినీ అనే ఆమెని స్మార్ట్ అన్నాడని అర్థమైంది. వెంటనే రాగా భుజంమీద ఒక్కటేసి "సోదాపి పద!" అంటూ ముందుకు కదిలింది వర్ణ.

ఇద్దరూ కలిసి ప్రాజెక్ట్ హెడ్ సుధాకర్ దగ్గరకు వెళ్ళారు.

ఐఫోన్‌లో ఏదో మెయిల్ ప్రిపేర్ చేస్తున్న సుధాకర్, డోర్ చప్పుడుకి తలెత్తి చూశాడు. వర్ణా, రాగా ఇద్దరూ లోపలకు

రావడం చూసి, "కమాన్ మైడియర్ బ్యూటిఫుల్ లేడీస్.." అని నవ్వుతూ పల కరించాడు సుధాకర్.

మాటల్లో అతని ఓవరాక్షన్ వాళ్ళిద్దరికీ అనుభవమే. అందుకే దాన్ని ఏ మాత్రం పట్టించుకోకుండా "గుడ్మార్నింగ్ సుధాకర్ గారూ.." అని ఇద్దరూ ఒకేసారి చెప్పారు.

"గూ..డ్మార్నింగ్. మీ ఇద్దరికీ ఓ గుడ్‌న్యూస్. నాకు ఈ గుడ్‌న్యూస్ లాస్ట్ నైటే తెలిసినా మీ ఇద్దరికీ ఫోన్‌లో కాకుండా డైరెక్టుగా చెప్పాలని, నా ఎగ్జయిట్ మెంట్ ని అలా కంటిన్యూ చేసుకుంటూ వచ్చాను" అని ఉబ్బితబ్బిబ్బవుతూ అన్నాడు సుధాకర్.

"ఏంటిది సార్ ఆ గుడ్‌న్యూస్...?" అని ఆత్రుతగా అడిగింది రాగా.

"మరి మంచి ట్రీట్ ఇస్తానంటే చెబుతాను.." నవ్వుతూ అన్నాడు సుధాకర్.

రాగా వంక సీరియస్‌గా చూసింది వర్ణ.

ఏంటిదని అడగకపోయినా చెప్పాల్సిన వాడు చెప్తాడు కదా! నీకెందుకంత కంగారు? సైలెంట్ గా ఉండలేవా? అన్నట్టు చూస్తున్న వర్ణ చూపుల్లోని భావాన్ని గ్రహించగానే గతుక్కుమని నిల బడింది రాగా. తనలోని ఆత్రుతని అణుచుకుంటూ సుధాకర్ వంక చూసి, "మీరు చెప్పే గుడ్‌న్యూస్ రేంజ్ ని బట్టి పార్టీని తప్పకుండా ఆ రేంజ్ లో ఇస్తాం సుధాకర్ గారూ.." అంది రాగా.

"ఓహో! అయితే.. చాలా గ్రాండ్ పార్టీ అన్నమాట!" అంటూ ఇంకా గట్టిగా నవ్వాడు సుధాకర్.

'ఎంతకీ విషయం చెప్పడేంటీ?' అనుకుంటూ ఈసారి రాగా కూడా వర్ణా రూట్ లోకి వచ్చినట్టు, సైలెంట్ గా నిలబడింది.

"ఓకే! అయితే చెప్పేస్తున్నా, చెప్పేస్తున్నా" ఊరిస్తున్నట్టు అన్నాడు సుధాకర్.

వర్ణా, రాగ ఇద్దరూ మౌనంగా అతని వంక చూడసాగారు.

"ఈ ఇయర్ మన కంపెనీ ఆన్ సైట్ ట్రైనింగ్‌కు ఈ బ్రాంచ్ నుంచీ, మీ ఇద్దరి నేమ్స్ సెలెక్ట్ చేసింది. వచ్చేనెలలోనే మీరు మన మెయిన్ బ్రాంచ్‌కి.. అంటే మన మెయిన్ బ్రాంచ్ ఉన్న యూఎస్‌కి వెళ్ళబోతున్నారోచ్..!" అని ఎంతో ఉత్సాహంతో గట్టిగా అరుస్తూ చెప్పాడు సుధాకర్.

అది వినడంతోనే "ఆన్ సైట్ కా! యూఎస్‌కా!!" అని రాగా కూడా అరిచినంత పని చేసింది.

ఆ మాటలు వినగానే నిశ్శబ్దంగా ఉండిపోయింది వర్ణ. వెంటనే నందూ గుర్తొచ్చాడు. నందూని వదిలి తాను యూఎస్ వెళ్ళడం ఇంపాజిబుల్...అని వెంటనే మనసులో స్థిరంగా అనుకుంది వర్ణ.

"ఇప్పుడే అఫీషియల్ మెయిల్ మీ ఈ మెయిల్స్‌కి ఫార్వార్డ్ చేస్తా. వెళ్ళి ఈ గుడ్ న్యూస్ మీ బ్యాచ్‌లకీ, ఫ్రెండ్స్‌కీ, మీ ఫ్యామిలీమెంబర్స్‌కి చెప్పి పండగ చేస్కోండి.." నవ్వుతూ అన్నాడు సుధాకర్.

వెంటనే వెనుదిరిగారు వర్ణ, రాగా.

"మీ హ్యాపీనెస్‌లో పడి నా పార్టీని ఇగ్నోర్ చేయకండి" మళ్ళీ గట్టిగా అంటూ గుర్తుచేశాడు సుధాకర్.

రాగా వెనక్కి తిరిగి, "ష్యూర్ సర్! తప్పకుండా మీ పార్టీని గుర్తుంచుకుంటాం" చెప్పి, వర్ణతోపాటు బయటకు వచ్చేసింది.

ప్రాజెక్ట్ హెడ్ సుధాకర్ రూమ్‌లోంచి అడుగు బయటకు పెట్టగానే కొలీగ్స్‌కీ, స్టాఫ్‌కీ సంతోషంతో అరిచి మరీ ఆ వార్తని అందరికీ చెప్తోంది రాగా.

వర్ణ మాత్రం తన క్యాబిన్‌కి వచ్చి వెంటనే నందూకి ఫోన్ చేసింది. అతని ఫోన్ రింగయ్యింది గానీ, ఆన్సర్ చెయ్యలేదు. క్లాస్‌లో ఉన్నాడేమో అనుకుంటూ వాచ్ వంక చూసుకుంది వర్ణ. ఉదయం పదకొండు గంటలవుతోంది.

తన సీట్లో కూర్చుని ఆలోచనలో పడింది వర్ణ. మరికొన్ని నిముషాల

తర్వాత ఏదో నిర్ణయించుకున్నదానిలా లేచి, ప్రాజెక్ట్ హెడ్ దగ్గరకి వెళ్ళిందామె.

★ ★ ★

క్లాస్‌లో నుంచి బయటకు వచ్చి, ఫోన్ చూసుకున్న నందకిషోర్‌కి అందులో వర్ణ మిస్డ్‌కాల్ ఉండడం చూసి, వెంటనే ఆమెకి ఫోన్ చేశాడు.

"హలో!" అంది వర్ణ.

"హలో వర్ణా! ఫోన్ సైలెంట్‌లో పెట్టాను. నీ కాల్ చూడలేదు" అన్నాడు నందూ.

"ఇట్స్ ఓకె నందూ! నేను ఇంటికి వచ్చేశాను. నా కోసం ఆఫీస్‌కి వెళ్ళకు. అది చెబుదామనే ఫోన్ చేశాను" అంది వర్ణ.

"ఇంటికి వెళ్ళిపోయావా..! ఏం? ఒంట్లో బాలేదా? " అని ఆదుర్దాగా అడిగాడు.

"అదేం లేదులే! వర్క్ మీద కాన్‌సెన్‌ట్రేషన్ లేదనిపించింది. వచ్చేశాను"

"కాన్‌సెన్‌ట్రేషన్ లేదా! ఎందుకు? ఏమైంది? " అని కంగారుగా అడిగాడతను.

"ఏం లేదులేరా బాబూ! సాయంత్రం మాట్లాడుకోవచ్చులే" విసుగ్గా అందామె.

"అంటే.. ఇప్పుడు లంచ్‌కి నన్ను ఇంటికి రావద్దంటావా..? " ఆశ్చర్యంగా అన్నాడు.

మధ్యాహ్నం ఇద్దరూ ఇంటికి వచ్చి లంచ్ చేద్దామనుకున్న విషయం అప్పుడు గుర్తొచ్చింది వర్ణకి. వెంటనే, "సారీరా! రోజట్లా క్యారేజ్ తీసుకెళ్ళిపోయావ్ అనుకున్నాను.." అని ఇబ్బందిగా అంటూ మళ్ళీ ఇంకోసారి సారీ చెప్పింది.

"ఇట్స్ ఓకేలే! నీ మైండ్‌కి కాన్‌సెన్‌ట్రేషన్ లేదని బాగా అర్థమైంది. నేను లంచ్‌కి బయల్దేరి వస్తున్నా! ఉంటాను!" అని చెప్పి ఫోన్ కట్ చేశాడు నందకిషోర్.

అర్ధగంటకి ఇంటికి వచ్చాడతను.

రావడంతోనే డల్‌గా ఉన్న వర్ణ ముఖం చూసి "ఏంటి వర్ణా? ఏమైంది? ఎందుకలా వున్నావ్..? " అంటూ ప్రశ్న మీద ప్రశ్న వేశాడు.

"ఏం లేదులే! ఆకలేస్తోంది ముందు లంచ్ చేద్దాంరా!" మాట మార్చింది వర్ణ.

"ఊహుం! నాకు ఆకలెయ్యట్లేదు.." విషయం చెప్పకపోతే తినను అని బెదిరిస్తున్నట్టుగా అన్నాడతను.

"అవునా! అయితే నీకు ఆకలి వెయ్యకపోతే ఏం చెయ్యాలో అత్తయ్యని అడిగి కనుక్కుంటాను ఆగు!" అంటూ సెల్‌ఫోన్ అందుకుంది వర్ణ.

తల్లి ప్రస్తావన రాగానే అన్నీ మర్చిపోయాడు నందూ. "చెయ్యి! అమ్మతో

## జూన్ - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **జి. జనార్ధన్‌రెడ్డి**
   - గంగాస్థాన్, నిజామాబాద్
2. **ఎన్. శిరీష**
   - బసిరి వీధి, విజయనగరం
3. **పి. అనూష**
   - ఎస్.ఎన్. పురం, విజయవాడ
4. **తల్లాప్రగడ సుందరరాజయ్య**
   - రామకృష్ణానగర్, రాజమండ్రి
5. **జి. శ్రీనివాసరావు**
   - వివేకానందపురం, సికింద్రాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. వాసంతి | 6. ఆనందరావు |
| 2. కోటి | 7. లక్ష్మయ్య |
| 3. సుగుణ | 8. దరహాస్ |
| 4. బాపయ్యగారు | 9. ఆస్కార్ |
| 5. శివయ్య | 10. బొల్లిముంత శివరామకృష్ణ |

మాట్లాడి చాలా రోజులైంది. ఆఫ్టర్‌నూన్స్ చేద్దామనుకుంటూ, పక్కన నువ్వు కూడా ఉన్నప్పుడు చేద్దామని ఆగిపోతున్నాను. ఈమధ్య కుదరట్లేదసలు.." అన్నాడు.

వెంటనే శ్యామలకు ఫోన్ చేసింది వర్ణ. 'హలో!' అనగానే "బావున్నారా అత్తయ్యా!" అని ఉత్సాహంగా అడిగింది.

ఆవిడ గొంతు వినగానే వర్ణలో అప్పటి వరకూ ఉన్న ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. సరిగ్గా కూర్చుని ఫోన్‌ని ఆ చెవి నుంచి ఈ చెవికి మార్చుకుంది.

"బాగున్నానమ్మా. మీరెలా ఉన్నారు? " అంది శ్యామల.

అవతల నుంచి వినిపిస్తున్న ఆవిడ గొంతులో ఎప్పట్లా ఉత్సాహం లేకపోవడాన్ని కనిపెట్టింది వర్ణ. "ఏంటత్తయ్యా! అలా ఉన్నారు? " అని సందేహంగా అందామె.

"నేనే నందూకి ఫోన్ చేద్దామనుకుంటున్నా వర్ణా! నిన్న మీ మామగారికి గుండెల్లో నొప్పి వచ్చి చెమటలు పట్టాయి"

"వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళారా? " కంగారుపడుతూ అడిగింది వర్ణ.

ఆమె మాటలు వినగానే ఆదుర్దాగా వర్ణ వంక చూశాడు నందూ.

"నాలుగు నిముషాలకి సర్దుకుంది. కానీ హాస్పిటల్‌లో చూపిద్దాం అంటే అసలు వద్దంటారు. నిన్నట్నుంచీ పోరితే, ఈరోజు కదిలారు. పొద్దున్నే వెళ్ళొచ్చాం. డాక్టరుగారు పరీక్షలవీ చేసి కంగారుపడాల్సిందేం లేదన్నారు. ఏవో టెస్టులు రాసిచ్చారు. టెస్టుల గురించి చెప్పడానికి మళ్ళీ రేపు రమ్మన్నారు. అవన్నీ చేయించి ఇందాకే తిరిగొచ్చామా.. మళ్ళీ వెంటనే ఆఫీసుకి వెళ్ళిపోయారు.." అందావిడ.

శ్యామల చెప్పినదాన్ని విన్న తరువాత, "జాగ్రత్తండత్తయ్యా! ఇదుగోండి ఫోన్ నందూకి ఇస్తున్నాను.." అంటూ సెల్ ఫోన్ నందూకి ఇచ్చింది వర్ణ.

తల్లి చెబుతున్నది వింటున్న నందూ ముఖంలో దిగులు కమ్ముకుంటోంది. అతను తల్లితో మాట్లాడుతున్న మాటలు వింటూ ఆదుర్దాగా చూడసాగింది వర్ణ.

'నందూ వాళ్ళపేరెంట్స్‌తో ఉండుంటే మామయ్యగారిని అతనే దగ్గరుండి చాలా జాగ్రత్తగా చూసుకునేవాడు. ఆయనకీ కొడుకు పక్కన ఉంటే కొంచెం ధైర్యంగా ఉండేది' అనుకుందామె.

"అమ్మా! రేపు ఉదయం నేనొస్తాను!" అన్నాడు చివరగా నందకిషోర్.

"ఫర్లేదురా నందూ! వద్దులే! రేపు హాస్పిటల్‌కి వెళ్ళి వస్తాం కదా! రిపోర్టులు కూడా రేపు వస్తాయి. తేడా ఏమన్నా ఉంటే వద్దువులే!" అందావిడ.

తల్లి మాటల్లోని నిగూఢార్థాన్ని గ్రహించాడు నందూ. తండ్రికి తన మీద కోపం ఇంకా తగ్గలేదని అర్థమైంది అతనికి. చాలా బాధగా అనిపించింది.

'వర్ణని పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం ఉంటే ఇంట్లో ఉండొద్దు' అన్నారాయన. పెళ్ళి జరిగిన తరువాత ఆయనే అర్థం చేసుకుంటార్లే అనుకున్నాడు. కానీ ఇప్పటికీ ఆయన కోపం తగ్గలేదని గ్రహించగానే అతని మనసుకి అశాంతిగా అనిపించింది.

తల్లితో మాట్లాడి ఫోన్ కట్ చెయ్యగానే, అలాగే కూర్చుని ఫోన్ డిస్‌ప్లే వంక చూస్తూ ఉండిపోయాడు నందకిషోర్. కాల్ అయిపోగానే అంతక్రితం వర్ణ చూస్తున్న ఈ మెయిల్ ఫోన్ స్క్రీన్ మీద కొచ్చి కనిపించింది. అసంకల్పితంగా దాని వంక నందకిషోర్ కనుబొమలు ముడిచి చూశాడు. సబ్జెక్టులో ఉన్న హెడ్డింగ్‌తో పాటూ పై వరుసలోని కొన్ని అక్షరాల్ని చదివిన అతని కళ్ళు అమితాశ్చర్యంతో ఆ వరుసల వెంట ముందుకు కదిలాయి.

'ఫోన్‌కాల్ కట్ అయినా, నందు తన సెల్‌ఫోన్‌లో ఇంట్రెస్టింగ్‌గా ఏం చూస్తున్నాడా? ' అనుకుంటూ డిస్‌ప్లే వంక చూసింది వర్ణ. అది కంపెనీవాళ్ళు పంపిన

ఈమెయిల్ అని అర్థమైందామెకి.

ఈ 'ఆన్‌సైట్' విషయం తెలిస్తే అతను బాధ పడతాడేమో అనుకుని, అసలు మాములుగానే ఈ విషయాన్ని నందూకి అప్పుడే చెప్పకూడదనుకుంది వర్ణ. ఇప్పుడు నందూ వాళ్ళ నాన్నగారికి బాగోలేదని తెలిశాక ఈ టైంలో అస్సలు చెప్పకూడదు అని అనుకుంటుండగా అతను ఫోన్‌లో మెయిల్ చూసేస్తుంటే.. నందూ చేతిలోంచి ఫోన్‌ని లాక్కోబోయింది వర్ణ.

అతను ఫోన్‌ని పక్కకు పట్టుకుని, వేలితో స్క్రీన్‌ని స్క్రోల్ చేసుకుంటూ అప్పటికే మొత్తం చదివేశాడు. చివర్లో ఉన్న పేర్ల లిస్టులో వర్ణ పేరుని చూడగానే అతని కళ్ళు పెద్దవయ్యాయి. ఒక్కసారిగా తలతిప్పి వర్ణ వంక చూశాడు నందకిషోర్. అప్పటివరకూ దిగులుని నింపుకున్న అతని కళ్ళలోకి హఠాత్తుగా వెలుగొచ్చింది. తన కళ్ళని తానే నమ్మలేనట్టు మళ్ళీ ఫోన్ స్క్రీన్ వంక చూసి మళ్ళీ వర్ణ ముఖంలోకి చూశాడు.

వర్ణ దిగాలుగా చూసింది. ఆమె భావాల్ని పట్టించుకోకుండా, వెల్లువెత్తిన ఉత్సాహంతో ఒక్కసారిగా వర్ణని రెండు చేతుల్తో చుట్టేశాడు నందూ.

"ఇంత మంచి ఆపర్చ్యునిటీ వస్తే అలా డల్‌గా కూర్చున్నావేంటీ? ఓహ్! నువ్ యూఎస్ వెళ్ళబోతున్నావ్..! ఓమైగాడ్! ఇట్స్ సో గ్రేట్ వర్ణా! కంగ్రాట్స్.. కంగ్రాట్స్ మైడియర్! నాకు ట్రీట్ ఇద్దామనేనా ఆఫీస్ నుంచి వచ్చేశావ్..!" అంటూ వర్ణని ముద్దుల్లో ముంచేస్తూ అన్నాడతను.

నందూలోని సంతోషాన్ని ఆశ్చర్యంగా చూస్తూ "ఓయ్! నువ్వు మరీ ఎగ్జయిట్ అవకు. నేను యూఎస్ వెళ్ళను అని మా హెడ్‌కి చెప్పేశాను" అంది వర్ణ.

ఆమె అన్న మాటలకి ఉలిక్కిపడ్డట్టుగా చూశాడు నందూ. కనుబొమ్మల్ని ముడిచి, "ఏం? ఎందుకనీ? ఇంత మంచి ఛాన్స్ వస్తే వద్దని ఎందుకు చెప్పావ్?" అని నమ్మలేనట్టుగా చూస్తూ అడిగాడు.

"ఎందుకంటావేంటీ..! నిన్ను విడిచిపెట్టి

## 'చతుర'లో తొలి నవల

బి. గీతిక

రచన వల్ల కాలక్షేపం కావడం కంటే ఏదో ఒక విషయాన్ని తెలియజెప్పాలని కోరుకుంటాను. సమాజంలోని భిన్నత్వాల్ని పరిశీలించి అధ్యయనం చేస్తూ నేను అనుభూతించిన దాన్ని నా అక్షరాల ద్వారా నలుగురికీ పంచాలని రచనలు చేస్తున్నాను. అలాంటి కొన్ని అక్షర భావోద్వేగాల్ని ఈ నెల 'అద్వైతం'గా అందరి ముంగిళ్లలోకి చేర్చిన చతురకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఇప్పటివరకూ 52 కథలూ, 12 నవలలూ ప్రచురితమయ్యాయి. పది కథలకు, ఆరు సీరియళ్లకు బహుమతులు పొందాను.

సమాజంలో స్త్రీపురుష బంధం.. వాదాల్లో పడి నలుగుతూ ఎప్పుడూ హెచ్చుతగ్గుల్లోనే ఉంటోంది. 'ఆకాశంలో సగం' అన్నా, 'ఆకాశం మొత్తం నాదే' అన్నా, సృష్టికి మాత్రం స్త్రీ పురుషులిద్దరూ సమానమే. వాళ్లిద్దరూ ఏకమైతేనే భావితరాలుంటాయి తప్ప ఏ ఒక్కరో మానవజాతిని కొనసాగించుకెళ్లలేరు అన్నది నేను తెలుసుకున్న సత్యం.

పరిస్థితుల వల్ల అనుకోకుండా ఒకటి కావల్సొచ్చిన ఒక జంటా, ఆర్థిక స్వాతంత్ర్యం పొంది స్వేచ్ఛాభావాలతో ఉండే మరో జంటా, ప్రేమ వివాహం చేసుకున్న ప్రస్తుత కాలపు నవజంటగా ఆరు భిన్నమైన వ్యక్తిత్వపు పాత్రలతో భార్యాభర్తల సంబంధాన్ని మూడు కోణాల్లో చూపించే నవల ఈ అద్వైతం.. మీకు నచ్చుతుందని ఆశిస్తున్నాను.

**చిరునామా:**

**బి. గీతిక**

# 2-123, పోడూరు - 534327,

ప.గో జిల్లా, ఆంధ్రప్రదేశ్

ఒక్కదాన్నీ ఎలా వెళతాను? ”

“ఒక్కదానివీ కాదుగా, నీతో పాటు చాలామంది పేర్లు సెలెక్ట్ అయ్యాన్నాయ్. మీ బ్రాంచ్ నుంచీ రాగా కూడా వస్తోం దిగా..” ఫోన్ డిస్ప్లే వంక చూపిస్తూ అన్నాడు నందూ.

“హబ్బా! ఒక్కదాన్నీ అంటే.. నువ్వు లేకుండా నేనొక్కదాన్నీ అని”

“అందుకని వెళ్ళనంటున్నావా..! నీకు నిజంగానే మైండ్ పనిచెయ్యట్లేదు వర్ణా. మనం లైఫ్‌లాంగ్ కలిసుంటాం. నాలుగు నెలలు ఎంతలోకి గడుస్తాయి చెప్పు”

“నాలుగు నెలలు కాదు, ఆరు నెలలు!”

“అదేలే! మన పెళ్ళయ్యి ఇంచుమించు పది నెలలవుతోంది. అసలు అన్ని నెలలు గడిచినట్టుందా? అలాగే ఇంకో ఆరు నెలలూ చిటికెలో అయిపోతాయి” అన్నాడు నందూ.

“మనం కలిసి ఉంటే టైం గడవడం వేరు నందూ! విడివిడిగా ఉంటే అసలు ఒన్ మినిట్ కూడా టిక్కూ టిక్కూ అంటూ ఎప్పటికి గడుస్తుందో తెలుసా? నేను ఇంటికొచ్చిన తరువాత ఇంట్లో ఒక్క దాన్నీ ఒన్నవర్ గడపడానికి ఎంత అనీ జీగా ఫీలయ్యానో. ఇప్పుడు చూడు! నువ్వు ఇంటికి వచ్చి ఒన్నవర్ అయ్యింది. అసలు టైం తెలిసిందా? ” అని నందూకి రీజన్ చూపిస్తున్నట్టు గబగబా చెప్పిందామె.

“అమ్మో..! నేనొచ్చి ఒన్నవర్ అయ్యిందా..! క్లాస్‌కి వెళ్ళాలి!” అంటూ కంగారుగా వాచ్ వంక చూశాడు నందూ.

అలాంటి పరిస్థితిలో కూడా నందూ అన్న విధానానికి నవ్వింది వర్ణ.

అతను గబగబా సెల్‌ఫోన్ తీసి, కాలేజ్‌కి ఫోన్ చేశాడు. ఒక అర్జెంట్ వర్క్ పడిందని, కాలేజ్‌కి రాలేకపోతున్నానని, తన క్లాసుల్ని వేరే సబ్జెక్ట్‌కి ఎడ్జెస్ట్ చెయ్య మని చెప్పాడతను.

ఇక ఈ పూట నందూ కాలేజ్‌కి వెళ్ళడు అనుకోగానే కొంచెం హుషారొచ్చింది వర్ణకి. లేచి అతన్ని ఆనుకుని కూర్చుంది. అతను మళ్ళీ ఎవరికో ఫోన్ చేస్తుంటే, ఎవరికన్నట్లు ఆశ్చర్యంగా చూసిందామె.

“ఆ అంకుల్! వెంటనే ఒకసారి ఇంటికి వస్తారా? అహ! అదేం లేదు. జస్ట్ ఒక సారి రండి. ఆ.. ఇద్దరం ఇంట్లోనే ఉన్నాం. ఉంటాను..” అని చెప్పి ఫోన్ కట్ చేశాడు నందకిషోర్.

“డాడీకా..! ఎందుకూ..? ” అని ఆశ్చర్య పోతూ అడిగిందామె.

వర్ణ పశ్నకి జవాబు చెప్పకుండా “నాకు ఆకలేస్తోంది. ఏమైనా పెట్టేదుందా..? ” అని సీరియస్‌నెస్ నటిస్తూ అన్నాడు.

తాను అడిగినదానికి అతను సమా ధానం చెప్పకపోవడంతో సీరియస్‌గా చూస్తూ “గడ్డి పెట్టాలనుంది..” అని రపీ మని చెప్పింది వర్ణ.

“మరీ మంచిది. మీ అమ్మాయి గడ్డి పెడుతుందని అంకుల్‌తో పోట్లాడొచ్చు”

“ఇంకా మంచిది. ఆ గడ్డి పంట కూడా నీచేతే వేయించమని చెబుతాను. పాఠాలు మానేసి, పొలం పనులు చేసుకో!”

“అబ్బా! నీతో మాట్లాడలేనుగానీ, నిజంగా ఆకలేస్తోంది, రా వర్ణా..!” అని బతిమాలుతూ అన్నాడు నందూ.

అప్పటివరకూ కదలకుండా కూర్చున్న వర్ణ.. అతనలా అడగడంతో గబుక్కున లేచి కిచెన్‌లోకి వెళ్ళింది. గబగబా డైనింగ్ టేబుల్ మీద అన్నీ పెట్టింది. వాళ్ళిద్దరూ భోజనం ముగించేసరికి, ప్రతాప్‌గారు సుమణిని వెంటబెట్టుకుని మరీ వచ్చారు. కంగారుపడుతూ ఇక్కడకు వచ్చిన వాళ్ళు కూల్‌గా కూర్చున్న కూతుర్నీ, అల్లుడినీ చూసి ఆశ్చర్యపోయారు.

“వర్ణా! డాడీని అర్జెంటుగా రమన్నార ట!” అంటూ గబగబా కూతురి దగ్గరకు వచ్చింది సుమణి.

వర్ణ సీరియస్‌గా నందూ వంక చూసి,

"నేను కాదు.. నందూ.." అంది.

డైనింగ్ టేబుల్ మీదున్న వర్ణ సెల్ తెచ్చి, అందులోని ఈమెయిల్ తీసి, ఫోన్ని ప్రతాప్‌గారికి ఇచ్చాడు నందకిషోర్.

ఆయన ఈమెయిల్ అంతా చదవగానే, తలెత్తి గట్టిగా నవ్వుతూ "ఇంత గుడ్ న్యూస్ పెట్టుకుని ఇంత కూల్‌గా ఉన్నావేంట్రా తల్లీ! కంగ్రాట్స్‌రా! సుమణీ! చూడు! మన వర్ణకి యూఎస్ ఆఫర్ వచ్చింది" సెల్‌ఫోన్ భార్యకిచ్చారు.

ఆ మెయిల్‌లోని మ్యాటర్‌ని చదివిన సుమణి సంతోషంతో పొంగిపోయింది.

'ఎంతో హార్డ్‌వర్క్ చేసేవాళ్ళకి తప్ప ఇలాంటి అవకాశాలు రావు. కూతురు ఎప్పుడూ బెస్ట్ వర్కరే! ఆడపిల్ల అయినా కూడా మగవాళ్ళకి ఏ మాత్రం తీసిపోదు నా వర్ణ!' అనుకోగానే సుమణికి కూతురి మీద ప్రేమ రెట్టింపైంది. వెంటనే వర్ణ దగ్గరికి వచ్చి, కుర్చీలో కూర్చున్న వర్ణని గుండెలకు హత్తుకుని ఆమె నుదురు మీద ముద్దు పెట్టింది సుమణి.

"తను యూఎస్ వెళ్ళనని ఆఫీస్‌లో చెప్పేసిందట ఆంటీ!" అని గంభీరంగా అన్నాడు నందకిషోర్.

అంతే! ఉలిక్కిపడి దూరం జరిగి వర్ణ వంక చూసింది సుమణి. ఆవిడలో కలిగిన భావాన్ని గ్రహిస్తూ, కళ్ళెత్తి తల్లి వంక చూసింది వర్ణ.

ప్రతాప్‌గారు వచ్చి వర్ణ పక్కనున్న కుర్చీలో కూర్చుని, "ఏరా తల్లీ! వెళ్ళడం ఇష్టం లేదా? ఎందుకనీ?" అని అనునయంగా అడిగారు.

తల వాల్చుకుంది వర్ణ.

నందూ కూడా వచ్చి ఆమెకి ఎదురుగా నిలబడ్డాడు.

వర్ణ అతని వంక చూసి మళ్ళీ తల దించుకుని "నందూ లేకుండా అన్నిరోజులు ఒక్కదాన్నీ వేరేదేశంలో ఉండలేను డాడీ" నిదానంగా చెప్పింది.

సుమణి నిస్సత్తువగా పక్కనున్న కుర్చీలో కూలబడింది. 'ఇదే ఆఫర్ నందూకి వస్తే, అతను వర్ణ లేకుండా నేను అక్కడ ఒక్కణ్నే ఉండలేనంటూ వెళ్ళకుండా ఆగిపోతాడా?' అని మనసులో అనుకుందావిడ.

"తను ఎంత ఫూలిష్‌గా మాట్లాడుతోందో చూశారా అంకుల్! సంవత్సరాల తరబడీ అక్కడే ఉండాలా? ఏంటీ? ఆఫ్టాల్ ఆర్నెల్లు ఎంతలోకి గడుస్తాయి. మా పెళ్ళి నిన్నగాక మొన్న అయినట్టుంది. అప్పుడే పదినెలలు కాలేదా..?" అంటూ గట్టిగా చెప్పమన్నట్టుగా ప్రతాప్‌గారి వంక చూశాడు నందకిషోర్.

అంతే..! అతని మాటలకి ఉలిక్కిపడి చూసింది సుమణి. అంతే! 'వర్ణ యూఎస్ వెళ్ళడం నందూకి ఇష్టమేనా..?' అనుకుని ఆశ్చర్యపోయిందామె.

"ఏరా వర్ణా! నందూ చెప్పింది కూడా నిజమేగా! ఆర్నెల్లు అంటే ఇలా వెళ్ళి జస్ట్ అలా వచ్చేయడమే!" అని ఒక చేత్తో గాలిలో ఫ్లైట్ వెళుతున్నట్లు చూపించి, మరో చేత్తో రివర్స్‌లో వచ్చేస్తున్నట్టు చూపించారు ప్రతాప్‌గారు.

తండ్రి వంక గుర్రుగా చూస్తూ "ఈరోజు వెళ్ళి రేపు వచ్చేయడం కాదు డాడీ! ఆరు నెలలు అక్కడ ఉండాలి. నేను ఒక్కదాన్నీ ఉండలేను డాడీ!" దిగులుగా అంది వర్ణ.

## కొత్తగాలి...

**లోకులు కాకులు కాదు**
**ఎందుకంటే?**
**కాకి శవం దగ్గర**
**బోల్డన్ని కాకులు!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా



"నువ్వు ఒక్కదానివీ ఎలా ఉంటావ్ వర్ణా! ఆంటీ మీరైనా చెప్పండి. తనతో పాటూ ఎంతమంది వెళుతున్నారో చూశారుగా. తన కొలీగ్ రాగా నేమ్ కూడా ఉంది మెయిల్లో.." అన్నాడు నందూ.

అంతే! అతని వంక సీరియస్‌గా చూస్తూ, "ఎన్నిసార్లు చెప్పాలిరా గాడిదా! మాట్లాడితే కొలీగ్స్.. కొలీగ్స్.. అనకు! నేను ఒక్కదాన్నీ ఉండలేను అంటే మీనింగ్ నువ్వు పక్కన లేకుండా అని.." కరాఖండిగా చెప్పింది వర్ణ.

ఆమె 'గాడిదా' అని తిట్టి మరీ వాదిస్తుంటే కిమ్మనకుండా ఆమె వంకే చూడసాగాడు నందూ.

కూతురు తమ ముందే అల్లుడ్ని పట్టుకుని అంతమాట అనగానే మొదట కోపంగా చూసినా, తరువాత నందూతో పాటూ వర్ణ ఆలోచనా అర్థవంతమైందే అనిపిస్తుంటే ఎవరికి నచ్చచెప్పాలో తెలియక అయోమయంగా వాళ్ళిద్దరి వంకా మార్చి మార్చి చూస్తున్నారు ప్రతాప్, సుమణిలు.

"ఇలాంటి అవకాశం మళ్ళీ రమ్మంటే వస్తుందా? వర్ణకి మీరైనా చెప్పండంకుల్! మనం బీసీ రోజుల్లో లేం! మాట్లాడుకోవడానికి చేతిలో సెల్‌ఫోన్ ఉంది. ఇంటర్‌నెట్ ఉంది. ఒకరికొకరం ప్రతీక్షణం చూసుకోవచ్చు. అదీ పక్కపక్కనే ఉన్నట్టేగా! ఇంకేంటి తనకి ప్రాబ్లెం..? " అని గట్టిగా అన్నాడు నందూ.

వర్ణ కళ్ళు చిట్లించి సీరియస్‌గా నందూ వంక చూసింది.

'మమ్మీ డాడీల్ని పిలిచి, ఇంత మీటింగ్



పెడతావ్ కదా! ప్రాబ్లెం ఏంటో నీకు క్లారిటీగా చూపిస్తాలే..' అని మనసులో కక్షగా అనుకుందామె.

నందకిషోర్ వాదనతో ఏకీభవిస్తూ ప్రతాప్, సుమణిలు వర్ణని బుజ్జగించారు. ముగ్గురూ కలిసి ఎలాగోలాగ చివరికి వర్ణ చేత 'ఊఁ!' అనిపించారు. వెంటనే ఆమె చేతే వాళ్ళ ప్రాజెక్ట్‌హెడ్‌కి ఫోన్ చేయించి, ఆమె యూఎస్ వస్తున్నట్టుగా చెప్పించారు.

ఫోన్ మాట్లాడడం అయ్యాక తల్లిదండ్రుల వంక రోషంగా చూస్తూ "వచ్చిన పనయ్యిందిగా! ఇంక వెళ్ళండి!" అంది వర్ణ.

కూతురి మాటలకి ఒక్కసారిగా గట్టిగా నవ్వేస్తూ "వెళ్ళండి కాదు వెళదాం! ఇంకో టెన్‌డేస్‌లో అమెరికా వెళ్ళిపోతున్నావ్ నువ్వు. సో.. లెట్స్ సెలబ్రేట్ దిస్ వండ్రఫుల్ ఎచీవ్‌మెంట్. నీకేం కావాలో షాపింగ్ చేద్దాం. నీ జర్నీకి కావలసినవన్నీ తీసుకుందాం.." అని హుషారుగా అన్నారు ప్రతాప్‌గారు.

వర్ణ అలకని చూసి ముసిముసిగా నవ్వుతూ భుజంపై చిన్నగా చరిచింది సుమణి.

వర్ణ రానని గునుస్తున్నా వినకుండా ఆమెని తీసుకుని ప్రతాప్‌గారి కారులో వెళ్ళారు అందరూ. మొదట వాళ్ళని షాపింగ్‌కి తీసుకెళ్ళారు ప్రతాప్‌గారు.

వర్ణా, నందూలు బట్టల సెలెక్షన్‌లో ఉన్నప్పుడు వాళ్ళిద్దరినీ ముచ్చటగా చూస్తూ, "సుమణీ! మన వర్ణ చాలా అదృష్టవంతురాలు కదా! దాని కెరీర్ గురించి మనకంటే ఎక్కువగా ఆలోచించే నందూలాంటి వాణ్ని మనం ఛూజ్ చెయ్యలేకపో

యేవాళ్ళమేమో? అనిపిస్తోంది..” అని భార్యతో అన్నారు ప్రతాప్‌గారు.

“ఔను పెతాప్! భార్యకి పేరొస్తే, భార్య ఎత్తుకి ఎదుగుతుంటే చూస్తూ ఓర్చుకోలేని మొగుళ్ళే తొంభైతొమ్మిది శాతం ఉంటు న్నారు. పెళ్ళాల్ని వంటింటికే పరిమితం చేసి, వాళ్ళ భావాల్ని తొక్కేసి, వాళ్ళలోని టాలెంట్‌ని హంట్ చేయాలనుకునే మొగుడి ఇగో నందూలో అస్సలు లేదు కదా! మన బేబీ నందూని ఛూజ్ చేసుకో వడం వెరీ లక్కీ..!” అంటూ కూతురు వంక సంతృప్తిగా చూసింది సుమణి.

షాపింగ్ ముగించి, అటు నుంచీ సాయంత్రం డిన్నర్ చేసిన తరువాత వర్ణ, నందకిషోర్‌లని ఇంటి వద్ద దించి వెళ్ళిపో యారు ప్రతాప్, సుమణిలు. అప్పటికి రాత్రి తొమ్మిది గంటలు దాటింది.

ఇంటికి రాగానే మూతి ముడుచుకుని, గదుల్లో లైట్లు వేసి, తెచ్చిన లగేజ్‌ని బెడ్ మీద పడేసింది వర్ణ. ఆ లగేజ్ ప్యాకెట్లని సర్దుతూ తన పని తాను చేసుకోవడం మొదలుపెట్టిందామె.

వర్ణ అలకని గ్రహించి చిరునవ్వు నవ్వాడు నందూ. కొత్తబట్టల్ని వార్డ్‌రో బ్‌లో ఒక పక్కగా సర్దుతోంది వర్ణ.

ఒక్కసారిగా వచ్చి అమాంతం ఆమెని చుట్టేశాడు నందూ.

అతని చేతుల్ని బలంగా విడిపించు కుంటూ “మమ్మీ డాడీల ముందు ఒక్కదా నివీ ఉండలేవా? అని ఫోజు కొట్టావుగా! నేను యూఎస్ వెళ్ళేవరకూ నువ్వూ ఒక్క డివే ఉండు..!” రోషంగా అంది వర్ణ.

“చిన్నపిల్లలా అలకలేంటీ!” అని దీర్ఘం తీసి వర్ణ ముఖంలోకి చూశాడు నందూ.

“అబ్బో! నువ్వు చాలా పెద్దపిల్లోడివి!” ఆమెకూడా దీర్ఘంతీస్తూ ఉక్రోషంగా అంది.

“ఊం!.. సరే! అయితే యూఎస్ వెళ్ళే వరకూ ఇలానే అలిగి ఉండు. ఎంతసేపు ఉండగలవో నేనూ చూస్తాను..” అని ధీమాగా అంటూ వెళ్ళి బెడ్ మీద పడుకు న్నాడు నందూ.

అంతే! బెడ్ మీద ఉన్న ప్యాకెట్లన్నిటినీ కోపంతో ఒక్కసారిగా పక్కకు తోసేసి, పరుగున వచ్చి దబ్బున అతని మీద పడి, ఉన్నపాటున బిగ్గరగా ఏడ్చేసింది వర్ణ. ఆమె మనసులోని సంఘర్షణ స్పష్టంగా అర్థమవుతోంది అతనికి. కానీ, ‘ఓన్లీ టాలెంట్‌తో యూఎస్ వెళ్ళే ఛాన్స్ రావాలి, అదీ గ్రేట్ అంటే..!’ అని ఇంతకు ముందు వర్ణ అతనితో అన్న మాటలు నందూ మనసులో చాలా బలంగా నాటుకుపో యాయి. అందుకే.. ఇప్పుడు వర్ణ ‘యూ ఎస్ వెళ్ళను మొర్రో’ అంటున్నా అతను అంతగా పట్టుబట్టాడు.

వర్ణ యూఎస్ వెళుతుందంటే అతనికీ బాధగానే ఉంది. ఆమె ఒకనాటి కలని నిజం చెయ్యడంకోసం, ఆమె వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా మలచడంకోసం తన ఫీలింగ్‌ని తనలోనే అణుచుకున్నాడు నందకిషోర్.

ఇప్పుడు వర్ణ కరిగిన మేఘంలా కన్నీళ్ళు పెట్టుకుంటుంటే అతని మనసు కూడా ముసుగుని తీసేసుకుని కరగడానికి సిద్ధప డింది. అంతే! తనని పట్టుకుని వెక్కిళ్ళు పెడుతున్న వర్ణని సుడిగాలిలా చుట్టేశాడు నందూ. అతని కౌగిలిలో ఇమిడిపోతూ చిన్నపిల్లలా బిగ్గరగా ఏడ్చేసింది వర్ణ.

ఆమె ముఖమంతా ముద్దులు పెడుతూ, “ఏయ్ వర్ణా! నువ్వు ఏడిస్తే అస్సలు బాలేదు” అని మంద్రమైన గొంతుతో నిదా నంగా చెప్పాడతను.

కళ్ళ నుంచి ధార కడుతున్న నీళ్ళని చేత్తో తుడుచుకుంటూ, “బాగోనిది నేను ఏడవడం కాదు, నువ్వు ఏడిపించడం” అంటూ మళ్ళీ వెక్కిళ్ళు పెట్టిందామె.

వర్ణని చూసి నవ్వుతూ, “ఏ స్టేజ్‌లో ఉన్నా మనం మాటకి మాట మాత్రం అప్పజెప్పేస్తామే! ఎవరు నేర్పించారో ఇది? మీ డాడీనా..? ” అని ఆమెని ఉడి

కిస్తున్నట్టుగా అన్నాడు.

"మీరూ మీరూ అందరూ ఒకటే! నన్నే ఒక్కదాన్నీ చేసి ఇక్కడ నుంచీ పంపేస్తున్నారు" అంటూ ఇంకా బిగ్గరగా ఏడుస్తూ, నందూ మీద నుంచి లేచి ఇటువేపుకి తిరిగి ముడుచుకుని పడుకుంది వర్ణ.

పక్కనే ఉన్న లైట్ స్విచ్ ఆఫ్ చేసి, వర్ణ వైపుకు తిరిగి ఆమెని దగ్గరకు లాక్కున్నాడు నందూ. "ఒంటరితనం అనేది దూరంగా ఉంటేనే రాదు. దగ్గరగా, పక్కపక్కనే ఉన్నా మనసులు కలవకపోతే ఒంటరిగానే ఉంటారు.." అని అన్నాడతను.

సన్నగా ఏడుస్తూనే, ఇటు వైపుకు తిరిగి చేతిని నందూ నడుము చుట్టూ వేసి, అతని గుండెల్లో తల దూర్చి కళ్ళు మూసుకుంది వర్ణ.

"ప్రతి మనిషికీ రెండు మనసులు ఉంటాయి వర్ణా! ఒకటి అందరికీ కనిపిస్తుంది.. అందరితో కలుస్తుంది. అందరితో మాట్లాడుతుంది. రెండో మనసు ఎవరికీ కనిపించదు, ఎవరితో కలవదు, ఎవరితోనూ మాట్లాడదు. అది మనలోనే ఉంటుంది. మనతోనే మాట్లాడుతుంది.."

"ఇప్పుడిదంతా ఎందుకు..? నేనేం చిన్నపిల్లని కాదు! ఏదేదో చెప్పి నన్నేం డైవర్ట్ చెయ్యనవసరం లేదు.." అంటూ ముక్కు ఎగబీల్చింది వర్ణ.

చిన్నగా నవ్వి వర్ణ కళ్లమీద ముద్దు పెట్టుకున్నాడతను. "నిన్ను డైవర్ట్ చెయ్యడం కోసం కాదు. లోన్లీనెస్ అంటే ఏంటో చెబుతున్నా.." అన్నాడు.

చెప్పమన్నట్టు చిన్నగా "ఊఁ!"అందామె.

"నీలో రెండు మనసులూ, నాలో రెండు మనసులూ, అలా అందర్లోనూ ఉంటాయి. కానీ పెళ్లయిన తర్వాత నాకు ఏదైనా అనిపిస్తే దాన్ని నాలో అనుకోకుండా, చాలా మామూలుగా నీతో మాట్లాడేయాలి. అంటే నాలో ఎలా మాట్లాడుకుంటానో యాజిటీజ్‌గా దాన్ని నీతో మాట్లాడేయడం ఉంటుంది చూశావూ.. అది. అదే మనం ఒకరిగా అవడమంటే. అలా అవలేనప్పుడు వాళ్ళు ఎవరికి వాళ్ళు ఒక్కళ్ళే ఉంటున్నట్టు! ఔటర్ ఫీలింగ్స్ షేర్ చేసుకున్నట్టుగా మన ఇన్నర్ ఫీలింగ్స్‌నీ షేర్ చేసుకోగలిగితే, నువ్వు ఎక్కడో ఉన్నా, నేనెక్కడో ఉన్నా పక్కపక్కన ఉన్నట్టే..!" అని చెబుతూ చిన్నగా ఆమె చెంపలు నిమిరాడు నందూ.

వింటూ ఆలోచనలో పడింది వర్ణ. అతని చేయి అత్యంత సున్నితంగా ఆమె మెడ మీదుగా ఎదని చేరి, అక్కడ నుంచి కిందకి జారింది.




ఉదయం కాలేజీకి రాగానే తన కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్‌కి వచ్చాడు నందు.

జేబులోంచి సెల్‌ఫోన్ తీసి లాస్ట్ డయల్ నెంబర్‌కి ఫోన్ చేశాడు. అవతల 'హలో!' అనగానే "నేనురా నందూని. ఇంటికి వెళ్ళావా..? " ఆదుర్దాగా అడిగాడు.

సరిగ్గా అప్పుడే నందకిషోర్ కోసం కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్ లోపలకు వచ్చిన ఇంగ్లీష్ లెక్చరర్ నందిని అతను సెల్‌లో ఎవరితోనో మాట్లాడుతూండడం చూసి, పక్కగా వెయిట్ చేస్తూ నిలబడింది.

"ఏమైందిరా! నాన్న ఇంట్లోనే ఉన్నారా? ఏమన్నారు? " అంటూ అవతల భగవాన్ దాస్ ఏదో చెప్పబోయేలోపే ఆత్రుతగా అడిగాడు నందకిషోర్.

## కొత్తగాలి...

**తెల్లదొరలు మావాళ్లకు**
**కూడికలు నేర్పలేదు**
**విభజనలే నేర్పేరు!**
**దానిలోనూ తప్పులే!**

– ఇషాన్ దూసి,
బెంగళూరు

"పొద్దున్నే మీ ఇంటికి వెళ్ళాను, చివాట్లు తిని వచ్చాను కూడా బాబూ..!" అని ముఖం గంటు పెట్టుకున్నట్టుగా చెప్పాడు భగవాన్‌దాస్.

"... ...."

"నేను వెళ్ళేసరికి అంకుల్ ఇంట్లోనే ఉన్నారు. హాస్పిటల్‌కి వెళ్ళడం కోసమే రెడీ అవుతున్నారు. నన్ను చూసి ఒక్కసారే సీరియస్ అయిపోయారు. ఇన్నిరోజులు రానివాడివి ఇప్పుడు ఎందుకు వచ్చావ్? మీ ఫ్రెండ్ ఇక్కడ ఉండట్లేదని తెలిసి కూడా పనిగట్టుకుని వచ్చావా? లేకపోతే వాడు పంపాడా? అని కేకలేశార్రా బాబూ! టైంకి ఆంటీ తానే రమ్మన్నానని చెప్పి కవర్ చేశారు. బయటకు వెళుతున్నారా? అని ఏమీ తెలీనట్టే ఆంటీని అడిగాను. హాస్పిటల్‌కి అని చెప్పగానే తోడుగా వస్తా అన్నా.." అని చెప్పి సంశయంగా ఆపాడు భగవాన్‌దాస్.

"ఏమన్నారు? వద్దన్నారు కదా!" అని వెంటనే అన్నాడు నందకిషోర్.

"ఊఁ! ఎవరి పని వాళ్ళు చూసుకుంటే మంచిది. నువ్వు బయల్దేరితే మేం హాస్పిటల్‌కి వెళతాం! అన్నార్రా!" అని చెప్పాడు భగవాన్‌దాస్.

ఆ మాటలు వినగానే ఒక్కసారిగా దిగులు ఆవహించింది నందకిషోర్‌ని.

ఫ్రెండ్‌తో ఇంకేం మాట్లాడలేక, "సరే! ఉంటాన్రా! చెప్పగానే వెళ్ళినందుకు థ్యాంక్యూ సో మచ్‌రా..!" అని చెప్పి ఫోన్ కట్ చేసేశాడు.

కుడిచేతిలోని సెల్‌ఫోన్‌ని నుదురుకి ఆనించుకుని కళ్ళు మూసుకుని అలాగే కూర్చున్నాడు. 'ఈపాటికి అమ్మానాన్నా హాస్పిటల్‌కి వెళ్ళి ఉంటారేమో? రిపోర్ట్స్ చూసి డాక్టర్‌గారు ఏమన్నారో?' అనుకున్నాడు.

నందకిషోర్ ఫోన్‌లో మాట్లాడడం పూర్తవడం కోసమే చూస్తున్న నందిని అతనివైపు అడుగులు వేస్తూ "అయితే మీ ముద్దుపేరు కూడా నందూనేనా..!" అని చిరునవ్వుతో అంది.

ఆలోచనలో పడి చుట్టుపక్కల్ని గమనించని నందకిషోర్ ఒక్కసారిగా వినిపించిన మాటలకి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

ఎదురుగా వచ్చిన నందిని, "నన్ను కూడా నందూ అనే పిలుస్తారు! సేమ్ పించ్..!" అంటూ నవ్వింది.

ఆమె మాటల్ని పట్టించుకోనట్టుగా నిర్లిప్తంగా ఉండిపోయాడు నందకిషోర్.

"మీ డిపార్ట్‌మెంట్‌కి అతిథిగా వచ్చాను. కనీసం కూర్చోమని కూడా అనరేంటండి నందూగారూ! ఇంగ్లీష్ లెక్చరర్ మీ కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్‌కి ఎందుకు వచ్చిందో? తెలుసుకోవాలనీ లేదా?" అని ఆటపట్టిస్తున్నట్టుగా అని అంతలోనే, "సీనియర్ అనే ప్రెస్టేజా? లేకపోతే జూనియర్ల మీద చిన్నచూపా?" అంటూ మళ్ళీ నవ్విందామె.

"చెప్పండి! ఏంటిలా వచ్చారు?" సీరియస్‌గా అడిగాడు నందకిషోర్.

"మీకంటే చిన్నదాన్ని! అండీ ఎందుకు? నందూ అని పిలవండి. అందరూ మిమ్మల్ని పిలవడమేగానీ, మీరెప్పుడూ మీ పేరుని ముద్దుగా పిలుచుకుని ఉండరు కదా..!" అంది నందిని.

కనుబొమల్ని ముడేసి ఆమె వంక సీరియస్‌గా చూస్తూ, "నిక్ నేమ్స్‌తో పిలుచుకోవడానికి ఇది ఇల్లు కాదు. నా క్లోజ్

ఫ్రెండ్స్‌తో తప్ప ఎవరితోనూ ఎక్కువ మాట్లాడే అలవాటు లేదు. చెప్పండి మీరొచ్చిన పనేంటి..? " అన్నాడు నందకిషోర్.

అతని మాటలకి నందిని ముఖం పాలిపోయింది. "మా చెల్లాయి బియస్సీ చదువుతోంది. కెమిస్ట్రీలో ఏవో డౌట్స్ ఉన్నాయట. ఎగ్జామ్స్ వస్తున్నాయి కదా! తనకి ట్యూషన్ చెప్తారా? అని అడగటానికి వచ్చాను" తడబడుతూ అంది నందిని.

"నాకు ట్యూషన్స్ చెప్పే ఆలోచన లేదు. మీ సిస్టర్‌కి నాదొక సలహా! డౌట్స్ ఉంటే ఆమెకి కాలేజ్‌లో పాఠాలు చెప్పే లెక్చరర్ని అడగమని చెప్పండి" అని కచ్చితంగా చెప్పి, పక్కనున్న షెల్ఫ్‌లోంచి టెక్స్ట్‌బుక్‌ని తీసి ఓపెన్ చేశాడు నందకిషోర్.

దాని అర్థం ఇక వెళ్ళమన్నట్టుగా అనిపించి వెనుదిరిగింది నందిని.

సరిగ్గా అప్పుడే లోపలకు వస్తున్న హెడ్డాఫ్ ది డిపార్ట్‌మెంట్ జనార్దన్‌గారు ఎదురొస్తూ ఆయన పక్కనుంచీ బయటకు వెళుతున్న ఇంగ్లీష్ లెక్చరర్ నందినినీ, పుస్తకంలో ముఖం దూర్చి ఉన్న నందకిషోర్‌నీ వింతగా మార్చిమార్చి చూశారు.

★ ★ ★

తులసీరామ్‌గారు, శ్యామల హాస్పిటల్‌కి వచ్చి గంట దాటింది.

రాగానే రిపోర్టులు తీసుకుని, ఔట్ పేషెంట్ల కోసం హాలులో వేసిన కుర్చీలో కూర్చున్నారు ఇద్దరూ. అప్పటికే కుర్చీలన్నీ దాదాపుగా భర్తీ అయిపోయాయి.

ఉదయం నుంచీ వచ్చిన పేషెంట్లని వాళ్ళు వచ్చిన వరుస ప్రకారం ఒక్కొక్కరి పేర్లనీ గట్టిగా పిలుస్తున్నారు స్టాఫ్. పిలుపు వచ్చినవాళ్ళు 'హమ్మయ్య!' అనుకుంటూ గబగబా డాక్టర్‌గారి రూమ్‌లోకి వెళుతున్నారు.

ఖాళీ అవుతున్న కుర్చీలు ఇంకా వస్తూనే ఉన్న వేరొకళ్ళతో నిండుతున్నాయి. అప్పుడే పెద్దపెద్ద అంగల్తో లోపలకు వచ్చిన ప్రతాప్‌గారు రిసెప్షన్ కౌంటర్ వైపు వెళ్ళారు. అక్కడి నుంచీ వచ్చి ఖాళీగా ఉన్న తులసీరామ్‌గారి పక్క సీట్లో కూర్చున్నారు.

తులసీరామ్‌గారు వాచ్ వంక చూసుకుని, "ఈ రోజు ఆఫీస్‌కి మధ్యాహ్నం నుంచీ వస్తానని చెప్పాను. సెలవు పెట్టి ఉండాల్సిందేమో శ్యామలా!" అని భార్య వైపు చూస్తూ అన్నారు.

ఆయన మాటలకి తల తిప్పి వాళ్ళ వంక చూశారు ప్రతాప్‌గారు. తులసీరామ్‌గారి చేతిలోని రిపోర్టుల్ని క్యాజువల్‌గా అడిగి తీసుకుంటూ, "ఎంతసేపైందండీ మీరు వచ్చి..? " అని అడిగారు.

"గంటన్నర అవుతోందండీ. టెస్ట్‌లు నిన్ననే చేయించేశాం. రిపోర్ట్‌ల కోసం ఈరోజు రమ్మన్నారు. ఇవి చూపించి విషయం తెలుసుకోవడానికి వచ్చాం! మీరూ ఇక్కడ చూపించుకోవడానికే వచ్చారా? " అని తన రిపోర్టుల్ని పరిశీలనగా చూస్తున్న ఆ అపరిచిత వ్యక్తిని చూస్తూ అడిగారు తులసీరామ్‌గారు.

అవునన్నట్టుగా తల ఊపారు ప్రతాప్.

"మీరు ఒక్కరే వచ్చారా..!" అని ఆయన వంక ఆశ్చర్యంగా చూస్తూ అడిగారు తులసీరామ్‌గారు.

ఆయన ఆశ్చర్యాన్ని చూసి "ఎప్పటికైనా ఒక్కరమే కదండీ" అన్నారు ప్రతాప్.

ఆ మాటలకి చిన్నగా నిట్టూర్చి, "మీరు చెప్పిందీ నిజమే! కానీ, పాతికేళ్ళపాటూ కంటిరెప్పలా పెంచుతాం. అలా చూసిన పిల్లలే మనల్ని వదిలిపోతుంటే.. ఇక శాశ్వతమైనవి ఏముంటాయి..? " అని నిర్లిప్తంగా అన్నారు తులసీరామ్‌గారు.

ఆ మాటలకి విస్తుపోయి చూశారు ప్రతాప్. రిపోర్టుల్ని తిరిగి ఇచ్చేసి కుర్చీలో వెనక్కు వాలి "మీ పిల్లలు మీకు దూరంగా ఉన్నారా..? " అనడిగారు.

శ్యామల భర్త వంక ఓసారి చూసి "పిల్లలు కాదన్నయ్యగారూ ఒక్కడే బాబు.

ప్రేమించి పెళ్ళి చేసుకుని మాకు దూరంగా ఉంటున్నాడు" నిదానంగా చెప్పింది.

కొడుకుని గుర్తు చేసుకుని బాధతో తల వంచుకున్నారు తులసీరామ్‌గారు.

శ్యామల మాటలకి గట్టిగా నవ్వారు ప్రతాప్. పక్కనవాళ్ళు వింతగా చూస్తుండ డంతో నవ్వాపి "వెళ్ళిపోయిన వాడి కోసం మీరు దిగులు పెట్టుకుని గుండె నొప్పి తెచ్చుకుంటున్నారా...! ఎందుకండీ అనవ సర ఆలోచనలు? పిల్లలు వెళ్ళం అన్నా, ఈ రోజుల్లో మనమే వాళ్ళని ఇంట్లోంచి తరిమెయ్యాలి. ఇంట్లోనే ఉంటే వాళ్ళకి ప్రపంచం ఏం తెలుస్తుంది చెప్పండి!" అన్నారు ప్రతాప్.

ఆయన వంక విస్తుపోయి చూస్తూ 'ఈయనకింత ధీమాని ఇచ్చింది డబ్బేమో?' అని మనసులో అనుకున్నారు తులసీరామ్‌గారు.

"నాకు పాతికేళ్ళప్పుడు ప్రేమించి, ఇంట ర్‌క్యాస్ట్ మ్యారేజ్ చేసుకున్నా. మా నాన్న గారు చిల్లిగవ్వ ఇవ్వను పొమ్మన్నారు. నేనేమో ఇంకా ఇంజినీరింగ్ పూర్తిచెయ్య లేదు. పార్ట్‌టైం జాబ్‌లు చేసీ, కష్టపడి చదువు పూర్తిచేశాను. నా భార్య కూడా చదువుకుంటానంది. బ్యాంక్ పరీక్షలు పాసై ఉద్యోగం తెచ్చుకుంది. ఈ రోజు స్టేట్ బ్యాంక్‌లో రీజనల్ మేనేజర్ తను" అని చెప్పారు ప్రతాప్‌గారు.

ఆయన వంక మరింత విస్తుపోయి చూస్తుండిపోయారు తులసీరామ్‌గారు. తాను అనుకున్నట్టు ఆయనలోని ధీమా డబ్బు ఉండడం వల్ల వచ్చింది కాదనీ, డబ్బు సంపాదించే క్రమంలో కలిగిన ఆత్మ విశ్వాసం వల్ల వచ్చుండవచ్చని అర్థమైంది తులసీరామ్‌గారికి.

"మాకు పాప పుట్టిన తరువాత పాపని తీసుకుని మా నాన్నగారి దగ్గరకి వెళ్ళా. ఇంట్లో ఒక్కణ్ణే కొడుకునీ, అందులోనూ తండ్రిని అవ్వడంతో.. ఇప్పుడు తెలుస్తుం దిలే నీకు మా బాధ అంటూ ఆయన మాతో కలిసిపోయారు. మా నాన్నగారి ఆస్తిలో చిల్లిగవ్వ కూడా తీసుకోకుండా అంతా మా అక్కయ్యలకి ఇచ్చేశాను. కానీ మా నాన్నగారి బాధ నాకూ ఈ మధ్యనే తెలిసొచ్చింది" అని చిరునవ్వుతో చెబు తూ, వాళ్ళ వంక చూశారు ప్రతాప్‌గారు.

ఏమైందన్నట్టు కుతూహలంగా చూశారు తులసీరామ్‌గారూ, శ్యామల.

"మా పాప ప్రేమించి పెళ్ళి చేసుకుం ది" అంటూ అలవాటుగా గట్టిగా నవ్వ బోయి ఇది హాస్పిటల్ అని గుర్తొచ్చి మె ల్లగా నవ్వారు ప్రతాప్‌గారు.

తులసీరామ్‌గారి పెదవులు కూడా సన్నగా విచ్చుకున్నాయి.

శ్యామల మాత్రం ఎందుకో అనుమా నంగా ప్రతాప్‌గారి వంక చూసింది. ఆయ నలో ఏ మూలనో తమ కోడలు వర్ణ పోలి కలు కలిపిస్తున్నట్టుగా తోచింది ఆవిడకి. ఆయన చెబుతున్నది కూడా సరిగ్గా నందూ చెప్పిన వివరాలతో సరిపోతోంది. అందుకే అయోమయంగా ఆయన వంకా, భర్త వంకా చూడసాగింది శ్యామల.

"రెక్కలున్నప్పుడే పిల్లల్ని ఎగరనివ్వా లండీ. కాళ్ళు చేతుల్లో సత్తువ కొరవై మనలా ఇలా హాస్పిటల్స్‌కి తిరిగే వయ సులో ఎగరాలని ఉన్నా ఎగరలేరు. మేంగా చూసి సెలెక్ట్ చెయ్యకుండా, ఎవర్నో అల్లుడిగా తెచ్చింది అని బాధ ఉండేది మాకు. అది కూడా మా పాప భవిష్యత్తు గురించే. కానీ మా అల్లుడు బంగారం కంటే మేలిమివాడు. పాపకి అమెరికా వెళ్ళే అవకాశం వస్తే, 'ఆడదా నివీ.. ఒక్కదానివీ.. అంతదూరం ఎందుకు? ఇంట్లో కూర్చో' అనలేదు. ఇంకా మా అమ్మాయే వెళ్ళను డాడీ అంటున్నా వినకుండా దాన్ని యూఎస్ వెళ్లడానికి ఒప్పించాడు" అని గర్వంగా ఫీలవుతూ చెప్పారు ప్రతాప్‌గారు.

అ
క్ష
రం

ఎదుటివారిలోని
చెడు లక్షణాలు వదిలిపెట్టి
మంచి గుణాలను గ్రహించగలిగినవాడు
నిజమైన జ్ఞాని

– గౌతమ బుద్ధుడు



ఎదుటివాళ్ళ సంతోషాన్ని పంచుకుంటు న్నప్పుడు, సొంత బాధలు గుర్తుకు రావడం సహజం. తులసీరామ్‌గారి పరిస్థితీ అందుకు భిన్నంగా ఏం లేదు. అయినాసరే తోటి వ్యక్తి సంతోషానికి హర్షిస్తూ, "మీరు అదృష్టవంతులు.." అని గంభీరంగా అన్నారు.

"అదృష్టం, దురదృష్టం అనేది మనం అనుకున్నేదాన్ని బట్టి ఉంటుందండీ! నన్ను అదృష్టవంతుడని మీరు అంటున్నారు. కానీ, నేను చాలా దురదృష్టవంతుడ్ని. మామూలుగానే బంగారుతల్లి. పెళ్ళి కూతురుగా దాన్ని ఈ రెండుకళ్ళతో నిండుగా చూసుకోవాలి.. అది చెయ్యాలి, ఇది చెయ్యాలి అని ఎన్ని అనుకున్నానో! కానీ.. ప్చ్..! కన్నకూతురి పెళ్ళి కూడా చూసుకోలేకపోయాను.." అని నిట్టూర్చి, రుద్ధమవుతున్న గొంతుతో దిగులుపడుతున్నట్టుగా చెప్పారు ప్రతాప్.

తులసీరామ్‌గారు ఆశ్చర్యపోతూ, "ఎందుకని? " అని వెంటనే అడిగి, అంతలోనే విచక్షణ మేల్కొనడంతో, "సారీ! మీ వ్యక్తిగత విషయాల గురించి అడిగినందుకు ఏమనుకోకండి!" అని క్షమాపణ చెప్పారు.

"అయ్యో! పెద్దవారు. దీనికి సారీ ఎందుకు? మా వియ్యంకులవాళ్ళు లేకుండా చేసుకుంటున్న ఆ పెళ్ళిలో మేం ఉంటే, రేపు వాళ్ళు మేమే కావాలని అంతా చేశామని అపార్థం చేసుకుని వేరే రకంగా ఏమైనా అనుకుంటారేమోనని మేమూ పెళ్ళికి వెళ్ళలేదు. పాపం! మా అమ్మాయి ఎంత బాధపడిందో! మనం పెద్దవాళ్ళం అనుకుంటాంగానీండీ, ఒకోసారి పిల్లల్లో ఉండేంత మెచ్యూరిటీ మన పెద్దోళ్ళలో ఉండదు. మీరు నమ్ముతారో? నమ్మరోగానీ పెళ్ళి గిఫ్ట్‌గా మేం టూ బెడ్రూం అపార్ట్‌మెంట్ ఫ్లాటూ, హోండా సిటీ కారూ ఇచ్చినా తీసుకోలేదు మా అమ్మాయి. వాటి కంటే మీరు పెళ్ళికి వచ్చుంటేనే ఎక్కువ సంతోషించేదాన్ని డాడీ! అంది ఆ రోజు" అని చెప్తుంటే అప్రయత్నంగా ప్రతాప్‌గారి కళ్ళు చెమర్చాయి.

ఆ విషయాలన్నీ విన్న తర్వాత ఆయన తమ కోడలు వర్ణకి కన్నతండ్రే అని ఎంతో స్పష్టంగా అర్థమైంది శ్యామలకి.

తులసీరామ్ ఆయన్నేదో అడగబోయారు.

సరిగ్గా అప్పుడే "జె. ప్రతాప్‌రెడ్డిగారూ!" అంటూ ఔట్‌పేషంట్ల వంక చూస్తూ, గట్టిగా పిలవసాగింది నర్స్.

కుర్చీలోంచి లేస్తూ, "మా ఫ్యామిలీ విషయాలన్నీ చెప్పి మీకు బోర్ కొట్టించేసినట్టున్నాను" అంటూ టైం చూశారు ప్రతాప్‌గారు. 'తాను వచ్చి అప్పుడే అర్ధగంట అవుతోందా? ' అనుకుంటూ ఆశ్చర్యపోయారు.

వాళ్ళిద్దరి వంకా చూస్తూ "మీరు కూడా రండి. ఫర్లేదు! ఈ డాక్టర్ నా క్లాస్‌మేట్‌కి బ్రదరే" అన్నారు ప్రతాప్‌గారు.

"పర్లేదండి! మీరు వెళ్ళిరండి" మొహమాటంగా చెప్పారు తులసీరామ్.

"నేను చెబుతున్నాగా రండి..!" అంటూ ఆయన చేతిలోని రిపోర్టుల్ని తీసుకుని ముందుకు నడిచారు ప్రతాప్.

శ్యామల, తులసీరామ్‌లు ముఖముఖాలు చూసుకుని వెంట కదిలారు.

లోపల కార్డియాలజిస్ట్ డాక్టర్‌తో నవ్వుతూ పలకరించి, షేక్‌హ్యాండ్ ఇచ్చి, తులసీరామ్‌గారి రిపోర్టులని ఆయనకి అందించారు ప్రతాప్ "నా ఫ్రెండే! ఏంటి ప్రాబ్లెం? " అంటూ.

చిరునవ్వుతో ప్రతాప్ కళ్ళల్లోకి చూసి, తన టేబుల్ మీదున్న మోనిటర్‌లో కనిపి స్తున్న హాల్లోని సీసీ కెమెరాల వ్యూ వంక కనుసైగతో చూపించి, "అంతా చూస్తూనే ఉన్నాన్లేరా!" అన్నారు డాక్టర్.

తాను హాస్పిటల్లోకి రావడం నుంచీ వీళ్ల పక్కన కూర్చుని మాటలు కలపడం, వీళ్ళని తనతో లోపలకు రమ్మని అడగడం వాటన్నిటినీ అక్కడున్న సీసీ కెమెరాల ద్వారా చూస్తున్నాడని అర్థంకాగానే ఒక మొహమాటపు నవ్వు నవ్వారు ప్రతాప్ గారు. ఓసారి బుర్ర గోక్కుని, "కావలసిన వాళ్ళు.." చిన్నగా అన్నారు.

తులసీరామ్‌గారి రిపోర్టుల్ని చూసి, ప్రతాప్‌గారిని టెస్ట్ చేసి, ఇద్దరికీ కొన్ని మందులు రాసి జాగ్రత్తలు చెప్పారు డాక్టర్. చెకప్ అంతా అయ్యాక ముగ్గురూ బయటకు వచ్చారు.

హాస్పిటల్‌లో నుంచి బయటకు నడుస్తూ, "ఎక్కడ మీ హౌస్? " అని అడి గారు ప్రతాప్.

"దగ్గరే.." అంటూ ఏరియా పేరు చెప్పారు తులసీరామ్‌గారు.

"మీ ఇంటిదగ్గర దించుతా!" రమ్మంటూ మొహమాట పెట్టి వాళ్లని తన కారులో ఎక్కించుకున్నారు ప్రతాప్.

తులసీరామ్‌గారు అడ్రస్ చెప్తుంటే దాని ప్రకారం వాళ్ళ ఇంటివద్ద కారాపారు.

కారులోంచి దిగగానే ప్రతాప్‌గారి చేయి పట్టుకుని "ఈ రోజుల్లో మీలాంటి వారు చాలా అరుదు! థ్యాంక్సండీ!" అన్నారు తులసీరామ్ గారు.

ఆయన ఇంట్లోకి వెళుతుంటే, శ్యామల ఆగి వెనక్కి తిరిగింది.

తులసీరామ్‌గారు తాళం తీసి ఇంట్లోకి వెళ్ళారని గమనించాక, ప్రతాప్‌గారి వైపు తిరిగి రెండు చేతులూ ఎత్తి నమస్కరించి "మీ బంగారుతల్లి పేరు వర్ణేనా అన్నయ్య గారు.." నిదానంగా అడిగింది శ్యామల.

కూతురి పేరు ఆవిడ నోటి వెంట విన గానే నివ్వెరపోయి చూశారు ప్రతాప్‌గారు.

"నేను నందూ వాళ్ల అమ్మని.. ఈయన నందూ నాన్నగారు. అల్లుడ్ని కూడా మీ అమ్మాయిలా ప్రేమగా చూసుకుంటున్నం దుకు మీకు చాలా కృతజ్ఞతలు!" తడిక ళ్ళతో అని, గబగబా లోపలకు వెళ్ళిపో యింది శ్యామల.

అంతే..! ఇంటికి వచ్చేవరకూ ప్రతాప్ గారి మతి మతిలో లేదు.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలప్పుడు.. వర్ణ సెల్ నుంచి కాల్ వస్తున్న సూచనగా ప్రత్యేకమైన రింగ్‌టోన్ వినబడగానే, ఉలి క్కిపడ్డారు ప్రతాప్‌గారు.

'మీ బంగారుతల్లి పేరు వర్ణేనా అన్న య్యగారూ!' అని నందూ వాళ్ళ మదర్ మధ్యాహ్నం అడిగినప్పుడే కూతురు నుంచి ఫోన్ వస్తుందని ఆయన ముందుగానే ఊహించారు. అయినా కూడా కాల్ ఓకే చేయడానికి కొన్ని క్షణాలు ఆలోచించారు.

చివరికి దీర్ఘంగా ఊపిరి పీల్చి వదిలి కాల్ ఓకే చేశారు. "హలో డాడీ!" అంటూ దూకుడుగా వినిపించింది వర్ణ గొంతు.

"ఏరా తల్లీ బావున్నావా..? " అని చాలా క్యాజువల్‌గా అడిగారు ప్రతాప్‌గారు.

"ఎక్కడున్నారు మీరు? " అని సీరి యస్‌గా అడిగిందామె.

"ఊc! ఎక్కడుంటాను.. ఆఫీస్‌లోనే!" అని తేలిగ్గా చెప్పారాయన.

"అహాc! మరి మధ్యాహ్నం ఎక్కడున్నా రు? " అని గంభీరంగా అడిగింది వర్ణ.

"ఆఫీస్‌లోనే ఉండుంటాను! ఏం? " అని తడబాటుగా అన్నారాయన.

"అవునా! చెవిలో పువ్వులు కాదు, క్యాలిఫ్లవర్లు పెడితే ఎలా నమ్ముతాను. నాకేం తెలీదు అనుకోకండి! అత్తయ్య అంతా చెప్పేశారు. మధ్యాహ్నం మీరు కార్డియాలజిస్ట్ దగ్గరకు వెళ్ళారంటే ఏంటి అర్థం? మమ్మీకి కూడా చెప్పకుండా ఒక్కరే వెళ్ళారట! ఏమైంది? ఎట్‌లీస్ట్ నాకైనా చెప్పకుండా ఏంటిది డాడీ! మీకు ఏమైందోనని ఎంత కంగారనిపించిందో" అంటూ మాట్లాడుతూనే కళ్ళనీళ్ళు పెట్టుకుంది వర్ణ.

"అరే తల్లీ! ఏడుస్తున్నావా? ఊరుకో! నాకేం అవలేదురా! ఈ మధ్య గుండెల్లో కొంచెం బరువుగా ఉందనిపించి చూపించుకుందామని వెళ్ళాను. జస్ట్ అంతే!" అని కూతురికి సర్దిచెబుతూ అన్నారాయన.

"ఏంకాదు. నిన్న మార్నింగ్ బ్రీతింగ్ టైట్గా బాగా చెమట్లు పట్టి, గుండెల్లో నొప్పిగా ఉందని డాక్టర్‌తో చెప్పారటగా!" అని నిలదీస్తున్నట్టుగా అడిగింది వర్ణ.

"అబ్బా! అదేం లేదురా! డాక్టర్‌గారి దగ్గరకి వెళ్ళినప్పుడు చిన్న సిమ్టమ్స్‌ని కూడా భయంతో ఎక్కువ చేసి చెప్పేస్తాం కదా! అలా అనుంటానులే! అవేం పట్టించుకోకు. ఇప్పుడు నేను నార్మల్‌గానే ఉన్నానుగా. లీవిట్ రా తల్లీ!" అని మభ్యపెడుతున్నట్టుగా చెప్పారాయన.

"ఏదేదో కహానీ చెప్పకండి! నేనేం చిన్నపిల్లని కాదు. అత్తయ్య చెప్పినదాన్నంతా మమ్మీకి చెప్పేశాను. మీకు అదే పనిష్మెంట్.."అని సీరియస్‌గా అంది వర్ణ.

"హబ్బా! సుమణికి చెప్పొద్దు అనబోతున్నానురా తల్లీ! మమ్మీకి ఎందుకు చెప్పావు? " అని తల పట్టుకుంటూ అన్నారు.

ఒకక్షణం ఏం మాట్లాడలేదు వర్ణ. తర్వాత, "మమ్మీ కూడా మీలానే చేస్తే? తనకి ఏమైనా కంప్లయింట్ ఉన్నా మీతో చెప్పకుండా ఉంటే..? " అంది.

ఆ బాధ అర్థమవుతున్నట్టుగా మౌనం

# చతుర ప్రవేశిక

## జులై చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. వర్ణ భర్త?
జ.
2. నందకిషోర్ తండ్రి?
 జ.
3. తులసీరామ్ అక్క కూతురు?
 జ.
4. వర్ణ తల్లిదండ్రులు?
జ.
5. 'ది బ్లూయెస్ట్ ఐ' రచయిత్రి?
 జ.
6. యు.ఎస్.లో వర్ణను భయపెట్టిన పండుగ?
జ.
7. వర్ణను వీడియో తీసింది?
 జ.
8. నందకిషోర్ వర్ణకు పంపిన పెళ్లిరోజు కానుక?
 జ.
9. 'ఖాకీవనం' రచయిత?
జ.
10. నిరశన చేయనన్న దేశభక్తుడు?
జ.

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (   )

చిరునామా: ----------------------------------------------------

------------------------- పిన్‌కోడ్ :            ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

వహించారాయన.

"సారీ డాడీ! మమ్మీకి నేనేం చెప్పలేదు. జస్ట్ మీరూ, అత్తయ్యా వాళ్ళు హాస్పిటల్లో కలిశారని చెప్పానంతే! ఉంటా.. బై.." అని టప్పున ఫోన్ కాల్ కట్ చేసేసిందామె.

కూతురు కోపంగా ఉందని అర్థమైంది ప్రతాప్‌గారికి. ఆలోచిస్తూ అలానే కూర్చున్నారు. ఆయన ఆలోచనలు తన ఆరోగ్యం చుట్టూతా కాకుండా, ఇంకా నందూ వాళ్ళ పేరెంట్స్ చుట్టూనే తిరుగుతున్నాయి.

ఆవిడ నోట్లోంచి వర్ణ పేరు వచ్చేవరకూ అసలు వాళ్లే నందూ వాళ్ళ అమ్మానాన్నలు అని గెస్ చేయలేకపోయినందుకూ, ఆ రిపోర్టులు చూసినప్పుడు కనీసం వాటి మీదున్న పేరుని కూడా చూడకుండా తన ధోరణిలో తాను మాట్లాడుతూ ఉన్నందుకూ, ఆ మాటలు కూడా వాళ్ళ గురించే అయినందుకూ, తన తొందరపాటుకూ తనని తానే తిట్టుకుంటున్నారు ఆయన.

★ ★ ★

రాత్రి తొమ్మిది గంటల సమయం.

లైట్ స్విచ్ తీసి వచ్చి దిగాలుగా మంచం మీద వాలింది వర్ణ.

సాయంత్రం తను ఇంటికి వచ్చిన తరువాత, తల్లి ఫోన్ చేసినప్పటి నుంచీ వర్ణని గమనిస్తూనే ఉన్నాడు నందకిషోర్. ఆమె ముఖంలో నవ్వన్నదే లేదు. ఆమెని నవ్వించాలని అతనెంతగా ప్రయత్నించినా ఆమె ఆలోచనలూ, బాధా చెదరలేదు.

లైటు తీసేసి మౌనంగా పడుకున్న వర్ణ వైపు తిరుగుతూ "మీ ఇంటికెళదామా?" చివరి అస్త్రంగా అడిగాడు నందూ.

వెంటనే ఇటు తిరిగి "మా ఇంటికా! ఎందుకూ? "అందామె.

"నువ్వు మీ డాడీని ఎడాపెడా ఇంకో నాలుగు దులిపితేగానీ నీకు తృప్తి లేనట్టుంది" అన్నాడు.

"అదేం లేదు నందూ! మనం ఇద్దరిళ్ళలో ఒక్కొక్కళ్ళమే. మీ డాడీకి హెల్త్

బాగోలేదు. మా డాడీకీ బాగోపోయినా దాన్ని ఎవరికీ చెప్పలేదు.. ఏంటి ఇదంతా!" అని ఇంకా దిగాలు పడుతూనే నందూ మీద చెయ్యి వేసి అతనికి దగ్గరగా జరిగింది వర్ణ. అతని చేతి వంపులో తలని దూర్చి "మనం దగ్గర లేం! మనవా ళ్ళకి ఏం అవుతుందోనని భయంగా ఉంది నందూ!" బాధపడుతూనే అంది వర్ణ.

"భయమెందుకు? ఏది జరిగినా ధై ర్యంగా ఎదుర్కోవాలి వర్ణా! జరిగే వాటిని పాజిటివ్‌గా తీసుకోవాలి. నెగెటివ్‌గా తీసు కుంటే మనం ఏమీ చెయ్యలేం!" అంటూ ఆమెకి ధైర్యం చెప్పాడు నందకిషోర్.

"మీ డాడీకి, మా డాడీకి హెల్త్ బాగోక పోతే దాన్నీ పాజిటివ్‌గా ఎలా తీసు కుంటాం నందూ? " అని అయోమయప డుతూ అడిగింది వర్ణ.

"మార్నింగ్ నేను భగవాన్‌దాస్‌కి ఫోన్ చేశాను. వాడికి చిన్నప్పటి నుంచీ మా ఇంట్లో చనువెక్కువ. అందుకే వాడితో నాన్న హాస్పిటల్‌కి వెళుతున్నారు, ఏదో ఒకటి చెప్పి నువ్వూ వాళ్ళతో వెళ్ళి జాగ్ర త్తగా చూసుకో అని చెప్పాను. కానీ నాన్న 'నిన్ను వాడే పంపించాడా? 'అంటూ భగ వాన్‌దాస్‌ని తిట్టి వెళ్ళిపోమన్నారు"

"అయ్యో!"

"ఊc! క్లాసులో ఉన్నా నాన్న గురించే చాలా టెన్షన్‌గా అనిపించింది నాకు. ఈ రోజు మధ్యాహ్నం అమ్మే ఫోన్ చేసి అంకుల్ దగ్గరుండి చూసుకున్నారు, డాక్ట ర్‌గారితో వివరంగా మాట్లాడారు, అని చెప్పిన తరువాత ఎంత హ్యాపీగా అనిపిం చిందో తెలుసా? ఎట్ ది సేం టైం.. అంకుల్‌కీ హెల్త్ తేడాగా ఉందన్న విషయం కూడా అప్పుడేగా మనకి తెలి సింది. అంటే ఇక్కడ మా నాన్నావాళ్ళు హాస్పిటల్‌కి వెళ్ళడం వల్లే కదా మీ డాడీ విషయం బయటపడింది. బి పాజిటివ్ వర్ణా!" అన్నాడు నందకిషోర్.

"ఊc! అదీ కరెక్టేలే!" అంది వర్ణ.

"మీ డాడీ హెల్త్ విషయం గురించి నీకు ముందే తెలిసిందని హ్యాపీగా ఫీల్ అవ్వు. ఇక నుంచీ నువ్వూ ఆంటీ కలిసి అంకుల్‌ని కేర్‌ఫుల్‌గా చూసుకుంటూ అప్పుడప్పుడు జనరల్ చెకప్‌కి తీసుకె ళ్ళండి" అన్నాడతను.

వర్ణ ముఖంలో రిలీఫ్ కనిపించింది.

"నిన్న మీ డాడీ హాస్పిటల్‌కు వెళ్ళడం వల్ల.. మా నాన్నావాళ్ళకి ఎలా ఉందో? ఆయన కండిషన్ ఏంటో? అన్నది అంకుల్ ద్వారా డిటెయిల్డ్‌గా తెలిసింది. నిన్నటి నుంచీ నేను పడ్డ టెన్షనంతా తగ్గింది. ఇలా జరిగినందుకు మనిద్దరం రిలాక్సవ్వాలిగానీ, టెన్షన్ ఎందుకు చెప్పు!" ఆమె చెంపని తట్టాడు.

"థాంక్యూ నందూ! ఐలవ్‌యూ సో మచ్!" అంటూ అతని చెంప మీద ఓ గాఢమైన ముద్దుపెట్టి, చటుక్కున లేచి కూర్చుంది వర్ణ.

చెంపని తడుముకుంటూ నందూ కూడా లేచి "ఏంటి? " అంటూ స్విచ్ వేశాడు.

పక్కనే ఉన్న తన సెల్‌ఫోన్ అందు కుని అప్పటికే తండ్రికి ఫోన్ చేసేసింది వర్ణ. ఆయన 'హలో!' అనగానే, "సారీ డాడీ!" అని వెంటనే చెప్పిందామె.

"ఎందుకురా తల్లీ!" అన్నారాయన.

ఆయన గొంతులోని ప్రేమ ఫోన్‌లో కూడా స్పష్టంగా తెలిసి "మీకు హెల్త్ బాగోకపోతే మాకు బాగోదు. అలాగని సీరియస్ విషయాలు కూడా మాతో చెప్ప కపోతే ఎలా? మీ బాధని మమ్మీతో, నాతో షేర్ చేసుకోలేకపోతే, మేం మీకు డియరెస్ట్ ఎలా అవుతాం డాడీ!" అని సూటిగా ప్రశ్నిస్తున్నట్టు అడిగింది వర్ణ.

"సారీ చెప్పాల్సింది నువ్వు కాదురా తల్లీ! నేనే! ఇదుగో జస్ట్ ఇప్పుడే మీ మమ్మీతో జరిగిందంతా చెప్పాను. నా లైఫంటే మీ ఇద్దరేరా! ఇదుగో మమ్మీతో మాట్లాడు.."

అంటూ ఫోన్‌ని సుమణికిచ్చారు ఆయన.

"మమ్మీ!" అంది వర్ణ.

ఆవిడ ఫోన్‌లో మాట్లాడుతుంటే, తల్లి గొంతులో ఇంకా ఆరని దు:ఖం స్పష్టంగా తెలిసింది వర్ణకి. మరో రెండు నిముషాలు తల్లిదండ్రులతో మాట్లాడి, వాళ్ళకి గుడ్ నైట్ చెప్పి కాల్ కట్ చేసింది వర్ణ.

ఆమె మనసుకి హాయిగా అనిపించింది. వెంటనే సంతోషంగా నందూవైపు తిరిగి, "థ్యాంక్స్ రా నందూ!" అంటూ ఒక్కసారిగా అతని మీద పడింది.

ఆ ఊపుకి కూర్చుని ఉన్న అతను ఉన్న పాటుగా మంచం మీద వెల్లకిలా పడ్డాడు.

"థ్యాంక్స్ సో మచ్! అన్నీ బానే ఉన్నాయి. మరి.. నేను యూఎస్ వెళ్ళడంలో పాజిటివ్ యాంగిల్ ఏంటో కూడా చెప్పు!" అని సంతోషపడుతూ, అంతలోనే అలకగా అడిగిందామె.

"అందులో పాజిటివ్ యాంగిలా.!! క్వశ్చన్ బ్యాంక్‌లూ, ప్రిపరేషన్‌లూ లేకుండా ఇలా క్వశ్చన్స్ వేసేస్తే ఎలా జవాబులు చెప్పాలి? " అని తడబడుతూ అన్నాడు నందూ.

"ఇప్పటివరకూ ఏదో లెక్చర్ ఇచ్చావుగా! ఇప్పుడు చెప్పు! యూఎస్ వెళ్ళడంలోని పాజిటివ్ థింగ్ ఏంటి? " అని అతన్ని రెట్టిస్తూ అడిగింది వర్ణ.

ఒక్కసారిగా ఆమెని కిందకు తోసి, లైట్ తీసేశాడు నందూ. ఆ మరుక్షణమే వర్ణని బలంగా చుట్టేస్తూ "పాజిటివ్ థింగా! నువ్వు యూఎస్ వెళ్ళిపోతావని ఈ ఎనిమిది రాత్రుళ్ళూ నిన్ను నిద్రపోనివ్వను కదా! నీకు, నాకూ చాలా శాటిస్‌ఫాక్షనూ, ఎనర్జీ.." అని మత్తుగా చెప్పాడతను.

చెవికి దగ్గరగా వినిపిస్తున్న అతని గొంతులోని మోహానికి వర్ణ ఒళ్ళంతా ఝల్లుమంది.

"శాటిస్‌ఫాక్షన్ ఓకే! ఎనర్జీ ఎలా వస్తుంది? " అని గట్టిగా అడుగుదామనకున్నదల్లా, తమకం కమ్ముకుంటుంటే లోగొంతుకతో అడిగింది.

"ఇద్దరం వెయిట్ గెయిన్ అయ్యాం అంటున్నావుగా! ఇప్పుడు క్యాలరీస్ కరుగుతాయి.. శాటిస్‌ఫాక్షన్‌తోనూ వెయిట్‌లాస్ అవడం మనకి ఎనర్జీయేగా!" అని కొంటెగా ఆమె చెవిలో చెప్పాడు నందూ.

ఆ మాటలకి నవ్వుకుంటూ "మా టల్లో నిన్ను గెలవలేం!" అని ఓడిపోవడాన్ని ఒకింత గర్వపడుతూనే ఒప్పుకుందామె.

"పోనీ చేతల్లో గెలుస్తావా? " మరింత కొంటెగా అన్నాడతను.

★ ★ ★

తులసీరామ్, శ్యామల హాస్పిటల్‌కి వెళ్ళొచ్చి వారం రోజులైంది.

ఈ వారం రోజుల నుంచీ శ్యామల గజిబిజి పడుతూనే ఉంది. ఆ రోజు హాస్పిటల్‌లో తమ పక్కన కూర్చుని మాట్లాడింది వియ్యంకుడేననీ, అతని కూతురే తమ కోడలనీ, ఆ అమ్మాయి తొందరలోనే అమెరికా వెళుతోందనీ.. భర్తకి చెప్పాలని చాలాసార్లు ప్రయత్నించిందామె.

కానీ ఆ మాటలు పెదవుల చివరివరకూ వచ్చినా, భర్తకు చెప్పాలా? వద్దా? అని ఇంకా సంశయిస్తూనే బలవంతాన చెప్పకుండా ఆపుకుంది శ్యామల.

కోడలు మరో ఆరు నెలల వరకూ ఇక్కడకు రాదు, ఈలోపు నందూ ఒక్కడే వండుకుంటూ, ఆ ఇంట్లో ఒంటరిగా ఉండాల్సొస్తుందని ఆవిడ తల్లి మనసు తల్లడిల్లుతోంది. వాడి కోసం అయినా తాను భర్త మనసులో నందూపై ఉన్న కోపాన్ని తీసెయ్యాలని గట్టిగా నిశ్చయించుకుంది శ్యామల.

డాక్టర్‌గారి సలహా ప్రకారం వాళ్ళిద్దరూ రాత్రి భోజనాన్ని త్వరగా ముగిస్తున్నారు. రోజుట్లాగే ఆ రాత్రి ఏడు గంటలకే భోజనం చేసి వాలు కుర్చీలో కూర్చుని, దినపత్రికని మరోసారి తిరగేస్తున్నారు

తులసీరామ్‌గారు. వంటగదిని సర్దుకొని నిదానంగా భర్త దగ్గరకు వచ్చింది శ్యామల. ఏది ఏమైనా కొడుకు గురించిన విషయాలన్నీ ఇప్పుడు భర్తతో చెప్పాల్సిందేనని నిశ్చయించుకుని అక్కడ కూర్చుందావిడ.

ఏదో అర్థమయ్యీ కానట్టుగా అనిపిస్తుంటే, "ఏంటి శ్యామలా..?" అనడిగారు తులసీరామ్‌గారు.

'అందూ విషయాల్ని మొదట దేని నుంచి ప్రారంభించాలీ?' అనుకుంటూ



## కొత్తగాలి...

**చెట్టు మీద పక్షులు**
**రాగాలు మొదలుపెట్టాయ్!**
**సూర్యుడొచ్చే**
**టైమయింది మరి!**

*– వి.వి.ఎస్. ప్రసాద్,*
*తాడేపల్లి, గుంటూరు జిల్లా*

గొంతు పెగుల్చుకుంది శ్యామల.

చేతిలోని దినపత్రికని పక్కన పెట్టి భార్య వంక చూశారాయన. గుండెల్నిండా గాలిని గట్టిగా పీల్చుకుని "నీ కొక విషయం చెప్పాలి శ్యామలా!" అని గంభీరంగా అన్నారు తులసీరామ్.

అంతే! ఉలిక్కిపడి భర్త వంక చూసింది శ్యామల. 'నేను చెప్పాలనుకున్నది ఈయనకి ముందే తెలిసిందా? దాన్నే నాకు చెప్పాలనుకుంటున్నారా?' అనుకుంటూ కళ్ళు పెద్దవి చేసి, ఆ విషయం ఏంటన్నట్టు ఆసక్తిగా ఆయన వంక చూసింది.

"వారం రోజుల నుంచీ నీకు చెప్పాలనుకుని కూడా సందేహిస్తున్నాను. ఈ విషయాన్ని నీతో పంచుకుంటే తప్ప నా గుండెల్లోని భారం తీరేలా లేదు.." అని నిదానంగా అన్నారాయన.

'కొడుకు గురించి ఈయన ఇంత భారాన్ని మనసులో పెట్టుకున్నారా?' అని ఆశ్చర్యపోతూ భర్త వంక అనురాగంగా చూసింది శ్యామల.

భార్య కళ్ళలోకి చూసి ఆ వెంటనే తలని పక్కకి తిప్పుకుని, "వారం క్రితం ఇదే రోజు గౌరి ఆఫీస్‌కి వచ్చి కలిసింది.." అని కొంచెం తడబడుతూ చెప్పారాయన.

'గౌరి' పేరు వినగానే ఖిన్నురాలైంది శ్యామల. గుండె ఒక్కసారిగా దడదడలాడింది. కొన్ని క్షణాలు ఆ నివ్వెరపాటులోనే ఉండిపోయింది ఆమె. ఇన్నేళ్ళుగా తన సర్వస్వం అనుకున్నది ఇప్పుడు ఉన్నపాటుగా తనది కాకుండా పోతున్నట్టు అనిపిస్తుంటే, అదురుతున్న గుండెలతో తలెత్తి భర్త ముఖంలోకి చూసింది.

"మాయమాటలు చెప్పి తీసుకెళ్ళిన వాడు డబ్బూ నగలు పట్టుకుపోయి ఎక్కడో వదిలేస్తే, ఇంటికి తిరిగి రాలేక, ముఖం చూపించలేక ఇన్నేళ్ళూ ఎక్కడెక్కడో అవస్థలు పడుతూ బతికిందట! ఇప్పుడు తల్లి మంచం పట్టిందని తెలిసి ఊరు వెళ్ళిందట! నేనిక్కడ ఉన్నానని తెలుసుకుని, ఆఫీస్‌ని వెతుక్కుంటూ వచ్చి కలిసింది.." అని చెప్పారాయన.

'ఆఫీస్‌లో ఎందుకు కలవడం? ఇంటికి రావచ్చు కదా?' అనలేదు శ్యామల. గౌరి ఇంట్లోకి వస్తే, తాను బయటకు వెళ్ళాలని బాగా తెలుసు శ్యామలకి. మరో పక్క భర్త గొంతులో గౌరి పరిస్థితికి పడుతున్న బాధ స్పష్టంగా తెలుస్తోంది. ఆ బాధ ఎందుకో కూడా తెలుసుకాబట్టే, తాను నిమిత్తమాత్రురాలినని తెలిసినా కూడా తన ఉద్వేగాల్ని ఆపుకోలేక ఒక్కక్షణం కళ్ళు మూసుకుంది శ్యామల.

భర్తలోని బాధ తగ్గాలంటే దానికి మార్గం ఒక్కటేనని అర్థమైంది శ్యామలకి. ఇప్పుడు ఆయన మాటల్లో చూచాయగా సూచిస్తున్న ఆ మార్గాన్ని తలుచుకుంటుంటే, ఆమె కళ్ళు మూసుకుని ఉన్నా వాటిలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

భార్య భావాల్ని అంచనా వేసుకుంటూ, ఆమె ప్రతిస్పందన వెంటనే బయటపడకపోయే సరికి తల తిప్పి శ్యామల వంక చూశారు తులసీరామ్‌గారు.

శ్యామల రాబోతున్న దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ కళ్ళు తెరిచింది. చడీచప్పుడు చెయ్యకుండా లేచి నిదానంగా అక్కడ నుంచీ లోపలకు అడుగులు వేసింది.

ఆమె మనసులో సంఘర్షణనీ, భావోద్వే

గాల్నీ గ్రహించినట్టుగా "శ్యామలా!" అని పిలిచారు తులసీరామ్‌గారు.

భర్త పిలుపు వినిపించినా ఆగలేదు శ్యామల. తనని కాదన్నట్టు.. అసలు ఈ జీవితమే తనది కాదన్నట్టు తోస్తోంది శ్యామలకి. ఒక్కసారిగా ఆమె కళ్ళు నిండు చెరువులయ్యాయి. వెళ్ళిపోతున్న భార్యని చూస్తూ మౌనంగా, నిస్సహాయగా ఉండి పోయారు తులసీరామ్.




రాత్రి పదకొండు గంటలు.

వర్ణ వెళ్ళాల్సిన ఫ్లైట్ తెల్లవారుఝా మున ఆరుగంటలకే.

ఆ అర్ధరాత్రి సమయంలో.. ఇంట్లో ముసురుకున్న చీకటిలాగే వర్ణ, నందకిషో ర్‌ల మనసులు కూడా స్తబ్దత నింపుకుని నిశ్శబ్దంగా ఉన్నాయి. వర్ణ యూఎస్ ప్రయాణం గంటల్లోకొచ్చేస్తుంటే వర్ణ, నందూల్లో అలజడి పెరుగుతోంది. తన భావాల్నీ, కోపాన్నీ, అలకనీ నాలుగు రోజు ల్నుంచీ అతని మీద నిర్మోహమాటంగా చూపించేస్తోంది వర్ణ.

నందూ మాత్రం ఆమె వియోగాన్ని, భరించలేని దిగులుని లోలోపల అణుచు కుంటూ, పైకి మాత్రం వర్ణకి ఎంతో ధైర్యం చెబుతున్నాడు.

ఇప్పుడు ఎన్నో జాగ్రత్తలు చెబుతున్న నందూ మాటల్ని వింటూ, రేపటి నుంచీ అతనికి దూరంగా ఉండబోతున్నందుకు దిగులుపడుతూనే, అతని గుండెల మీద తల పెట్టుకుని పడుకుంది వర్ణ.

ఎన్నో మాట్లాడుకోవాలని ఉన్నా వాళ్ల గొంతులు మూగబోతున్నాయి. పెళ్లయిన ఈ పది నెలలూ పదిరోజుల్లా గడిచాయి. ఇప్పుడు వియోగం ఆరు నెలలే అయినా అది ఆరు రోజుల్లా గడిచిపోదని తెలుసు. అందుకే ఇద్దరిలోనూ స్తబ్దత ఆవరించు కుంది. దాన్ని ఒకరినొకరు పంచుకుంటూ ఇద్దరూ ఒక్కరిగా పడుకుని ఉన్నారు.

సమయం గడుస్తూ ఉంది.

అర్ధరాత్రి దాటుతుంటే నిదానంగా నిద్ర లోకి జారుకుంది వర్ణ. ఆమె జుట్టుని అనా లోచితంగా సవరిస్తూ కళ్ళు మూసుకుని ఉన్నాడు నందూ.

వర్ణతో కలిసి ప్రేయసీ ప్రియులుగా కొన్ని సంవత్సరాల పాటు పంచుకున్న భావాలు ఇంకా గాఢంగానే గుర్తున్నాయి అతనికి. ఆ అనుభవాల నుంచి ఇప్పుడు వర్ణ తన భార్య అన్న ఏకాంత భావన అతని మనసుకి పూర్తిగా అలవాటు కాక ముందే మళ్ళీ ఇలా ఇద్దరిగా, విడివిడిగా, ఎక్కడో దేశాల దూరంతో ఉండాల్సి రావడం అతనికి భరించలేనట్టుగా ఉంది. తన రేపటిని ఊహించుకుంటూ, వర్ణ స్పర్శని మరింతగా ఆస్వాదిస్తూ ఆ రాత్రంతా మేలుకునే ఉన్నాడతను.

తెల్లవారుతున్న తొలి వెలుగులని చూ సి, చిన్నగా తడుతూ వర్ణని నిద్ర లేపాడు.

ఉలిక్కిపడి లేచింది వర్ణ. తన ప్రయా ణానికి ఇంకా కొన్ని గంటలు కూడా లేవని అర్థమై బొమ్మలా ఉండిపోయిందామె.

నందూనే ఆమెని రెడీ అయ్యేలా కంగా రుపెడుతూ పనులు పూర్తిచేయించి, అతనూ ఫ్రెష్ అయ్యాడు.

వర్ణకిష్టమని సేమ్యా ఉప్మా చేసి ఆమెకి తినిపించాడు. టీ పెట్టి తెచ్చాడు.

నందూ భుజం మీద తలవాల్చి, అతను ఇచ్చిన టీని ఇష్టంగా తాగిందామె.

## కొత్తగాలి...

**చిల్లర వ్యాపారుల వద్ద**
**వంద బేరాలాడుతాం!**
**కార్పొరేటు మాల్స్‌లో**
**వందలకొద్దీ సమర్పిస్తాం!**

– జి. హరితశ్రీ సంతోషి, బెంగళూరు

అతని జుట్టులో చెయ్యిపెట్టి చిన్నగా వేళ్ళని కదిలిస్తూ "నందూ! డాడీకి చెప్పాను. నువ్వు ఈ రోజు నుంచి డాడీ వాళ్ళతో కలిసి ఉండు!" అని నిదానంగా అంది వర్ణ. అతను ఒప్పుకోడని అనిపిస్తున్నా, ఎలాగైనా అతన్ని ఒప్పించాలన్నది ఆమె తాపత్రయం.

"అంకుల్ వాళ్ళింట్లోనా! ఎందుకు? " అని ఆశ్చర్యంగా అన్నాడు నందకిషోర్. ఆ వెంటనే, "ఇక్కడ నేను ఒక్కణ్నే ఉంటాననా? " అనడిగాడు.

చిన్నగా తలూపిందామె.

"ఓయ్! పిచ్చి వర్ణా! నాకు అంకుల్ వాళ్ళ ఇంట్లోనే లోన్లీగా ఉంటుంది. ఇది మన ఇల్లు. మనం పెళ్ళయిన రోజు నుంచీ కలిసి ఉన్న ఇల్లు. ఒకోసారి కాలేజీ సెలవులప్పుడు నువ్వు ఆఫీసుకి వెళ్ళినా నేను ఇంట్లోనే ఉండేవాణ్ని. నువ్వు ఎప్పుడు వస్తావా? అని ఎదురుచూస్తూ, మన మెమరీస్‌ని రీప్లే చేసుకుంటూ గడిపేవాణ్ని. ఇప్పుడూ అంతే! కాకపోతే అప్పుడు టైం గ్యాప్ తక్కువ. సాయంత్రానికి తిరిగి వచ్చేసేదానివి. ఇప్పుడు ఆ గ్యాప్ కొంచెం ఎక్కువ. ఆర్నెల్లకి వచ్చేస్తావుగా!" అని మామూలుగా చెప్తున్నా కూడా అతని గొంతు బొంగురుపోయింది.

అంతే! ఒక్కసారిగా వర్ణ కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. ఆమె కంట్లోంచి టప్పున రాలబోయే కన్నీటి చుక్కకి చెయ్యి అడ్డు పెట్టాడు నందు.

"ఏడవకు వర్ణా! ఈ టైం చాలా విలువైంది. ఈ లాస్ట్ మినిట్స్ మనకి ఆరు నెలలు కాదు, జీవితాంతం గుర్తుండిపోతాయి. ఇప్పుడు మనం ఎంత సంతోషంగా ఉంటే ఆరునెలల్నీ అంతకంటే సంతోషంగా, స్పీడుగా గడిపేసి మళ్ళీ ఒక టైపోతాం!" వర్ణ కన్నీళ్ళని సున్నితంగా తుడిచి, ఉత్సాహపరిచాడు.

గుండెల్నిండా గాలి పీల్చుకుని స్థిరత్వాన్ని తెచ్చుకుంటూ, సరేనన్నట్టు తల ఊపింది వర్ణ. వాళ్ళిద్దరూ చిరునవ్వుతో లేచి, రాత్రే సర్ది ఉంచిన లగేజీని మరోసారి వెరిఫై చేసుకున్నారు. వాళ్ళు అవి సరిచూసుకుంటుండగానే ప్రతాప్, సుమణిలు వచ్చారు. వస్తూనే ఆనందంతో కూతుర్ని చూసుకున్నారు.

తమ ఒక్కగానొక్క కూతురు దేశాలు దాటి వెళుతున్నందుకు ఆనందంగా ఉన్నా, అంతలోనే తమకు దూరంగా ఉండబోతున్నందుకు వాళ్ళకు ఒకింత దిగులుగా కూడా ఉంది.

టైం అవుతుండడంతో.. వర్ణ, నందకిషోర్, ప్రతాప్‌గారు, సుమణిలు నలుగురూ ప్రతాప్‌గారి కారులో హైదరాబాద్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్‌కి బయలుదేరారు.

ఎందుకో సమయం చాలా వేగంగా గడుస్తున్నట్టు అనిపిస్తోంది వర్ణకి. ఇకపై ఆరునెలలూ కూడా ఇలాగే గడిచిపోవాలి అనుకుందామె. ఆ ఆరు నెలలూ మరింత భారమై, క్షణమొక యుగంగా గడవబోతోందేమో? అని ఊహించడానికి కూడా ఆమెకి మనస్కరించలేదు.

కానీ ఒకోసారి ఏది జరగకూడదు అనుకుంటామో, అవే మరింత దుఃఖాన్ని వెంట తీసుకుని విధితో నడిచొస్తుంటాయి!

వర్ణతో ఎయిర్‌పోర్ట్‌లోపలికి సెక్యూరిటీ చెక్ ఇన్ వరకూ ఆమె వెంట వెళ్ళారు

నందకిషోర్, ప్రతాప్‌గారూ, సుమణిలు.

తల్లిని రెండు చేతుల్తో చుట్టి గట్టిగా హత్తుకుంది వర్ణ. తండ్రికి కళ్ళతోనే వీడ్కోలు చెప్పింది. నందకిషోర్ వద్దకు వచ్చి, అతని కళ్ళల్లోకి చూస్తుంటే వర్ణ కళ్ళు తడిబారాయి.

కళ్ళతోనే ఏడవొద్దని వారించి ఆమెని దగ్గరకు తీసుకున్నాడు నందకిషోర్.

చిన్నపిల్లలా అతని గుండెల్లో ఒదిగిపోయి, "ఐ లవ్‌యూ నందూ! నువ్వు జాగ్రత్త!" అని మెల్లగా చెప్పింది.

ఒక చేతిని ఆమె నడుము చుట్టూ వేసి, మరో చేత్తో వర్ణ జుట్టుని వెనక్కి సవరించి, ఆమె ముఖంలోకి చూస్తూ, "లవ్ యూ టూ వర్ణా! నీ కోసం ఎదురుచూస్తుంటాను!" అని గుసగుసగా అన్నాడతను. నిశ్చింతగా నందూ వంక చూసింది వర్ణ.

"జాగ్రత్తగా వెళ్ళిరా! కంగ్రాట్స్ అండ్ ఆల్ ది బెస్ట్!" అని చిరునవ్వుతో చెప్పి ఆమెని దూరం జరిపాడు నందూ.

అతని ముఖంలోకి చూసి తల ఊపి, తల్లి చేతిలోని హ్యాండ్ బ్యాగ్‌ని తీసుకుని భుజానికి తగిలించుకుంది వర్ణ.

సరిగ్గా అప్పుడే.. వర్ణని చూసిన రాగా తన బ్రదర్‌తో కలిసి పరుగున అక్కడకు వచ్చింది. హుషారుగా ఉన్న రాగా, వర్ణతో మాటలు కలిపింది.

రాగా ముందు కదులుతుంటే, ఆమె వెనక నడుస్తూ మళ్ళీ తిరిగి తిరిగి చూసి వెళుతోంది వర్ణ.

ఆమెని చూస్తూ చిరునవ్వుతో చేయి ఎత్తి ఊపాడు నందూ.

వర్ణ, రాగాలకి వీడ్కోలు చెప్తూ అక్కడే నిలబడ్డారు వాళ్ళు. వర్ణ చెకిన్ దాటి వెళ్ళిపోయాక వెనుదిరిగారు ప్రతాప్‌గారు, సుమణి, నందకిషోర్‌లు.

కారుని తీసుకొచ్చి సుమణి, నందూలు ఎక్కగానే ముందుకు దూకిస్తూ "సుమణీ! మనం వర్ణని ఎల్‌కేజీలో జాయిన్ చేసినప్పుడు, బేబీని వదిలొచ్చేస్తూ ఎలా ఫీల

> **కొత్తగాలి...**
>
> **వెండితెర ప్రభంజనం**
> **ప్రపంచవ్యాప్త సంచలనం**
> **తెలుగు ప్రతిభకు దర్పణం**
> **'బాహుబలి'కి నీరాజనం!**
>
> *– అంబటి వెంకటశివారెడ్డి,*
> *యర్రగుంట్ల, కడప జిల్లా*

య్యామో! సేమ్ సిచ్యుయేషన్‌లానే ఉంది కదా ఇప్పుడూ!" అన్నారు ప్రతాప్‌గారు.

సుమణి చిన్నగా నవ్వింది.

"వర్ణ ఇంకా బేబీలానే కనిపిస్తోంది. యాజిటీజ్ ఆ రోజులానే ఉంది నాకు. బంగారుతల్లి అప్పుడే ఇంత పెద్దదైపోయిందా!" అని తనలో తాను అనుకుంటున్నట్టుగా అన్నారాయన.

నందూ తల తిప్పి ఆయన వంక చూసి చిరునవ్వు నవ్వాడు.

"చెకిన్‌లోకి వెళ్తూ ఎలా చూసిందో చూశావా నందూ! సేమ్ అలానే చిన్నప్పుడు కూడా! చిన్నప్పుడేంటి ఇంటర్మీడియెట్‌లో హాస్టల్‌కి వెళ్తూ కూడా ఇలాగే! 'నన్ను ఒక్కదాన్నే వదిలేస్తున్నారు' అన్నట్టుగా, 'వెళ్ళను' అన్నట్టుగా ఏడుపు ముఖంతో వెనక్కినక్కి తిరిగి మమ్మల్ని చూస్తూ వెళ్ళేది. ప్చ్! లైక్ ఎ ఛైల్డ్! వర్ణ అస్సలేం మారలేదు" అని, వర్ణ చిన్నప్పటి రోజుల్ని గుర్తుచేసుకుంటూ అన్నారాయన.

ఉలిక్కిపడ్డాడు నందూ.

'వర్ణ వెళ్ళనంటున్నా, తాను బలవంతాన యూఎస్ పంపి తప్పు చేస్తున్నానా? ' అన్న భావం మొట్టమొదటిసారి కలిగిందతనికి.

అయితే.. మారనిది వర్ణ ఒక్కతే కాదు ఆమె తల్లిదండ్రులూ, తాను కూడా అని బలంగా అనిపించింది.

'వర్ణ వెళ్ళను మొర్రో అంటున్నా తాము తమ కోసం, తమ భావాల్ని పట్టుకు వేలాడుతూ, ఆమెని అర్థం చేసుకోకుండా చిన్నప్పటినుంచీ ఆమెకి నచ్చని పనిని బలవంతాన చేయిస్తున్నామేమో?' అన్న కొత్త ఆలోచన వచ్చిందతనికి.

వర్ణ వైపు నుంచి ఆలోచిస్తుంటే, నందూ మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది.

ఆమెకి ఇష్టం లేకపోయినా చిన్నతనం నుంచీ తన ఇష్టాల్ని చంపుకుంటూ, ఏడుపుని బలవంతాన దిగమింగుకుంటూ, ఆమెకి నచ్చని జీవితంలో బతుకుతోందని కొంచెంగా అర్థం అవుతోంది.

యూఎస్‌కి ఆఫర్ వచ్చినప్పటి నుంచీ, ఆమె మాట్లాడిన మాటలు ఒక్కొక్కటిగా గుర్తొస్తుంటే వర్ణ భావాలు ఇప్పుడు మరింత స్పష్టంగా తెలుస్తున్నాయి అతనికి. ఉన్నపాటుగా వెనక్కి పరిగెత్తుకెళ్ళి వర్ణ ప్రయాణాన్ని ఆపించి, ఆమెని వెనక్కి తీసుకొచ్చేద్దామని బలంగా అనిపించింది. అంతే! వెంటనే వాచ్ వంక చూసుకున్నాడు.

అప్పటికే సమయం మించిపోయింది. ఫ్లైట్ టేకాఫ్ టైం దాటేసింది కూడా!

శబ్దం బయటకు రానంత చిన్నగా నిట్టూర్పుని విడిచాడు నందకిషోర్. ఒక్కసారిగా నిస్సత్తువ ఆవహించిందతన్ని.

★ ★ ★

హైదరాబాద్ నుంచి మొదలైన వాయు ప్రయాణం.. ఇరవై ఆరు గంటల తర్వాత ముగిసింది.

ఇతర రాష్ట్రాల నుంచి వచ్చిన మరో ఎనిమిది మందితో పాటూ న్యూయార్క్ సిటీలోని జాన్ ఎఫ్ కెనడీ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్‌లో దిగింది వర్ణ.

ఒక రోజు గడిచినా, చిత్రంగా సమయం.. ఆదే రోజు, అదే తేదీ, రాత్రి పదిగంటలు అయ్యింది. ఇండియాలో మాత్రం మళ్ళీ తెల్లారి తర్వాతి రోజు వచ్చేసుంటుంది అనుకోగానే వర్ణ పెదవులపై చిరునవ్వు విరిసింది.

ఇండియా నుంచి వచ్చిన వాళ్ళందరికీ కంపెనీ మెయిన్ బ్రాంచ్‌లోని ఐటి ప్రొఫెషనల్స్ కోసం కట్టించిన గెస్ట్‌హోమ్‌లలోనే రూమ్స్ ఎలాట్ చేశారు.

రూమ్‌లో ఫ్రెష్ అయిన వెంటనే నందూకి ఫోన్ చేసింది వర్ణ. తాను బాగున్నానంటూ, ఫ్లైట్‌లోకి ఎక్కిన క్షణం నుంచీ ఇప్పటివరకూ జరిగిన ప్రతి సంఘటననీ అతనికి వివరించి, యాక్షన్ చేస్తూ మరీ చెప్పిందామె. ఇండియాలో టైం ఎంతయిందో కనుక్కుని అమెరికాలో సమయం ఎంత అయ్యిందో చెప్పింది.

అక్కడ నందూకి కాలేజ్‌కి టైం అవుతూంటుందని నందూతో అంది వర్ణ.

"అలా అస్సలు ఫీలవకు! నువ్వు ఏ టైమ్‌లో ఫోన్ చేసినా హ్యాపీగానే ఫీల్ అవుతాను. అర్ధరాత్రయితే మరీనూ! నువ్వు నా గుండెల మీదే పడుకున్నట్టుంటుంది!" అని స్కైప్‌లో కనిపిస్తున్న ఆమెని చూసి కొంటెగా అన్నాడు.

"నీ మీద పడుకున్నట్టు అను నందూ! గుండెలమీద పడుకోవడమంటే నిద్ర లేకుండా చెయ్యడం కదా?" గారంగా అందామె.

ఆమె మాటలకి గట్టిగా నవ్వాడు నందూ. అలా వాళ్ళిద్దరూ చాలా సేపు మాట్లాడుకుంటూనే ఉన్నారు. నందూతో ఫోన్‌లో మాట్లాడడం అయిన తరువాత తన లగేజ్‌ని తీసి సర్దుకోవడం మొదలు పెట్టింది వర్ణ.

రాగా మంచం మీద పడుకుని ఏవో రాగాలు తీస్తోంది. పని చేసుకుంటున్న వర్ణ వంక చూసి "వర్ణా! అమెరికా అబ్బాయిల్ని చూశావ్ కదా! ఇండియన్ గైస్‌కీ, అమెరికన్ గైస్‌కీ తేడా ఏంటే?" అని ఏదో ఆలోచిస్తూ అడిగింది రాగా.

చేస్తున్న పనాపి తల తిప్పి రాగా వంక చూసి, ఆలోచనలో పడింది వర్ణ. క్షణం తర్వాత, "మే బి వాళ్ళు డార్క్ కలర్.

అ
క్ష
రం

అన్ని రుతువుల్లో కోయిల కూయదు!
అలాగే జీవితంలో ఎల్లప్పుడూ
ఆనందం ఉండదు!

– థామస్ ఫుల్లర్



వీళ్ళు స్నో వైట్" అంది వర్ణ.

పక్కనే ఉన్న మినీ పిల్లోని తీసి వర్ణ మీదకి విసిరి కొడుతూ, "అబ్బచా! నీకసలు పెళ్లయిందే! పాలు తాగే స్టేజ్ దగ్గరే ఆగి పోయావా? మళ్ళీ మేబీ అంట మేబీ.." అని విసుగ్గా అంది రాగా.

"హబ్బా! నాకు తెలీదే రాగా! పోనీ నువ్వు చెప్పు.. ఏంటా డిఫరెన్స్?" అన డిగి చేస్తున్న పనిని కొనసాగించింది వర్ణ.

"ఊc! ఫస్టాఫ్ ఆల్ అమ్మాయిలు కని పించగానే మనోళ్ళు లైనేస్తారు, వీళ్ళు లెవ లేస్తారు.." అంది రాగ.

ఆమె మాటలు వినగానే చిన్నగా నవ్వు తూ, "అబ్బో! ఫస్టాఫాలా..! అంటే ఎన్ని డిఫరెన్స్‌లు చెబుతావేంటీ?" అంది వర్ణ.

"ప్రస్తుతానికి ఈ ఒకటే ఫైన్డౌట్ చేశా! కాబోయేవాణ్ని మనవాళ్ళలో ఛూజ్ చేసు కుంటే బెటరా? అమెరికన్స్‌లో అయితే బావుంటుందా? అనుకోగానే అసలు వాళ్ళకీ, వీళ్ళకీ తేడా ఏంటీ అనిపించింది. అందుకే, నేనే రీసెర్చ్ స్టార్ట్ చేశా! ఇప్పుడేగా మొదలుపెట్టింది. ఇంకా కనుక్కున్న ప్పుడల్లా చెబుతాలే!" అని వివరిస్తున్న ట్టుగా చెప్పింది రాగా.

ఆమె మాటలకి నవ్వి, "పెళ్ళికొడుకు కోసం ఇంత రీసెర్చ్ అవసరమా!" అంది.

"అవసరమే! మనిషి గురించి మినిమం నాలెడ్జ్ కూడా లేకుండా వాడితో లైఫ్ లాంగ్ ఎలా కలిసుంటామే? ఎవరైనా ఏదైనా అడిగినా నీకులా మేబీ అని చెప్తుంటే ఫారెక్స్ బేబీలా చూస్తారు అందరూ" అంటూ నవ్వింది రాగా.

"ఏయ్! నేను ఫారెక్స్ బేబీనా?" అంటూ ఇందాక రాగా విసిరిన దిండుని తీసి, రాగా మీదకి విసిరింది వర్ణ.

దాన్ని క్యాచ్ పట్టుకుని మంచం మీద నుంచి దిగి, "అవునో? కాదో? ఈసారి నందూకి ఫోన్ చేసినప్పుడు అడుగు!" అనేసి, వర్ణ నుంచి తప్పించుకోవడం కోసం, గట్టిగా నవ్వుతూనే ఆ గదిలోంచి బయటకు పరిగెత్తింది రాగా.

★ ★ ★

తులసీరామ్, శ్యామల మధ్య ఆ ఇంట్లో మూడురోజులు నిర్లిప్తంగా గడిచిపోయాయి.

ఇంటి పనులూ, భర్త పనులూ, స్నాన పానాదులూ, వంట.. అన్నీ యథాలా పంగా చేస్తోంది శ్యామల. మనసులో రక రకాల ఆలోచనలు మెదులుతున్నాయి. ఏవేవో భావాలు కలుగుతున్నాయి. అన్నిటి మీదా అనాసక్తిగా ఉంటోందామె.

ఆమెలోని నిర్లిప్తత తులసీరామ్‌గారికి నిర్లక్ష్యంగా కనిపిస్తోందిగానీ, అది ఆమె లోని అభద్రతా భావమేమో? అన్న ఆలో చన ఎందుకో అస్సలు రాలేదు.

ఆ రోజు ఆఫీస్‌కి సెలవు కావడంతో.. శ్యామలతో అన్ని విషయాలు వివరంగా మాట్లాడాలని హాల్లో కూర్చుని ఏదో ఆలో చనలో ఉన్నారు తులసీరామ్‌గారు.

శ్యామల వంటగదిలో ఉంది.

ఏడు గంటలు అవుతుంటే.. రోజూటిలా గానే ఒక చేత్తో టిఫిన్ ప్లేట్, మరో చేత్తో మంచినీళ్ళ గ్లాసూ పట్టుకుని వంటగది లోంచి హాల్లోకి రాబోతోంది శ్యామల.

ఆవిడని గమనించకుండా సరిగ్గా అప్పుడే

"శ్యామలా!" అని పిలిచారు తులసీరామ్.

అనాలోచితంగా తలెత్తి అడుగు ముందు కేసిన ఆవిడ గుమ్మాన్ని చూసుకోలేదు. అలవాటైన గుమ్మాలే అయినా ఆవిడ ధ్యాస ఇక్కడ లేకపోవడంతో, కాలుకి వంటగది గడప తగిలి ఒక్కసారిగా బ్యాలెన్స్ తప్పింది.

సరిగ్గా తినీతినకా నీరసించడంతో దబ్బున నేలమీద పడిపోయింది శ్యామల.

గ్లాసు, టిఫిన్ ప్లేటూ ఠంగున నేల మీద పడిన చప్పుడుకి తలతిప్పి చూసిన తులసీ రామ్‌గారు.. నేల మీద పడిపోయిన శ్యామలని చూసి కంగారుగా వచ్చారు. అప్పటికే స్పృహ తప్పింది శ్యామలకి.

ఊహించని ఆ సంఘటనకి "శ్యామలా!" అని గట్టిగా అరుస్తూ, ఆవిడని పట్టుకుని బలంగా కుదిపారాయన. ఆవిడలో చలనం లేకపోవడంతో కంగారుగా, "శ్యామలా! శ్యామలా..!" అంటూ అటు వైపున్న ఆవిడ ముఖాన్ని తన వైపుకు తిప్పారు తులసీరామ్.

స్పృహ లేకుండా వాలిపోయింది శ్యామల తల.

ఆవిడని హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలని లేప డానికి ప్రయత్నించారు తులసీరామ్. ఆమెని కొంచెం పైకి లేపగానే నేల మీద రక్తం కనిపించింది. రక్తాన్ని చూసి తులసీ రామ్‌గారికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. శ్యామల కింద పడినప్పుడు తల వెనక గాయం అయ్యిందని గ్రహించగానే, శ్యామల దక్కుతుందో? లేదో? అన్న భయం కలిగింది ఆయనకి. వెంటనే లేచి అదురుతున్న గుండెలతో గబగబా నందూకి ఫోన్ చేశారు తులసీరామ్. ఆయనకి కొడుకు తప్ప ఆ క్షణంలో ఇంకెవరూ గుర్తుకు రాలేదు. ఏ రెండో ఆలోచనా కలగలేదు.

కాలేజీకి రెడీ అవుతున్న నందూ తండ్రి ఫోన్‌కి కంగారుపడ్డాడు. వెంటనే అతను అంబులెన్స్ తీసుకొని తులసీరామ్‌గారి ఇంటికి వచ్చేసరికి శ్యామలని గుమ్మం బయటకు తీసుకొచ్చారాయన. అంబులెన్స్‌లోకి తల్లిని ఎక్కించాడు నందూ.

ఆ మరుక్షణమే హాస్పిటల్ వైపు రయ్యిన దూసుకెళ్ళింది అంబులెన్స్.




అమెరికాలో.. ఉదయం ఎనిమిది గంటలవుతుంటే, రూమ్‌లోంచి రాగాతో కలిసి క్యాంటీన్‌కి వచ్చింది వర్ణ.

కంపెనీ క్యాంటీన్‌లో బ్రేక్‌ఫాస్ట్ తీసుకుం టున్నారు వర్ణ, రాగా. వాళ్ళిద్దరితో పాటు తమిళనాడు నుంచి వచ్చిన భారతి, మానుషి కూడా జాయిన్ అయ్యారు.

చాకుతో వెన్నని బ్రెడ్ మీద రాస్తూ "వర్ణా! ఈ రోజు క్లాస్‌లో ఇంట్రడ్యూస్ చేయబోయే న్యూ ప్రాజెక్ట్‌కి డిజైనర్ మన ఆంధ్రావాడే అంట. మార్నింగ్ వాక్‌లో కలిసిన బషీరున్నీసా చెప్పింది" అని హుషారుగా అంది రాగా.

రాగా మాటలు వర్ణ మెదడులోకి అస్సలు వెళ్ళడంలేదు. దానికి కారణం నందూ ఆమెతో కమ్యూనికేషన్‌లో లేకపో వడమే. నిన్న రాత్రి పది గంటలకు ఇక్క డకు వచ్చిన వెంటనే నందూతో మాట్లాడిం దామె. ఆ తర్వాత ఈ కొత్త ప్రదేశంలో నిద్రపట్టక అర్ధరాత్రి నుంచీ మళ్ళీ ఫోన్ చేస్తూనే ఉంది వర్ణ.

కానీ అతను ఆమె ఫోన్ కాల్‌ని

అటెండ్ అవలేదు. 'ఇక్కడ రాత్రి.. అక్కడ పగలు కాబట్టి, ఒకవేళ కాలేజ్ మీటింగ్ లోనో, క్లాస్‌లోనో ఉండుంటాడు. అతనే ఫోన్ చేస్తాడులే!' అనుకుని నందూ ఫోన్ కోసం ఎదురు చూసిందామె. కానీ అతను ఇప్పటి వరకు ఫోన్ చెయ్యలేదు.

'అక్కడ సాయంత్రం అవుతోంది, నందూ ఇంటికి వచ్చేసుంటాడు! మరి ఇంకా నాకు ఫోన్ చెయ్యలేదేంటీ? మొదటి రోజే నందూతో కమ్యూనికేషన్ ఇలా అయ్యిందేంటీ?' అనుకుంటుంటే కొంచెం టెన్షన్‌గా అనిపించింది వర్ణకి.

ఉండుండీ నందూకి ఫోన్ చేస్తూనే ఉందామె. చూసీ చూసీ అతని ఫేస్‌బుక్ అకౌంట్‌కి ఇన్‌బాక్స్ మెసేజ్‌లు పెట్టింది. మెయిల్స్ చెక్ చేసుకుంటాడుగా అనుకుని, చివరికి మెయిల్ కూడా ఇచ్చింది.

నందూ ధ్యాసలో పరధ్యానంలో ఉన్న వర్ణకి రాగా మాటలు ఏవీ బుర్రకెక్కలేదు. ప్లేట్‌లో ఉన్న వెజ్ శాండ్‌విచ్‌ని విడదీసి అందులోని ఒక్కో ఆకు ముక్కనీ, జీరా పొడిని మునివేళ్ళతో తాకుతూ ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. ఆమె పరధ్యానాన్ని చూడడంతోనే చేతిమీద ఒక్కటేసింది రాగా.

అంతే! ఉలిక్కిపడి చూసింది వర్ణ.

"ఏ లోకంలో ఉన్నావ్ డియర్! నందూ గురించేనా? ఫోన్ చేస్తాడులే ఎందుకంత కంగారు? దేశం వదిలొచ్చావ్. పాపం! ఇంకా నందూని తినకే. పెళ్ళాం ఊరెళ్ళిన ఆనందాన్ని సెలబ్రేట్ చేసుకోనియ్!" అని నవ్వుతూ అంది రాగా.

"ఛ! అది కాదే. డాడీతో మాట్లాడాను. డాడీ ఫోన్ చేసినా నందూ ఆన్సర్ చెయ్యలేదట. నా భయం, అతనికి ఏమైనా?" అని ఇకపై చెప్పలేక ఆగిపోయింది వర్ణ. అప్పటికే ఆమె కళ్ళలో తడి చేరింది.

చిన్నగా నిట్టూర్చి "అలా ఏం అవదు వర్ణా! ఊరికే కంగారుపడకు. నందూ ఏదైనా పనిలో పడి ఉంటాడు. లేకపోతే ఫోన్ పోయుంటుంది. లేదంటే, రిపేర్ వచ్చుంటుంది. సంథింగ్! ఏదో అయ్యుంటుంది. ముందు నువ్వు బ్రేక్‌ఫాస్ట్ చెయ్యి. తరువాత నందూవాళ్ళ ఇంటికి ఫోన్ చేసి మాట్లాడదాం!" అంటూ వర్ణ చేత బలవంతాన ఆ శాండ్‌విచ్‌ని తినిపించింది రాగా.

ఒక్క శాండ్‌విచ్ తినడానికే గగనమైంది వర్ణకి. పేపర్ నాప్‌కిన్‌తో మూతి తుడుచుకుంటుంటే వర్ణ ఫోన్ రింగైంది. వెంటనే చూసిందామె. ఆ కాల్ నందూ నుంచి! ఉత్సాహంతో ఎగ్జయిట్ అవుతూ వెంటనే "హలో నందూ!" అని అందామె.

"హాయ్ వర్ణా! ఏంటి ఇన్ని మిస్స్‌డ్ కాల్స్..! అసలు ఫోన్ చెయ్యడం తప్ప ఇంకేమైనా చేశావా నువ్వు?" అని అన్నాడు నందూ.

"నువ్వు ఫోన్ చెయ్యడం తప్ప అన్నీ చేశావుగా!" కచ్చగా వెంటనే అందామె.

వర్ణ మాటలకి చిన్నగా నవ్వాడు. నవ్వుతూనే "థ్యాంక్స్‌రా!" అన్నాడు.

"దేనికి?" అని ఆశ్చర్యపోయింది వర్ణ.

"నీ మాటలు వినగానే ఇప్పటివరకు పడిన టెన్షనంతా పోయింది వర్ణా! థ్యాంక్యూ!" అని మళ్ళీ అన్నాడు నందూ.

"టెన్షనేంటి?" కంగారుగా అడిగిందామె.

"నీతో మాట్లాడిన తరువాత నాన్న ఫోన్ చేశారు. ఈ రోజు మార్నింగ్ అమ్మకి చాలా పెద్ద ప్రమాదం తప్పింది తెలుసా? మార్నింగ్ నాన్నకి టిఫిన్ తీసుకెళ్తూ వంటగది గుమ్మం తగిలి పడిపోయిందట. తలకి బాగా దెబ్బ తగిలింది. చాలా బ్లడ్ పోయింది. నాన్న నాకు ఫోన్ చేసి ఏడ్చేశారు! వెంటనే వెళ్ళి అమ్మను హాస్పిటల్‌కి తీసుకెళ్ళాను. ఆ టెన్షన్‌లో ఫోన్ మనింట్లో మర్చిపోయాను వర్ణా!" అంటూ జరిగినదంతా చెప్పాడు నందు.

"సారీ నందూ! ఐ యాం వెరీవెరీ సారీ! నేనలా అయ్యిందనుకోలేదు. ఇప్పుడు ఆంటీకి ఎలా ఉంది? డాక్టర్స్ ఏమన్నారు?"

## కొత్తగాలి...

**వృక్షసుందరిని శిశిరం**
**వివస్త్రను చేసినా ప్రాణం తీసుకోదు!**
**ఆకుపచ్చ చీర కప్పే**
**వసంతుడు వెంటే వస్తాడు!**

*- లోగిశ లక్ష్మీనాయుడు,*
*సింహాచలం*

అని కంగారుపడుతూ అడిగింది వర్ణ.

"వెంటనే తీసుకెళ్ళాం కాబట్టి పర్లేద న్నారు. కానీ ఎందుకో అమ్మ చాలా వీక్‌గా ఉంది" బాధగా చెప్పాడు.

తల్లిని చిన్నప్పటి నుంచీ ఎంతో దగ్గరగా చూసిన అతనికి తల్లిలోని బలమైన వ్యక్తిత్వం గురించి బాగా తెలుసు. అందుకే, ఆవిడ అలా జీవచ్ఛవంలా ఉండడం చాలా ఆశ్చర్యాన్నీ, అనుమా నాన్నీ కలిగిస్తోంది అతనికి.

"నీ మీద బాగా బెంగ పెట్టుకునుంటారు నందూ! పోన్లే ఇప్పుడు అంకుల్ నీతో మాట్లాడారుగా! ఇంక అత్తయ్యకి ఏ దిగులూ ఉండదు. చాలా బావుంటారు" మనసులో సంతోషపడుతూ, అతనికి ధైర్యాన్ని చెప్పింది వర్ణ.

చిన్నగా నిట్టూర్చాడు నందూ.

"ఏమన్నా తిన్నావా అసలు?" అని వెంటనే ప్రేమగా అడిగిందామె.

"ఊc! ఇంటికి వచ్చేసేముందే.. నాన్నా, నేనూ కలిసి హోటల్లో భోజనం చేశాం. నాన్న ఈ రాత్రికి హాస్పిటల్‌లోనే ఉంటా నన్నారు. నేను ఫోన్‌ని ఇంట్లో మర్చిపో యానని ఫోన్ కోసం మన ఇంటికి వచ్చాను. మళ్ళీ రేపు ఉదయాన్నే వెళ తాను. నువ్వూ..? నువ్వెలా ఉన్నావ్ వర్ణా?" అన్నాడు.

"బావున్నాను నందూ! ఇప్పుడే శాండ్ విచ్.." అని చెబుతున్న వర్ణ మాటలు ఇంకా పూర్తి కాలేదు.

వర్ణనే చూస్తూ అప్పటి వరకూ ఆమె మాటల్ని వింటున్న రాగా ఆమె చేతిలోంచి ఫోన్‌ని లాక్కుని, "ఒక సింగిల్ శాండ్‌వి చ్‌ని తినిపించలేకపోయాను మీ ఆవిడ చేత. నువ్వు ఫోన్ చేసి నన్ను బతికిం చావ్ నందూ! లేకపోతే మధ్యాహ్నాం దీనికి లంచ్ తినిపించడం నా వల్ల అయ్యే దికాదు.." అని గడగడా చెప్పింది రాగా.

"అబ్బ! ఫోన్ ఇవ్వవే రాగా! విసిగిం చకు!" అంటూ రాగా చేతిలోంచి తన సెల్‌ఫోన్‌ని లాక్కుంది వర్ణ.

ఆమె ఫోన్‌ని లాక్కుంటున్నా వదల కుండా, "ఇదుగో నందూ! వర్ణ ఇలానే ఉం టే నేను మీ వర్ణని వదిలేసి, ఇంకో పార్ట నర్ రూమ్‌లోకి షిఫ్ట్ అయిపోతాను. చెప్పు మీ ఆవిడకి" అని దబాయింపుగా అరుస్తూ, బెదిరిస్తున్నట్టుగా చెప్పింది రాగా.

తన ఫోన్ రాగా నుంచీ తీసుకుని, "రా గా జోక్ చేస్తుంటుంది నందూ! అన్నీ లైస్. నువ్వేం పట్టించుకోకు" అంది వర్ణ.

"ఓకే! పట్టించుకోనులే. కానీ వర్ణా! లైఫ్ అంటే ఈ ఒక్కరోజు కాదు. చాలా చాలా ఏళ్ళు. ఈ రోజు గురించి మాత్రమే ఆలో చిస్తే భవిష్యత్తులో బాధపడతాం. రేపటి గురించి కూడా ఆలోచిస్తే జాగ్రత్తపడ తాం!" అన్నాడతను.

"ఇప్పుడువన్నీ ఎందుకు నందూ?"

"రాత్రి నుంచీ నీకు బాధనిపించి టెన్షన్ పెట్టుకున్నావ్. అన్నిటికంటే హెల్త్ చాలా విలువైనది. డబ్బు పోగొట్టుకున్నా సంపా దించుకోవచ్చు. కానీ, ఆరోగ్యం పాడయ్యాక దాన్ని తిరిగి తెచ్చుకోలేం. అసలే అక్కడ కేరింగ్ ఎవరూ లేరు. నీకు నువ్వే కేర్‌ఫు ల్‌గా ఉండాలి వర్ణా. రాత్రి నువ్వు పడు కునే ముందు ఫోన్ చేశాను కదా! ఉదయం అనెక్స్‌పెక్టెడ్‌గా హాస్పిటల్‌కి వె ళ్ళాల్సొచ్చింది. ఇలా ఒక పూట ఫోన్

చేయకపోతే, తిండి తినకుండా అంత టెన్షన్ పెట్టేసుకుంటే ఎలా చెప్పు? " అని మృదువుగా మందలించాడు నందూ. అతని మాటల్లో వర్ణ గురించి అతను పడుతున్న ఆదుర్దా స్పష్టంగా వ్యక్తమవుతోంది.

తల్లికి జరిగిన యాక్సిడెంట్ ఇన్సిడెంట్ వల్ల అతను తన గురించి ఇంకా కొంచెం ఎక్కువ ఆందోళన పడుతున్నాడని అర్థమై ఏం మాట్లాడకుండా, సైలెంట్‌గా ఫోన్‌లో అతని మాటల్ని వినసాగింది వర్ణ.

నందూతో మాట్లాడిన తరువాత రాగా, భారతి, మానుషిలతో కలిసి కంపెనీ మెయిన్ ఆఫీస్‌కి వచ్చింది వర్ణ.

ఆఫీస్‌లోని ప్రొఫెషనల్స్.. ఇండియా నుంచి ఇక్కడకు వచ్చిన టీమ్ మెంబర్స్‌ని పరిచయం చేసుకున్నారు.

పరిచయాలన్నీ పూర్తయ్యాక ఆ ప్రొఫెషనల్స్‌లో ఒకడైన నందన్..ఇప్పుడు కొత్తగా రూపొందించిన ప్రాజెక్ట్ గురించిన వివరాలు తెలియజేశాడు. దానికి సంబంధించిన లేటెస్ట్ వెర్షన్ డిజైనర్ అతనే కాబట్టి, దాని గురించి క్లారిటీగా చెబుతున్నాడు.

నందన్ చతురోక్తులతో మాట్లాడుతున్న విధానానికి అందరూ బాగా ఇన్వాల్వ్ అయి వింటున్నారు. వర్కింగ్ మెథడ్ గురించి ఎక్స్‌ప్లెయిన్ చేస్తున్న అతని వాగ్ధాటి మధ్యాహ్నం లంచ్ బ్రేక్ వరకూ కొనసాగుతూనే ఉంది.

వాచ్ వంక చూసుకుని, "ఓకే! వుయ్ విల్ గేదర్ ఆఫ్టర్ అవర్ లంచ్!" అని చిరునవ్వుతో చెప్పి ఆపాడు నందన్.

అందరూ లంచ్‌కి లేచారు. వర్ణ, రాగా కూడా భోజనాలు ఏర్పాటు చేసిన వైపు కదిలారు. ముందుకు నడుస్తూనే నందకిషోర్‌కి ఫోన్ చేసింది వర్ణ.

వెంటనే "హలో!" అన్నాడతను.

రాగా ఒక టేబుల్ దగ్గర కూర్చుండడంతో, తన పర్స్ అక్కడే పెట్టి, ఫోన్ పట్టుకొని పక్కకు వచ్చింది వర్ణ. వాచ్ వంక చూసుకుంటూ, ఇండియాలో రాత్రి పదిగంటలు దాటుతూంటుందని అర్థమై, "నిద్రపోతున్నావా నందూ? " అంది.

"ఊహుఁ! నీ ఫోన్ కోసం వెయిట్ చేస్తున్నాను" అన్నాడు.

"ఈ టైమ్ వరకూ వెయిటింగా! మార్నింగ్ నాకేదో క్లాస్ పీకావ్! ఫోన్ కాల్స్ కోసం తిండీ నిద్రల్ని నెగ్లెక్ట్ చెయ్యకూడదు నందూ! మాకు చెప్పడం కాదు, నువ్వూ హెల్త్ కాపాడుకోమ్మా!" అని అతని మాటలు అతనికే అప్పగిస్తున్నట్టుగా అందామె.

"ఊఁ!" అని దీర్ఘంతీశాడు నందూ.

అలా అనడంలో అతను పడుతున్న లోటు స్పష్టంగా తెలిసింది వర్ణకి. తనకి పగలు, అతనికి రాత్రి.. ఇది కొంచెం కష్టంగా అనిపిస్తోంది. అతని లోటుని అర్థం చేసుకున్నట్టుగా "ఐ మిస్ యూ నందూ!" గాఢానుభూతితో చెప్పిందామె.

అంతే! ఆ వెంటనే, "ఎక్స్‌క్యూజ్ మి!" అని వినిపించి వెనక్కి చూసింది వర్ణ.

వర్ణ చేతిలోని ఫోన్‌ని అప్పుడు చూసి, "ఓహ్! సారీ! నన్ను పిలిచారనుకున్నాను. ప్లీజ్ కంటిన్యూ!" అని గబగబా పక్కకు వెళ్ళిపోయాడు నందన్.

అతని మాటలు అర్థమయ్యీ కానట్టు అనిపించాయి వర్ణకి.

అటునుంచి "ఏమైంది..? " అనడిగాడు నందకిషోర్.

"నథింగ్! ప్రోగ్రాం డిజైనర్ దేనికో వచ్చాడు. వెళ్ళిపోయాడులే!" అంది వర్ణ.

"ఓకే! నీకు లంచ్ టైమ్ అనుకుంటా! కానిచ్చేయ్! మళ్ళీ చేస్తాలే!" అన్నాడతను.

"అలాగేగానీ! ఆంటీ బావున్నారా? ఇప్పుడెలా ఉంది కండిషన్? " అంది వర్ణ.

"ఊఁ! పర్లేదు! రేపు ఒకసారి అమ్మతో మాట్లాడిస్తాలే!" అన్నాడు.

సరేనని బై చెప్పిందామె. ఫోన్ పట్టుకుని రాగా కూర్చున్న లంచ్ టేబుల్ దగ్గ

రకు వచ్చింది. వర్ణ.

ఆమె వచ్చేసరికి రాగా పక్కనున్న ఛెయిర్‌లో నందన్ కూర్చుని ఉన్నాడు.

వర్ణ వంక చిరునవ్వుతో చూస్తూ, "ఏయ్ వర్ణా! మన ఆంధ్రా అతను అని మార్నింగ్ చెప్పానే, ఇతనే నందన్! మనం ఉంటున్న గెస్ట్‌హోమ్స్ స్టార్టింగ్‌లోని థర్డ్ నెంబర్ హోమేనట! అతని కుక్ కూడా ఆంధ్రావాడేనంట. ఈ రోజు మనకి ఆంధ్రా మీల్స్ రుచి చూపిస్తానంటున్నాడు నందన్. అతనికి మనల్ని చూస్తుంటే తన తెలుగు ఫ్రెండ్స్‌ని చూసినట్టు హ్యాపీగా అనిపిస్తోందట!" అంటూ గడగడా చెప్పింది రాగా.

"నైస్ టు మీట్ యు!" అని నందన్‌ని విష్ చేసి, వాళ్ళకెదురుగా కూర్చుంది వర్ణ.

నందన్ ఆమెనే చూస్తూ, "బై మిస్టేక్. మీరు ఫోన్లో నందూ అంటుంటే నన్నే పిలిచారనుకున్నాను. నన్ను ఇలా పిలుస్తారని మీకెలా తెలుసబ్బా! అనుకుని భలే షాక్ అయ్యాను. మా వాళ్ళూ, నా ఫ్రెండ్స్ అందరూ నన్ను నందూ అనే అంటారు" అని ఉత్సాహంగా చెప్పాడు.

చిన్నగా నవ్వింది వర్ణ.

"ఇక్కడ ఉన్నన్ని రోజులూ మీకు అభ్యంతరం లేకపోతే, మీ ఇద్దరూ నాతో పాటు నా హోమ్‌లో ఉండొచ్చు" అన్నాడతను.

వర్ణ వెంటనే విస్తుపోతూ రాగా ముఖంలోకి చూసింది.

రాగా పరిస్థితి కూడా అలాగే ఉంది. ఆమె నందన్ ముఖంలోకి చూసిది.

వాళ్ళిద్దరి ముఖాల్నీ చూసి నవ్వుతూ "ఓహ్! మీరు అమెరికాలో ఉన్నా, ఆంధ్రా కల్చర్‌లోనే ఆలోచిస్తున్నారు. జస్ట్ సింగిల్‌గా ఉంటున్న నాకు మనవాళ్ళు అనే తోడు ఉంటుందనీ, ముగ్గురం కలిసి ఆంధ్రా వెరైటీస్ టేస్ట్ చేయొచ్చనీ, మన ఏరియాల గురించి మాట్లాడుకోవచ్చనీ, ఇలా హాయిగా తెలుగులో బోలెడన్ని కబుర్లూ, డిస్కషన్సూ.. ఇంకా నాకైతే చాలా ఉన్నాయి. కోరికలు! అందుకే.." అని నవ్వాడు.

అతను యాక్షన్ చేస్తూ చెప్పిన విధానానికి నవ్వకుండా ఉండలేకపోయింది రాగా.

"మిమ్మల్ని గెస్ట్‌లుగా ఇన్వైట్ చెయ్యట్లేదు. ఫ్రెండ్స్! వియార్ ఫ్రెండ్స్! అంటూ వాళ్ళిద్దరి వంకా చూశాడు నందన్.

రాగా, వర్ణ ముఖముఖాలు చూసుకున్నారు. వెంటనే రాగా ఏదో అనబోయే లోపే, "కొన్ని రోజులు ఇక్కడే ఉన్నాక, అప్పుడు చూద్దాం!" అంటూ, రాగా ముఖంలో కనిపించిన భావాల్ని చూసి సందిగ్ధంగా ఆగిపోయింది వర్ణ.

నందన్ ఇంట్లో ఉండడానికి సుముఖంగా ఉన్న రాగా... వర్ణ జవాబుకి నుదురు ముడిచి ఆమె వంక కొంచెం విసుగ్గా చూసింది.

నందన్ కళ్ళు గట్టిగా మూసి తెరిచి, పెదవి విరిచాడు. 'ఓకే! పాల్.. యాజ్ యువర్ విష్, మీరు బోయ్స్ అయ్యుంటే, వెంటనే ఓకే డ్యూడ్ అనేవాళ్ళు. ఐ నో యువర్ ఫీలింగ్స్! ఓకే! థ్యాంక్యూ ఫర్ దిస్ మీట్! బై..!" అంటూ ఛెయిర్‌లోంచి లేచాడు నందన్.

రాగా కూడా లేచి నిలబడి, "థ్యాంక్స్ చెప్పాల్సింది మేం నందన్! వెరీ గ్లాడ్ టూ మీట్ యూ!" అని సంతోషంగా అంది.

'తానూ లేచి బై చెప్పాలా? లేవాలా? వద్దా?' అని సంశయంగా అనుకుంటూ, వర్ణ కుర్చీలోంచి లేచి నించుంటుండగానే అక్కడ నుంచి వెళ్ళిపోయాడు నందన్.

రాగా కుర్చీలో ఠపీమని కూర్చుని "స్టుపిడ్! నీకసలు మైండుందా? ఈ శాండ్‌విచ్‌లూ, పిజ్జాలూ, రోల్సూ, కట్‌లెట్‌లూ తినలేక ఒక్కరోజుకే నాలుక పిచ్చెక్కుతుంటే, ఇంకా ఆరు నెలలు ఎలా తినాలే జీనీ! మనకు మనంగా అతనితో ఉండాలనుకున్నామా? నందనే రమ్మన్నాడుగా! అయినా నీకసలు మ్యానర్సే లేదు. మన

మేదో అతని నేటివ్ ప్లేస్ నుంచి వచ్చినవాళ్ళమన్న అభిమానంతో, ఆ రేంజ్‌లో ఉన్న ప్రొఫెషనల్ మన దగ్గరకొచ్చి ఇంత మంచి ఆఫర్‌ని ఇచ్చాడు. అట్‌లీస్ట్ వన్ సెకన్ కూడా ఆలోచించకుండా, నా ఫీలింగ్‌ని క్యాచ్ చెయ్యకుండా, అతని మొహం మీదే వద్దని చెప్పేస్తావా!" అంటూ ఆవేశంతో ఎడాపెడా కేకలేసేసింది.

వర్ణ మొహమాటంగా అటూ ఇటూ చూసింది.

చుట్టుపక్కల వాళ్ళు తమ వంకే వింతగా చూస్తున్నారని గ్రహించిన తర్వాత శాంతించింది రాగా. అయినాసరే వర్ణపై అలిగినట్టుగా ముఖం మాడ్చుకునే ఉంది. సాయంత్రం రూమ్‌కి వచ్చేవరకూ అలాగే ఉంది రాగా. ఆమెని పట్టించుకోకుండా తన పనుల్లో తాను పడింది వర్ణ.

రాత్రి నిద్రపోయే ముందు తన సెల్ ఫోన్ తీసుకుని బాల్కనీలోకి వచ్చి అక్కడ అటూ ఇటూ నడుస్తూ నందకిషోర్‌కి ఫోన్ చేసింది వర్ణ.

"హలో వర్ణా! ఎలా ఉన్నావ్? "

"బాగున్నాను! నువ్వూ..? " అందామె.

"చాలా బావున్నా!"

"కాలేజ్‌కి రెడీ అవుతున్నావా? "

"ఊహుఁ! లీవ్ పెట్టాను. ఫ్రెష్ అయ్యి హాస్పిటల్‌కి వెళతాను. ఈ రోజు నీ విశేషాలేంటీ? "

"విశేషాలా? ఊహుఁ! నథింగ్! ఆఫ్టర్ నూన్ మనం మాట్లాడుకుంటున్నప్పుడు చిన్న డిస్టర్బ్ వస్తే ప్రోగ్రాం డిజైనర్ అని చెప్పానే, అతని పేరు నందన్ అట! అతన్ని అందరూ నందూ అని పిలుస్తారట!" అంటూ, మధ్యాహ్నం నుంచీ జరిగిందంతా చెప్పబోయింది వర్ణ.

కానీ ఈ లోపే, "మనకి తెలిసినవాళ్ళలోనే ఇంతమంది నందూలున్నారా..? " అని నవ్వుతూ అన్నాడు నందకిషోర్.

"ఎంతమందీ! నువ్వూ, ఈ నందన్.. అంతేగా!" అని విస్తుపోతూ అడిగిందామె.

"మా కాలేజ్‌లో కూడా ఒక నందూ.. ఇంగ్లీష్ లెక్చరర్! అదే వర్ణా ఆ రోజు నేనే ఇంటర్వ్యూ చేశా కదా! మిస్ నందిని అనీ! తననీ నందూ అనే పిలుస్తారట!" అంటూ వర్ణకి ఇంటర్వ్యూ చేసిన రోజుని గుర్తు చేస్తూ చెప్పాడు నందకిషోర్.

కనుబొమలు ముడిచి, "ఆ విషయం నీకెలా తెలుసు? " అందామె.

"ఆవిడే చెప్పింది మొన్న"

"మరి నువ్వు నాకెందుకు చెప్పలేదు? "

"ఆ టాపిక్ మన మధ్య రాలేదు"

"అంటే? టాపిక్ వచ్చిన విషయాలే మాట్లాడుకుంటున్నామా మనం!"

"అబ్బా! అది వేస్ట్ టాపిక్ అని నీతో చెప్పలేదు వర్ణా!" అన్నాడతను.

"అంత వేస్ట్ టాపిక్ అయితే మర్చిపోకుండా ఇంకా ఎందుకు గుర్తుంచుకున్నావ్? " అని ఖంగున అడిగింది వర్ణ.

వర్ణ గొంతులో కొంచెం కొంచెం పెరుగుతున్న అసహనాన్ని గ్రహించాడు నందకిషోర్. ఆమె ఆలోచనేంటో అర్థం కాక ఒక క్షణం ఎలర్ట్ అయ్యింది అతని మెదడు.

అతను మౌనం వహించడంతో, "ఆ రోజు నువ్వు స్మార్టన్నప్పుడే నాకు ఏదో తేడా కొట్టింది" అని రోషంగా అంది వర్ణ.

"నేను స్మార్ట్ అన్నానా! ఎవర్నీ? మధ్యలో ఈ టాపిక్ ఏంటీ!? అని అయోమయంగా అడిగాడు నందకిషోర్.

"అంటే స్మార్ట్‌గా హీరోయిన్‌లా ఉందని నువ్వు మెచ్చుకున్న విషయాన్నీ మర్చిపోయావా! సో! అప్పుడు నీ దృష్టిలో అది మంచి టాపిక్ కాబట్టి డిస్కస్ చేశావా? ఇప్పుడేమో ఆ అమ్మాయి పేరు నందూ అని చెప్పడం వేస్ట్ టాపిక్కా? " అంటూ గడగడా ఇంకేదో అనబోయింది వర్ణ.

"ఎహె ఆపు! లొడలొడా నీకు నువ్వే ఏదేదో మాట్లాడి నా బుర్ర తినకు! ఆ అమ్మాయిని నందూ అని పిలుస్తారన్న

విషయాన్ని నేను నిజంగానే పట్టించుకో లేదు. ఇప్పుడు నువ్వు ఈ టాపిక్ తేక పోతే నాకు అసలు గుర్తుకొచ్చేదే కాదు!"

"ఐసీ! ఇందాక ఆవిడ అన్నావు, ఇప్పుడేమో ఆ అమ్మాయి అంటున్నావు.." అంటూ ఏడ్చినంత పని చేసింది వర్ణ.

"ప్చ్! వర్ణా..! ఏం మాట్లాడుతున్నావ్ నువ్వు..? అసలేంటిదంతా..?"

"అంతేలే! వేస్ట్ టాపిక్స్ మాట్లాడుతున్నాను కదా! ఇకనుంచీ నీ ఇష్టం నందూ! నీకు చెప్పాలన్పించిన విషయాల్ని మాత్రమే చెప్పు! అది చెప్పలేదు, ఇది చెప్పలేదు అని ఇంక విసిగించన్లే! ఉంటాను బై..!" అని ఫోన్ కట్ చేసేసింది వర్ణ.

ఆమె మాటలకి దిమ్మెరపోతూ, వెంటనే మళ్ళీ ఫోన్ చేశాడు నందూ.

కానీ, అప్పటికే తన ఫోన్‌ని స్విచ్ఛాఫ్ చేసేసింది వర్ణ.

★ ★ ★

హాస్పిటల్‌లో జాయిన్ చేసిన రెండో రోజుకి కొంచెం తేరుకుంది నందూ తల్లి శ్యామల. ఆమె తలకి తగిలిన దెబ్బకి కుట్లు వేశారు డాక్టర్లు. దెబ్బ తగిలిన వెంటనే హాస్పిటల్‌కి తీసుకురావడం వల్ల ఆవిడని బతికించగలిగామని చెప్పారు.

శ్యామల కళ్ళు తెరుస్తూనే ఎదురుగా కనిపించిన తులసీరామ్‌గారినీ, ఆనందంతో చూస్తూ నిలబడ్డ నందూనీ పక్కపక్కన చూసి నమ్మలేకపోయింది. ఇలాగైనా వీళ్ళిద్దరూ కలిసినందుకు సంతృప్తిపడింది ఆమె మనసు. కానీ.. ఆ వెంటనే గౌరి విషయం గుర్తుకొచ్చింది శ్యామలకి.

తనకి ఏమీ జరగకుండా కోలుకున్నందుకు భర్తా, కొడుకూ సంతోషపడుతుండడాన్ని కళ్ళారా చూసిన తరువాత కూడా ఆనందం కలగడం లేదు. ఎందుకో తన మనసులోంచి గౌరికి సంబంధించిన ఆలోచనల్నీ తీసెయ్యలేకపోతోంది. చెరిగిపోయింది అనుకున్న పాత మచ్చ ఇప్పుడు కొత్తగా రేగి మరింత బాధిస్తున్నట్టుంది.

## కొత్తగాలి...

**పెళ్లి మండపంలో**
**మంత్రాలు తంత్రాలు తూచ్!**
**ఫొటోలు, వీడియోలు క్యాచ్!**

– ధవ్వూరి శ్రీధరాచార్యులు,
సీతారాంబాగ్, హైదరాబాద్

శ్యామల బాగా వీక్‌గా ఉండడంతో మరో నాలుగు రోజులు హాస్పిటల్లోనే ఉంచి ఆవిడ కోలుకున్న తరువాత డిశ్చార్జ్ చేశారు డాక్టర్లు.

ఇంటికి తీసుకొచ్చిన తర్వాతి రోజు, తులసీరామ్‌గారు ఆఫీస్‌లో ఏదో ఇంపార్టెంట్ వర్క్ ఉందని ఏడుగంటలకే వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళగానే టైం చూసుకుంటూ, వర్ణకి ఫోన్ చేశాడు నందూ. ఈ నాలుగు రోజులుగా వాళ్ళిద్దరి మధ్యా పెద్దగా మాటలు లేవు. నిద్ర లేవగానేనో, నిద్రకు ఉపక్రమిస్తూనో ఫోన్ చేసుకుంటూరు. ముక్తసరిగా నాలుగు మాటలు మాత్రం మాట్లాడి ఊరుకుంటున్నారు.

ఈ పూట కూడా అలానే ముభావంగా మాట్లాడింది వర్ణ. క్షేమసమాచారం కనుక్కున్నాక, తల్లిని హాస్పిటల్ నుంచి ఇంటికి తీసుకొచ్చామనీ, తాను అమ్మావాళ్ళ ఇంట్లోనే ఉన్నాననీ చెప్పాడు నందకిషోర్. ఫోన్ తల్లికి ఇచ్చి మాట్లాడించాడు.

తల్లి మాట్లాడిన తరువాత ఫోన్ తీసుకుని హాల్లోకి వచ్చాడు.

"వర్ణా! ఐ యాం సో సారీరా! నిజంగా ఆ విషయాన్ని కావాలని మిస్ చెయ్యలేదు" అని నిదానంగా చెప్పబోయాడు.

"సారీ చెప్పాల్సింది నేనే నందూ! రాగాతో చిన్న క్లాష్ వచ్చి ఆ అనీజీనెస్‌తో

ఏదేదో మాట్లాడేశాను. ఫీలయ్యావా?" అని రియలైజ్ అవుతూ అంది వర్ణ.

"ఎందుకు క్లాష్? ఇప్పుడు ఓకేనా?" అని కంగారుగా అడిగాడు నందూ.

"ఆс!.. అంతా సెటిలయిందిలే!" అంటూ నందన్ అతని ఇంటికి ఇన్వైట్ చేసినప్పుడు రాగాకీ, తనకీ మధ్య జరిగిన డిస్కషన్ అంతా వివరించి చెప్పింది వర్ణ.

అంతా విని, "అతని మీద సాఫ్ట్‌కార్నర్ ఉంటే ఓకే! లేకపోతే అనవసరం!" అన్నాడు నందూ.

"అదేం లేదులే! నిన్న ఈవినింగ్ నేనూ, రాగా, భారతీ, మానుషీ.. నందన్ వాళ్ళ ఇంటికి వెళ్ళాం. హీ ఈజె నైస్ పర్సన్. ఆ ఇంట్లో అతనితో పాటూ అతని కుక్ కూడా కలిసే ఉంటాడట. కుక్ కూడా ఆంధ్రావాడే. పాపం! అతను హ్యాండీక్యాప్డ్ నందూ!" అని చెప్పింది వర్ణ.

"అయ్యో!" జాలిపడ్డాడు నందకిషోర్.

"సర్లే! ఇవన్నీ కాదు. మీ డాడీ ఎలా ఉన్నారు చెప్పు! నీతో బావుంటున్నారా? బాగా మాట్లాడుతున్నారా?" అని ఆత్రుతగా అడిగింది వర్ణ.

"చాలా బాగా ఉంటున్నారు. నేనే నమ్మలేకున్నాను తెలుసా?" ఈ నాలుగు రోజుల తండ్రి ప్రవర్తన గుర్తుచేసుకుంటూ ఉత్సాహంగా చెప్పాడు నందకిషోర్.

అతని ఉత్సాహం చూసి వర్ణ కూడా ఉత్సాహంతో "అవునా! ఇట్స్ సో ఎమేజింగ్ కదా నందూ! అంకుల్ ఆయనంతట ఆయనగా నీకు ఫోన్ చేశారంటే నేను ఇంకా నమ్మలేకపోతున్నాను తెలుసా? ఇలాంటి టైం కోసం ఎంత ఎదురుచూశామో మనం! ఎన్నిసార్లు అనుకున్నామో కదా! ఇప్పుడు చాలా హ్యాపీగా ఉంది నందూ! వెంటనే అక్కడకు వచ్చేయాలనుంది. నేను అక్కడకు రాగానే మనం అత్తయ్యా వాళ్ళతో కలిసి వాళ్ళ ఇంట్లోనే ఉందాం! సరేనా!" అని ఆనందంగా అంది వర్ణ.

"నాన్న ఒప్పుకుంటే!" అన్నాడు నందూ, హాల్లోని కుర్చీలో కూర్చుంటూ.

"ఎందుకొప్పుకోరు? అంకుల్‌కి నేను చెబుతాను!" అని ధీమాగా అంది వర్ణ.

"నువ్వు ప్రత్యేకంగా మళ్ళీ చెప్పడం ఎందుకూ? ఆ రోజు హాస్పిటల్లో మీ డాడీ అంతా దప్పుకొట్టి మరీ మా నాన్నతో చెప్పారుగా!" అని నవ్వాడు.

"అబ్బా! ఎప్పుడూ మా డాడీని కామెంట్ చేస్తావేంటి నందూ!" అలకగా అందామె.

"మామా అల్లుళ్ళు అన్నాక ఆ మాత్రం ఉండాలి కదా!"

"సరేలే! ఆంటీని చూడడానికి వెళ్ళమని డాడీ మమ్మీలకి ఫోన్ చేసి చెబుతాను!" అంది వర్ణ.

"నువ్వు చెప్తేగానీ రారా మీ వాళ్ళు?" అని నవ్వుతూ ఎత్తి పొడిచాడతను.

"ఎప్పుడూ నన్ను టీజ్ చెయ్యడమేనా!"

"అప్‌డేట్ అవ్వకుండా ఉంటే టీజ్ చెయ్యక ఏం చెయ్యాలి? ఆల్రెడీ మీ డాడీ మమ్మీ ఇద్దరూ నిన్న అమ్మని హాస్పిటల్ నుంచి ఇంటికి తీసుకురాగానే వచ్చారు. ఆ విషయం నీకు ఇంకా చెప్పలేదా అంకుల్ వాళ్ళు! నాన్న అయితే మీ డాడీని చూసి షాక్ తెలుసా! మీ డాడీ నీకు అంతా చెప్పేసుంటారనుకున్నానే!" అని ఆశ్చర్యంగా అన్నాడు నందూ.

ఆ మాటలు వినగానే, "నిజమా! మా డాడీ, మమ్మీ మీ ఇంటికి వచ్చారా! అయితే అంకుల్ మనతో కలిసిపోయినట్టేనా? ఎంత గుడ్‌న్యూస్ చెప్పావ్ నందూ! ఐలవ్యూ రా! ఇంక మనకి ఏ ప్రాబ్లెంస్ లేనట్టే! మీ డాడీ, మమ్మీ.. మా డాడీ మమ్మీలతో చాలా హ్యాపీగా ఉండొచ్చు మనం!" అంటూ సంబరపడింది వర్ణ.

"ఊс! వాళ్ళు కలిశారు. మనం దూరమ్యాం!" అని ఒకింత దిగులుగా అన్నాడు నందూ.

"దూరమయ్యాం ఏంటి? మనమేం

రూ. 116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

## ఆకట్టుకున్న పాత్రచిత్రణ!




చతుర జూన్ సంచిక అచ్చుతెలుగు పదహార ణాల అమ్మాయి రోహిత ముఖచిత్రం ఎంతో ఆక ట్టుకుంది. అలపర్తి రామకృష్ణ కలం నుండి వెలు వడిన 'జీవనలిపి' నవల కుటుంబపరంగా, మొదటి నుండి చివరివరకూ ఎంతో చక్కగా సాగిపో యింది. ఈ నవలలో ప్రతి పాత్రను ఒక ఆణిము త్యంగా మలిచారు రచయిత. ఆర్ఫీ ఇంటి పెద్ద బాపయ్యగారిలో ఉన్న మంచితనం, పిల్లలను అర్థం చేసుకున్నతీరు, పూర్వీకులు ఆ గ్రామానికి చేసిన సాయం పిల్లలకు తెలపడం, మనవరాలు అమృత వాటిని చక్కగా అర్థం చేసుకుని ఆమె కూడా అదే సేవాదృక్పథం, సాయం చేసే గుణం అలవర్చుకుని పదిమందికి సేవ చేయాలని టీచర్ వృత్తిని ఎంచు కోవడం.. చక్కగా చెప్పారు.

సమాజంలో జరుగుతున్న అనాగరిక ఆచారం.. ఆడపిల్ల పుట్టబోతుందని తెలిసి అనంత్ భార్య రోహిణిని హింసించడం చూసి అమృత ఆమెకు సాయం చేసి అతన్ని కటకటాల పాలు చేయడం, స్టూడెంట్ కాళింది దారి తప్పిం దని తెలిసి సక్రమమార్గంలో నడిచేటట్లు చేయడం, విఠల్, అనసూయ, వికాస్‌లలో మార్పు, సుగుణ పాత్ర మంచితనం.. ఎంతో బాగా మలిచారు.

సంపూర్ణ, కోటి మధ్యతరగతి వ్యక్తులైనా విశాలమైన మనస్కులు. సంపూర్ణ స్నేహితు రాలు వాసంతి బిడ్డను చేరదీసి దరహాస్, లాలిత్యలతో పాటు ఆ పాపకు కూడా వారి ప్రేమను అందించడం వారి గొప్ప మనస్సులకు తార్కాణం. శివయ్య, రమణిల పాత్రలలో నూ ప్రత్యేకత ఉంది. రమణి కోరికతో తమ కూతుర్ని తీసుకెళ్లాలని కోటి, సంపూర్ణల ఇంటికి వచ్చిన శివయ్య వారు ఆమెకు పంచుతున్న ప్రేమ, ఆదరణకు ముగ్ధుడయ్యాడు. తన బిడ్డ వారి వద్ద ఉంటేనే చక్కటి భవిష్యత్తు ఉంటుందని, మౌనంగా అక్కడి నుంచి నిష్క్రమించడం శివయ్య మంచితనానికి నిదర్శనం.

పట్టుదలతో దరహాస్ ఐ.ఎ.ఎస్., లాలిత్య నర్స్ ట్రైనింగ్ పూర్తిచేయడం, 'హోంకేర్' నిర్వ హణలో ఎదురైన ఇబ్బందులు చక్కగా కళ్లకు కట్టినట్లు చూపారు.

ఎ.వి. రెడ్డిశాస్త్రి అనువాద పెద్దకథ 'కొయ్యగుర్రపు విజేత' ఆర్ద్రంగా ఉంది. తన వద్ద చాలినంత డబ్బు లేదని ఎప్పుడూ విచారిస్తుండే తల్లిని చిన్నతనం నించీ అర్థం చేసుకొన్న కొడుకు పాల్ ఆమెకు డబ్బు అందజేసిన విధానం, అతడి మరణం కంట తడిపెట్టిం చాయి. 'చతురంగం' మెదడు పదును పెంచుతోంది. వంటల శీర్షిక 'చిటికెలో రుచిగా' బాగుంది.

– **పి. సుజాత,** గుంటూరు

దూరమైపోలేదు. దూరంగా ఉన్నాం అను. ఇంకెప్పుడూ అలా అనకు నందూ! నాకు నచ్చదు!" అని అలకగా అంది వర్ణ.

"మళ్ళీ మొదలుపెట్టావా నీ డిక్షనరీ? పోనీ ఓ పని చెయ్ వర్ణా! అలా మాట్లాడ కూడదు అని నువ్వు అనుకుంటున్న వాటి నన్నీటినీ ఓ లిస్ట్‌గా రాయి. బట్టీ పట్టి బ్రెయిన్‌లో ఉంచుకుంటాను" అని నవ్వుతూ అన్నాడు నందకిషోర్.

"జోకులెయ్యకు నందూ! దూరమయ్యాం అంటే ఏవేవో థాట్స్ వస్తున్నాయ్! భయం వేస్తుంది" అని నిదానంగా అంది వర్ణ.

"ఓకే! సరే! ఇంకెప్పుడూ అననుగానీ చాలా టైం అయ్యింది. రెస్ట్ తీసుకో! మళ్ళీ డాడీతో మట్లాడతావేమోగా!" అన్నాడు.

"ఉఁ! ఒకసారి డాడీతో, మమ్మీతో కూడా మాట్లాడతాను. ఉండనా! ఆంటీని జాగ్ర త్తగా చూసుకో!" అంది వర్ణ.

"అలాగే! హావ్ ఎ నైస్ డే! ఒహ్హో! నీకి ప్పుడు నైట్ కదా! గుడ్‌నైట్! బై" అని చెప్పి, ఫోన్ కట్ చేశాడు నందకిషోర్.

★ ★ ★

వర్ణ అమెరికా వచ్చి అప్పుడే రెండు నెలలు గడిచిపోయాయి.

ఆ రోజు సాయంత్రం.. ఆఫీస్ అవర్స్ అవగానే, రాగాతో కలిసి బయటకు నడుస్తూ తండ్రి ప్రతాప్‌కి తల్లి సుమణికీ ఫోన్ చేసింది వర్ణ.

నందన్ కూడా వచ్చి నడుస్తున్న వాళ్ళిద్ద రితో జాయిన్ అయ్యాడు.

తండ్రితో మాట్లాడిన తరువాత ఆయన మాటల్ని బట్టి సెల్‌ఫోన్‌లోని క్యాలెండర్ తీసి చూసింది వర్ణ. 'తాను అమెరికాకి వచ్చి రెండు నెలల పూర్తవుతోంది. ఇంకా నాలుగు నెలలు గడవాలి. గడిచిన దానికి రెండింతలు!' అనుకుంటూ మనసులో లెక్కలు వేసుకుంది వర్ణ.

ఉన్నట్టుండి ఏదో గుర్తు వచ్చి మళ్ళీ కేలండర్‌లోకి చూసింది.

అంతే! మరో రెండురోజుల్లోనే తమ మొదటి పెళ్ళిరోజని గుర్తు రాగానే, ఆమె మనసు ఆనందంతో ఏడాది క్రితంనాటి జ్ఞాపకాల్లో మునిగిపోయింది. ఆ రోజుని తలుచుకుంటుంటే, వర్ణకి ఉద్విగ్నంగా ఉంది. పెళ్ళిరోజు స్టార్టింగ్ మినిట్‌లోనే నందూకి ఫోన్ చేసి, విషెస్ చెప్పాలి అని మనసులో బలంగా అనుకుంది వర్ణ.

ఆమె చేతిలోని ఫోన్‌లోకి తొంగి చూస్తూ, "ఓ! క్యాలెండర్ చూస్తున్నావా! నేను నా రూమ్‌కి ఇన్వైట్ చేసి టూ మంత్స్ అయింది వర్ణా! కొన్ని రోజుల తరువాత వస్తానన్నావ్!" అని నవ్వుతూ వర్ణ ముఖంలోకి చూసి అడిగాడు నందన్.

వర్ణ తల తిప్పి, "వస్తాలే నందన్! ఇంకా ఫోర్ మంత్స్ ఇక్కడే ఉంటాంగా!" అని మొహమాటంగా నవ్వుతూ చెప్పి రాగా వంక చూసింది.

"యాజ్ యువర్ విష్.." అని తన కారుని పార్కింగ్ నుంచీ తీసుకొచ్చాడు నందన్. వర్ణా, రాగా కారులోకి ఎక్కగానే, వాళ్ళు ముగ్గురూ ఉంటున్న గెస్ట్‌హోమ్‌ల వైపు పోనిచ్చాడతను.

★ ★ ★

ఉదయం సాయంత్రాల్లో తల్లికి ఇంటిప నుల్లో సాయం, పగలు కాలేజీ క్లాసులూ, రాత్రుళ్ళు తిరిగి తన ఇంటికి వెళ్ళి పడుకో వడం.. వీటన్నిటి మధ్యా రోజులు వేగంగా గడుస్తున్నట్టు అనిపిస్తోంది నందూకి.

ఉదయం తండ్రి ఆఫీస్‌కి వెళ్ళగానే తల్లితో కలిసి టిఫిన్ చేసి, కాలేజ్‌కి వెళ్ళ డానికి తయారవుతున్నాడు నందూ.

అతను హాల్లోకి వచ్చేసరికి, అప్పటికే గేటు దాటి వరండాలోకి వచ్చిన ఎవరో లోపలకు తొంగి చూస్తుండడం కనిపిం చింది నందకిషోర్‌కి. తెరిచి ఉన్న మెయి న్‌గేట్‌లోంచి లోపలకు వచ్చేసిన ఆవిడ వంక ఆశ్చర్యపోయి చూస్తూ.., "ఎవరండీ? ఎవరు కావాలి మీకు?" అని అడుగుతూ

ఆవిడ దగ్గరకు వెళ్ళాడు నందూ.

అతని వంక తదేకంగా రెండు క్షణాలు చూసిందావిడ. తరువాత "నా పేరు గౌరీ లక్ష్మి. ఇది తులసీ ఇల్లే కదా!" అని సందేహంగా అడిగిందావిడ.

కనుబొమ్మలు ముడిచి "తులసీ అంటే ఆడా? మగా? ఇది తులసీరామ్‌గారి ఇల్లు" అడుగుతూనే చెప్పాడు నందకిషోర్.

ఆ మాటలకి ఆవిడ చిన్నగా నవ్వింది. "తులసీ అంటే తులసీరామే! ఊc! శ్యామలకి మొన్నామధ్య ఏదో దెబ్బ తగలిందని విన్నాను! చూసి వెళదామని వచ్చాను" అని ఇంకా ఏదో చెప్పబోయిందావిడ.

"అమ్మ కోసం వచ్చారా! రండి! ఇంట్లోకి రండి!" అంటూ లోపలకు నడిచాడు నందకిషోర్. లోపలకు చూస్తూ "అమ్మా!" అని గట్టిగా పిలిచాడు.

ఏవో ఆలోచనల్లో ఉన్న శ్యామల గట్టిగా వినిపించిన ఆ పిలుపుకి ఉలిక్కిపడుతూ కంగారుగా బయటకు వచ్చింది.

"నిన్ను చూడడానికి ఎవరో వచ్చారు!" అంటూ, అతని వెనక వచ్చినావిడని చూపించాడు నందకిషోర్.

ఆమెని చూసి ఇరవై ఏళ్ళు దాటినా కూడా తన కళ్ళ ముందు నిలబడింది గౌరీ అని పోల్చుకోవడానికి ఎంతోసేపు పట్టలేదు శ్యామలకి. తనలోని భయాలన్నీ రూపంగా ఏర్పడి, ఒక్కసారిగా తన ముందుకి వచ్చినట్టు అనిపించింది. అంతే! తడబడుతూ కాళ్ళు వణుకుతున్నట్టనిపించి గోడని ఆసరా చేసుకుంది శ్యామల.

ఆవిడని చూస్తూ, "కూర్చోండి!" అని కుర్చీ చూపించి, "మంచి నీళ్ళు తాగుతారా? " అనడిగాడు.

తాగుతానన్నట్టుగా తల ఊపింది. గౌరీని చూస్తుంటే శ్యామలకి గుండెల్లో దడగా ఉంది. ఇన్నిరోజులూ ఆమె మనసులో ఓ మూలన సన్నగా ఉండిపోయిన భయం.. ఇప్పుడు పెరిగి పెద్దదై తనని నిలువెల్లా ముంచేయడానికి ఉప్పెనలా తన ముందుకు వచ్చినట్టు అనిపిస్తోంది.

కుర్చీలో కూర్చుంటూ, "ఎలా ఉన్నావు శ్యామలా? " అని ఖంగుమన్న కంఠంతో అడిగింది గౌరి.

శ్యామలకి గొంతు తడారినట్టు మాట పెగలడంలేదు. గౌరి ముఖంలోకి చూసి, బాగున్నానన్నట్టు కంగారుగా తలూపింది.

నందకిషోర్ వచ్చినావిడకి మంచినీళ్ళు ఇచ్చాడు. తల్లి వంక చూసి "నేను కాలేజ్‌కి వెళ్ళొస్తానమ్మా!" అని చెప్పాడు.

కళ్ళు పెద్దవి చేసి కొడుకు వంక చూసింది శ్యామల.

"సాయంత్రం ఇంటికెళ్ళి ఇటు వస్తాను. కొంచెం లేటయినా కంగారుపడకు! సరేనా!" అని, తల్లి నుంచి ఏ జవాబూ లేకపోయేసరికి "ఏంటి మాట్లాడవు? " అని గట్టిగా అన్నాడు నందకిషోర్.

"ఊc!" అని ఉలిక్కిపడింది శ్యామల.

వెళ్ళొస్తానని తల్లికి మళ్ళీ చెప్పి గౌరితో "వెళ్ళొస్తానండీ!" అన్నాడు నందూ.

"అలాగే!" అని చిన్నగా నవ్వింది గౌరి.

ఇంట్లోంచి బయటకు వచ్చి బైక్ మీద కాలేజ్‌కి వెళ్ళిపోయాడు నందకిషోర్.

★ ★ ★

అమెరికాలో అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటింది సమయం.

నిమిషాలు పన్నెండుని దాటి ముందుకు

## కొత్తగాలి...

**క్రిస్‌గేల్ కొట్టిన సిక్సర్‌తో**
**ఆకాశంలో అతుక్కుపోయిన**
**తెల్లని క్రికెట్ బంతిలా**
**నిండు చందమామ!**

*– అలజంగి మురళీధరరావు,*
పాడేరు, విశాఖ జిల్లా

కదులుతున్నాయి. ఆ అర్ధరాత్రి తేదీ మారి, అక్టోబరు ముప్పై ఒకటి అడుగిడింది.

గాఢనిద్రలో ఉన్న మెదడుకి ఏదో శబ్దం అంతర్లీనంగా తెలిసి, ఒక్కసారిగా కళ్ళు తెరిచింది వర్ణ. కళ్ళు తెరుస్తూనే ఎదుట కనిపించిన ఆకారాల్ని చూసి భయంతో కెవ్వుకెవ్వుమని అరుస్తూనే ఉంది.

కళ్ళముందున్న ఆ వికృత ముఖాల్ని చూడలేక, భయంతో ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుని, బెడ్ మీద వెనక్కి వెనక్కి వెళ్ళిపోయి మోకాళ్ళలో తల దూర్చేసుకుంది.

పట్టలేనంత భయంతో గుండె కొట్టుకునే వేగం రెండింతలు పెరిగి, వర్ణకి ఒళ్ళంతా చెమట్లు పట్టేశాయి.

దయ్యాలు, మంత్రగత్తెల్లా వికృత వేషాల్లో వచ్చిన అందరూ వర్ణలోని భయాన్ని చూస్తూ ఫక్కున నవ్వుతూ కేరింతలు కొట్టారు.

ఒక్కసారిగా గదిలో నవ్వులు వినిపించే సరికి కొంచెం ధైర్యం తెచ్చుకుంటూ మెల్లగా తలెత్తి చూసింది వర్ణ. ఎదురుగా దెయ్యాల మాస్కుల్ని తీసేస్తున్న కొలీగ్స్ కనిపించారు. వాళ్ళలో ఉన్న రాగా కూడా వర్ణని చూసి పడీపడీ నవ్వుతోంది.

వర్ణ తేరుకుంటుండడం చూసి "హ్యాపీ హేలోవీన్‌డే!" అని గట్టిగా అరిచారు అందరూ. తమనందర్నీ చూడగానే వర్ణ భయపడిపోయి కెవ్వుమని అరిచిన విధానాన్ని మళ్ళీ మళ్ళీ తలుచుకుంటూ, ఇంకా నవ్వుతూనే ఉంది రాగా.

ఆమెనలా చూడగానే ఎప్పుడూ రానంత కోపం వచ్చేసింది వర్ణకి.

వర్ణని చూసి గట్టిగట్టిగా నవ్వుతూ "ట్రిక్ ఆర్ ట్రీట్ పూచో.." అంది బషీరున్నీసా.

"షి డజన్ట్ నో దట్ ఫార్మాలిటీ బషీర్!" అని నవ్వుతూనే చెప్పింది రాగా.

రాగాని చూస్తూ మంచం మీద నుంచి చివాలున లేచి, రివ్వున రాగా దగ్గరకి పరిగెత్తుకొచ్చింది వర్ణ. వెంటనే ఆమెని రెండు చేతులతో ఎడాపెడా బాదేసింది. వర్ణ చేతుల్లోంచి తప్పించుకుని గదిలోంచి బయటకు పారిపోయింది రాగా. అయినాసరే! రాగా వెంటపడి మరీ ఆమెని పట్టుకుని కిందపడేసి ఎడాపెడా బాదేసింది వర్ణ.

ఫ్లోర్ మీద బోర్లా ఉన్న రాగా.. వెనక్కి చూస్తూ "నీ ఫ్రెండునే నేను! కొట్టకే కొట్టకే..!" అని బతిమాలింది.

రాగా నడుం మీద కూర్చుని "ఫ్రెండ్‌వా? ఫ్రెండ్‌వా? హెంత భయమేసిందో తెలుసా?" అని రొప్పుతూనే రాగా చేతుల్ని వెనక్కి విరిచి గట్టిగా పట్టుకుని, ఆమె వీపు మీద మరో దెబ్బ వెయ్యడానికి చెయ్యెత్తింది వర్ణ.

హ్యాండీకేమ్‌తో వెనక నుంచి ముందుకు వచ్చి వర్ణని క్లోజప్ చేశాడు నందన్.

అతన్ని చూడగానే కెమెరా కనపడడంతో వర్ణ ఖిన్నురాలైంది. ఇదంతా షూట్ చేశారని అర్థమై ఆమె మొహం నల్లబడింది. ఆ కోపంతో, పళ్ళు బిగించి రాగా వీపు మీద మరో గుద్దు గుద్దింది వర్ణ.

కిలకిల నవ్వులతో వాళ్ళ వెనక బయటకు వచ్చిన వాళ్ళందరూ, వర్ణ రాగాని కొట్టకుండా ఆపుతూ ఆమె చేతుల్ని పట్టుకున్నారు. బలంగా వాళ్లని వదిలించుకున్న వర్ణ.. గబగబా నందన్ దగ్గరకెళ్ళి అతని చేతిలోని కెమెరాని లాక్కోబోయింది.

కెమెరాలోంచి వర్ణ తన వైపు రావడం చూసిన నందన్ వెంటనే రికార్డింగ్ ఆపేసి, నవ్వుతూ వెనక్కి తిరిగి పరిగెత్తాడు.

కోపంతో కాలిని నేలకేసి తన్ని, వెనక్కి తన రూమ్ వైపు వెళ్ళిపోయింది వర్ణ.

వెళ్ళిపోతున్న వర్ణని వింతగా చూస్తూ "షిట్..! ఎస్.. షి డజన్ట్ నో హేలోవీన్ ఫెస్ట్ ఎంజాయ్‌మెంట్.." అని ఆశ్చర్యపోతూ అంది బషీరున్నీసా.

"ఐ టూ బషీర్. బట్ ఐ ఎన్‌జాయ్‌డ్ దిస్ ఫెస్టివల్ ఎ లాట్!" అని, నిదానంగా



కుంటుకుంటూ ఒక అడుగు వేసి, వర్ణ చితక్కొట్టేసిన తన నడుముని మెల్లగా సవరదీసుకుంటూ అంది రాగా.

ఆమె అవస్థని చూస్తూ, జరిగినదాన్నంతా మళ్ళీ గుర్తు చేసుకుంటూ, మిగిలిన వాళ్ళు బిగ్గరగా నవ్వారు.

వాళ్ళని చూసి ఒక మొహమాటపు నవ్వు నవ్వి, రూమ్‌కి వచ్చింది రాగా.

రూమ్‌లోకి వస్తున్న రాగాని పడుకున్నదల్లా లేచి "యూ బ్లడీ..!" అంటూ పక్కనే అందుబాటులో ఉన్న సెల్ ఫోన్‌ని కోపంగా విసిరి కొట్టబోయింది వర్ణ.

"ఆగాగవే! అది పాతిక వేల రూపాయల సెల్లే..!" అని కంగారుగా అంటూ "నన్నే ఇరక్కొట్టేవ్ కదే! సెల్లుని వదిలెయ్యవే! ఇప్పటికే నాల్రోజుల వరకూ లేవలేను. ఇంకెప్పుడూ ఇలాంటి పిచ్చివేషాలు వెయ్యను.." అని ముక్కుతూ మూలుగుతూ బతిమాలింది రాగా.

ఆమె అవస్థని చూసి, తాను కోపంతో నిజంగానే బాగా గట్టిగా కొట్టేశాను అనిపిస్తుంటే కొంచెం తగ్గింది వర్ణ.

"హ్హా..! నా ఖర్మ కాకపోతే అర్ధరాత్రి పూట ఏంటీ తలరాత?" అని నీరసంగా మంచమ్మీద వాలింది రాగా.

మంచం మీద కూర్చునే గుర్రుగా రాగా వంక చూస్తోంది వర్ణ.

"ఈ రోజు నేను బయటకెక్కడికీ రాలేను. పడుకుంటాను. నువ్వు బయటకెళితే లాక్ వేసుకుని వెళ్ళు!" అని బోర్లా పడుకుంటూ అంది రాగా.

నిదానంగా రాగా వైపుకు జరిగి "బాగా నొప్పిగా ఉందా? సారీనే!" అంది వర్ణ.

తల మాత్రం పక్కకు తిప్పి ఓ పిచ్చి నవ్వు నవ్వింది రాగా. "చెయ్యాల్సిందంతా చేసి సారీ ఎందుకు? ఫ్రెండ్‌నని కూడా చూడకుండా, దేశం కాని దేశంలో అందరి ముందూ పడేసి విలన్ని కొట్టినట్టు కొట్టా

వ్! ఎంత ఇన్సల్టింగ్! రేపటి నుంచీ వాళ్ళకి నా మొహం ఎలా చూపించను? " దిగులుగా అంటూ బ్లాంకెట్ కప్పుకుంది.

రాగా మాటలకి వర్ణలోని కోపమంతా కరిగిపోయింది. రాగా చేతి మీద చెయ్యేసి "నన్ను నిద్రలేపి, దెయ్యాల వేషాలతో భయపెట్టారు. ఎంత భయమేసిందో..? గుండె ఆగిపోయినట్టు అనిపించింది తెలుసా? అలా చేస్తే మరి కోపం రాదా? " అని సంజాయిషీగా అందామె.

"నిన్నింకా ఫర్లేదు తల్లీ! నన్ను ఫోన్ చేసి మరీ బయటికి రప్పించి, ఒక్కసారిగా దెయ్యాల వేషాలతో ప్రత్యక్షమై, రోడ్డంతా పరిగెత్తించారు తెలుసా? " అంది రాగా.

"నిజమా!" ఆశ్చర్యంగా అడిగింది వర్ణ.

"అవునే! మిడ్‌నైట్ ఆ భారతి సెల్ ఫోన్ నుంచి నాకు ఫోన్ వచ్చింది. కాల్ ఒకే చేస్తే కట్ అయిపోయింది. నువ్వేమో గుర్రుపెట్టి నిద్రపోతున్నావు. సిగ్నల్ లేదని బయటకు వెళ్ళాను, అంతే! నా వెనక దెయ్యం, నా పక్కన దెయ్యం, నా చుట్టూ దెయ్యాలే..! నా పరిస్థితి ఎలా ఉండి ఉంటుందో చెప్పు!" అంది రాగా.

ఆమె చెబుతున్నది వింటూనే భయపడింది వర్ణ.

"అందరూ కలిసి నిన్ను కూడా భయపెడదామన్నారు. సరేనన్నాను" అని చెప్పి మళ్ళీ ముసుగేసుకుంది రాగా.

"అయినా ఇదేం పిచ్చి వీళ్ళకి! ఛ!" అంటూ మంచం మీద కూర్చుంది వర్ణ.

"పిచ్చి కాదమ్మా! ఇది పూజ చెయ్యడమట! ఒకప్పుడు అమెరికాలో మంత్రగత్తెలు ఎక్కువమంది ఉండేవాళ్ళట! అప్పట్లో రాళ్ళతో కొట్టి ఊర్లోంచి తరిమేసేవారట. ఇప్పుడు ఆ మంత్రగత్తెల సానుభూతిపరులు హేలోవీన్ డే అని మంత్రగత్తెల్ని దేవతగా చేసి ఫెస్టివల్ చేస్తున్నారట!" తాను తెలుసుకున్నదంతా చెప్పింది రాగా.

"మంత్రగత్తెల్ని పూజించే ఫెస్టివల్ కూడానా? " అని నోరు వెళ్లబట్టింది వర్ణ. అంతలోనే ఏదో గుర్తొచ్చినట్టు మళ్లీ రాగా వైపు తిరిగి "నందన్ ఇక్కడికి ఎప్పుడొచ్చాడు? అతని చేతిలో కేమ్ ఉందేంటీ? " అనడిగింది వర్ణ.

"ఒక్కొక్కొళ్ళనీ ఇలా భయపెట్టి, దాన్ని వీడియో తీసి, మళ్ళీ వాళ్ళకి చూపించడం ఇక్కడ మెమరబుల్ మూమెంటట!" చెప్పింది రాగా.

గుండెల్లోని గాలినంతా బయటకొదిలి, "మెమరబుల్ మూమెంటా! ఇట్స్ హారిబుల్ ఎక్స్‌పీరియెన్స్!" కచ్చిగా అంది వర్ణ.

"ఏదో ఒహట్లే! మనకి ఇది, వాళ్ళకి అది" అని నీరసంగా బదులిచ్చింది రాగా.

ఆ మాటలకి పళ్ళు కొరికింది వర్ణ.




**కా**లేజీ క్లాసులు పూర్తిచేసుకుని, తన ఇంటికి వచ్చాడు నందకిషోర్. ఉదయం ఇంట్లో అస్తవ్యస్తంగా పడేసిన వాటిని పైపైన సర్దాడు. టిఫిన్, భోజనాలు అమ్మా వాళ్ళ ఇంట్లోనే అయినా, రోజూ రాత్రుళ్ళు నిద్రపోవడానికి ఇంటికి వచ్చేస్తున్నాడతను.

ఒకసారి వర్ణకి ఫోన్ చేద్దామనుకుంటూ సెల్‌ఫోన్ చేత్తో పట్టుకుని రిలాక్స్‌గా కుర్చీలో కూర్చున్నాడు నందూ. సరిగ్గా అప్పుడే.. ఇంటిగేటు తీసిన చప్పుడైంది.

ఆ శబ్దానికి అప్రయత్నంగానే కిటికీ లోంచి బయటకు చూశాడు. అక్కడ గేటు తీసుకుని లోపలకు వస్తున్న తల్లి కనిపిం

చగానే, షాకింగ్‌గా లేచి, గబగబా మెయిన్ రోడ్ వైపు నడిచాడు.

వెంటనే తలుపు తీసి కంగారుగా తల్లిని చూస్తూ, "అమ్మా! ఏమైంది? " అని ఆదుర్దాగా అడిగాడు నందకిషోర్.

"ఏంలేదు నందూ! ఏమీ అవలేదు! లోపలకు పదా!" అని గోడని ఆసరాగా పట్టుకుని ఇంట్లోకి నడిచింది శ్యామల.

గేటు దగ్గరకెళ్ళి గేటు గడివేస్తూ రోడ్డు మీద అటూ ఇటూ చూసి 'తల్లి ఒక్కతే వచ్చిందా!' అనుకుని ఆశ్చర్యంతోనే ఇంట్లోకి వచ్చాడు నందకిషోర్.

లోపలకు వచ్చి హాల్లో కుర్చీలో కూర్చుంది శ్యామల.

తల్లిముఖంలో ఏదో తేడా తెలుస్తుంటే ఆవిడ పక్కన నేల మీద కూర్చుంటూ "అమ్మా! ఒక్కదానివే ఇలా వచ్చావేంటీ? " అని నివ్వెరపోతూ అడిగాడు నందకిషోర్.

కొడుకు వంక నిర్లిప్తంగా చూసిందామె.

ఆవిడ చూపుల్ని చూడగానే ఏదో అనుమానం వచ్చినవాడిలా "ఇక్కడకి వచ్చినట్టు నాన్నతో చెప్పావా? " అన్నాడు.

ఆ ప్రశ్నకి బదులివ్వకుండా, కొడుకు తల మీద చెయ్యివేసి కదుల్చుతూ "నాకు కొంచెం ప్రశాంతంగా ఉండాలనుంది నందూ!" అని నిస్సత్తువగా అంది శ్యామల.

'ఇక ఈ విషయంలో ఇప్పుడు అమ్మని ఇబ్బంది పెట్టకూడదు! సమయం గడిస్తే అమ్మే చెప్తుందిలే!' అనుకున్నాడు నందూ. ఆవిడ వంక చూసి "సరే! రెస్ట్ తీసుకో!" అంటూ తల్లి చేయి పట్టుకుని లేపాడతను.

నిద్రపోవాలని లేకపోయినా అయిష్టంగానే బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి పడుకుందామె.

తల్లి డిస్టర్బ్ అవకుండా తలుపుని దగ్గరకు వేసి, హాల్లోకి వచ్చాడు. తల్లి ఒక్కతే ఇలా వచ్చిందేంటన్న ఆలోచనలో పడ్డాడు.

అమ్మ.. నాన్నతో గొడవ పడిందా? అనిపించింది. కానీ, తనకి ఊహ తెలిసినప్పటి నుంచీ అలాంటిది జరగలేదని గుర్తొచ్చి ఇంకేం జరిగుంటుందీ అనుకున్నాడు. ఏం జరిగిందో తెలుసుకోవాలన్న ఆదుర్దాతో కుతూహలం ఆపుకోలేక, తండ్రికి ఫోన్ చేసి అడిగేద్దామని జేబు లోంచి సెల్‌ఫోన్ తీశాడు నందకిషోర్.

సరిగ్గా అప్పుడే తమ మామగారు ప్రతాప్ నుంచి కాల్ వస్తూ రింగ్‌టోన్ వినిపించింది. వెంటనే కాల్ ఓకే చేసి, "హలో అంకుల్!" అన్నాడు నందకిషోర్.

"హా నందూ! ఇంట్లోనే ఉన్నావా? ఇంటికి అమ్మ వచ్చిందా? " అన్నారాయన.

అంతే! ఆయన మాటలకి తల గిర్రున తిరిగింది నందూకి. తండ్రికి ఫోన్ చేసి తల్లి గురించి అడుగుదామని అనుకుంటుంటే, అంకుల్ ఫోన్ చేసి అమ్మ తన దగ్గరకు వచ్చిందా అని అడుగుతున్నారేంటీ అని షాకయ్యాడు. వెంటనే తేరుకుని, "అమ్మ ఇక్కడకు వచ్చిందని మీకు ఎలా తెలుసంకుల్? అసలేం జరిగిందీ? " అని ఉత్కంఠంగా అడిగాడు నందకిషోర్.

"చెల్లెమ్మ నాకు ఫోన్ చేశారు. మీకు నందూ ఇల్లు తెలుసు కదా! నన్ను నందూ వాళ్ళింటికి తీసుకెళ్ళగలరా? అనడిగారు. అయ్యో! అదెంతమాట తీసుకెళతాను అన్నాను. ఎట్ ది సేమ్ మినిట్ అక్కడకు వెళ్ళాను. చెల్లెమ్మ అప్పటికే గుమ్మంలో వెయిట్ చేస్తున్నారు. కారులో తీసుకొచ్చాను. నందూ రమ్మన్నాడా అనడిగాను. ఏమీ చెప్పలేదు. ఆమెని ఇంకా ఇబ్బంది పెట్టడం సరికాదని ఇంకేమీ మాట్లాడలేదు. ఇంట్లోకి వచ్చి ఆవిడని నీకు అప్పజెబుతానన్నాను. వద్దన్నారు!" అంటూ, అవతల వైపు నుంచీ ఆయన కూడా విస్తుపోతూనే చెప్పారు.

"థాంక్స్ అంకుల్! అమ్మ వచ్చింది. నేను వివరం కనుక్కుంటాను. థ్యాంక్యూ సో మచ్ అంకుల్!" అని మళ్ళీ మళ్ళీ కృతజ్ఞతలు చెప్పాడు నందూ.

"ఇట్సోకె! టేక్ కేర్ ఆఫ్ హర్!" అని

కొత్తగాలి...

**కాశీకి వెళ్లి**
**'కాలభైరవుడ'ని పూజిస్తాం!**
**మరునాడు ఎదురైతే**
**గ్రామసింహమంటూ ఛీత్కరిస్తాం!**

– ముదిగొండ అరుణరేఖ,
ఎల్.బి. నగర్, హైదరాబాద్

చెప్పి ఫోన్ కట్ చేశారాయన.

చిన్నగా నిట్టూర్చి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు నందూ.

రాత్రి పదిగంటలవుతుంటే తులసీరామ్ గారు నందూకి ఫోన్ చేశారు.

సరిగ్గా అప్పుడే.. తల్లితో కలిసి భోజనం చేసి, ఆవిడని బెడ్‌రూంలో పడుకోమని చెప్పి హాల్లోకి వస్తున్నాడు నందూ. ఫోన్‌లో తండ్రి ఫోన్ నెంబర్ చూడగానే, వెంటనే వెనక్కొచ్చి తండ్రి ఫోన్ చేస్తున్నా రంటూ ఫోన్‌ని తల్లికి ఇచ్చాడు.

దాన్ని తీసుకోకుండా "నేను ఇక్కడకొచ్చి నట్టు అస్సలు చెప్పొద్దు!" అని స్థిరంగా అంది శ్యామల.

తల్లి వంక నివ్వెరపాటుతో చూసి, ఫోన్ కాల్ ఓకే చేశాడు. "హాలో!" అనగానే "అమ్మ అక్కడకు వచ్చిందా?" అనడిగారు తులసీరామ్‌గారు.

తల్లి వంక చూస్తూ, "రాలేదు నాన్నా!" అని తడబడుతూ చెప్పాడు నందూ.

"సాయంత్రం ఇంట్లోంచి బయటకు వెళ్ళిందట! ఇప్పటి వరకూ రాలేదు నందూ!" అని సంశయంగా అన్నారాయన.

"అమ్మ ఒక్కర్తే ఎందుకు వెళ్ళుంటుంది?" అని ఏం జరిగిందో తెలుసుకోవా లన్న కుతూహలంతో అడిగాడు నందూ.

"మీ అమ్మ నీ దగ్గరకు వస్తే వెంటనే నాకు ఫోన్ చెయ్యి నందూ! మర్చిపోకు! వుంటాను!" అని, ఏం జరిగిందో చెప్పడానికి ఇష్టపడనట్టుగా ఫోన్ కట్‌చేశారు తులసీరామ్‌గారు.

అటు తల్లీ చెప్పక, ఇటు తండ్రీ చెప్పక పోవడంతో, వాళ్ళిద్దరి మధ్యా ఏం జరిగి ఉంటుందో తెలుసుకునే అవకాశం లేక నిస్సహాయంగా హాల్లోకొచ్చి సోఫాలో కూలబడ్డాడు నందూ.

ఎందుకో ఉన్నట్టుండి హఠాత్తుగా.. 'బయటకు వెళ్ళిందట' అన్న తండ్రి మాటలు గుర్తొచ్చాయి నందూకి. అలా అని నాన్నకి ఎవరు చెప్పారు అని సంశయంగా అనుకున్నాడతను.

★ ★ ★

ఉదయం పదిగంటలు అవుతోంది సమయం. సుమణి బ్యాంక్‌కి బయల్దేరడానికీ, ప్రతాప్‌గారు తన ఆఫీస్‌కి బయల్దేరడానికీ సిద్ధమవుతున్నారు.

ఇంట్లోంచి బయలుదేరే ముందు భార్యని ఆపి "శ్యామలతో మాట్లాడే విషయం గురించి ఇంకొక్కసారి ఆలోచించగూడదూ..!" అన్నారు ప్రతాప్‌గారు.

శ్యామల ఒంటరిగా ఆమె కొడుకు దగ్గరకు వచ్చేసిన విషయం నిన్న వినగానే షాక్ అయ్యింది సుమణి. కానీ ప్రతాప్ గారు చెప్పినట్టుగా చెయ్యడానికి ఆమె మనసు అంగీకరించలేదు. వెంటనే తన అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ "ఏ భార్యాభర్తల విషయాల్లోనూ పరాయివాళ్ళు కల్పించుకోకూడదు ప్రతాప్!" అని కచ్చితంగా చెప్పింది సుమణి.

"పరాయివాళ్ళు ఎవరు సుమణీ? శ్యామల మనమ్మాయికి అత్తగారు, నాకు చెల్లెల్లాంటిది. పాపం! పర్టిక్యులర్‌గా నాకు ఫోన్ చేసి, మన అల్లుడి దగ్గర దింపమని చెప్పిందంటే అర్థమేంటి? శ్యామల మనల్ని పరాయివాళ్ళుగా భావించట్లేదు" అనని కన్విన్సింగ్‌గా అన్నారు ప్రతాప్‌గారు.

"నీకు అర్థం కావట్లేదు ప్రతాప్. మనిద్ద

రికీ ఏదైనా చిన్న క్లాష్ వస్తే, ఎవరో నీ దగ్గరకొచ్చి, మీమధ్య ఏం జరిగిందీ? గొడవపడ్డారా? అని అడగడం నీకు ఎంత ఇన్సల్ట్‌గా ఉంటుందో? ఊహించు!" అని భర్తకు నచ్చచెప్తున్నట్టుగా అంది సుమణి.

"అలాగని అలా ఎలా వదిలేస్తాం సుమణీ? కనీసం ఇప్పుడు మన వర్ణ కూడా ఆ ఇంట్లో లేదు. ఆడవాళ్ళ ప్రాబ్లెంస్ ఆడవాళ్ళతో అయితేనే త్వరగా షేర్ చేసుకుంటారు కదా! నిన్న తులసీరామ్‌గారింట్లో ఎవరో ఒక కొత్తావిడ ఉంది. ఆయన చూస్తేనేమో అలాంటివారిలా లేరు. కానీ, ఎందుకో చెల్లాయి ముఖం చూశాక అనుమానంగా అనిపిస్తోంది. ఆయనేదైనా తప్పుచేస్తే, అడిగే హక్కు కాదు, అడగాల్సిన బాధ్యత ఉంది మనకి. అందుకే నువ్వు ఈ రోజు ఈవినింగ్ డ్యూటీ ఫినిష్ కాగానే బ్యాంక్ నుంచీ నందూ ఇంటికి వెళ్ళు.." అని గంభీరంగా చెప్పారు ప్రతాప్‌గారు.

భర్త మాటలకి ఆశ్చర్యపోయి చూస్తూ తల ఊపింది సుమణి.

★ ★ ★

సాయంత్రం హఠాత్తుగా ఇంటికి వచ్చిన అత్తగారు సుమణిని చూసి ఆశ్చర్యపోయాడు నందకిషోర్. అతనూ అప్పుడే కాలేజ్ నుంచి వచ్చాడు.

ఆవిడని ఇంట్లోకి ఆహ్వానిస్తూనే "అంకుల్ రాలేదా ఆంటీ? " అనడిగాడు.

సుమణి వస్తూ "అంకుల్‌కి వీరప్రతాపుడి పేరు పెట్టారుగానీ, ఆయన కృష్ణుడు నందూ!" అని చిరునవ్వుతో అంది.

"మీరు చెప్పింది నాకు ఏం అర్థం కాలేదండీ! కృష్ణుడు అంటే..? కృష్ణలీలలా? " అని అనుమానంగా అడిగాడు నందూ.

"అలాంటిది కాదులే! కృష్ణుడంటే వెనక ఉండి అందర్నీ నడిపిస్తాడని! సరేగానీ, అమ్మ వచ్చారట.. ఏరీ..? " అడుగుతూనే బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది సుమణి. అక్కడ మంచం మీద పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్న శ్యామలని చూసి, "బాగున్నారా వదినా? " అంటూ వచ్చి మంచం మీద కూర్చుందావిడ.

"బావున్నాను!" అంటూ లేచి కూర్చుంది శ్యామల. సుమణి రాకలోని ఆంతర్యం అస్పష్టంగా అర్థం చేసుకుంది ఆమె.

భర్త చెప్పిన విషయాన్ని ఎలా కదపాలో తెలీక మొహమాటపడుతూ "నాలుగు రోజులు మా ఇంటికి రండి వదినా!" అంది సుమణి.

"మిమ్మల్ని శ్రమ పెట్టడమెందుకండీ! నాలుగు రోజులు నందూతో గడిపి వెళతాను" అని చెప్పింది శ్యామల.

ఆవిడ మాటల్లోని 'నాలుగు రోజుల్లో తిరిగి వెళతాను' అన్న అంతరార్థాన్ని గ్రహించింది సుమణి. ఇంకా ఆ విషయం గురించి రెట్టించి అడగడానికి ఆమెకి ధైర్యం చాలలేదు. ఒక అరగంట కూర్చుని ఆ విషయాలూ, ఈ విషయాలూ మాట్లాడింది. తరువాత వర్ణకి ఫోన్ చేద్దామనుకుని, ఈ సమయానికి వర్ణ అక్కడ మంచి నిద్రలో ఉంటుంది, దాని నిద్రని పాడు చేయడమెందుకుని ఆగిపోయింది.

శ్యామలకీ, నందూకీ జాగ్రత్తలు చెప్పి తిరిగి వెళ్ళిపోయింది సుమణి.

ఆమె కోసం పక్క వీధిలోనే ఎదురు చూస్తున్న ప్రతాప్‌గారు సుమణి కారు తెచ్చి ఆపగానే అందులో ఎక్కారు.

"ఏం జరిగిందంట? వాళ్ళింట్లో ఉన్న ఆ కొత్తావిడెవరు? " అని ఆత్రుతగా భార్యని అడిగారు ప్రతాప్‌గారు.

"అన్ని విషయాలు అడిగేంత అవకాశం నాకు ఇవ్వలేదావిడ. నేను ఏమీ మాట్లాడక ముందే, నాలుగు రోజులు నందూతో గడిపి వెళతానని చెప్పేశారు. తరువాత కూడా గుచ్చిగుచ్చి ఆవిడ పర్సనల్ విషయాలు అడగాలంటే భయం వేసింది. అయినా ఆవిడ నువ్వనుకుంటున్నంత

అబల కాదు పెతాప్! చాలా లోతయిన మనిషి! నీకు ఫస్ట్ నుంచీ చెబుతూనే ఉన్నాను. మొగుడూ పెళ్ళాల విషయాల్లో వేలు పెట్టకూడదని. ఆవిడ నన్ను ఏమను కుందో ఏమో! ఛ!" అంటూ, కారు డ్రైవ్ చేస్తూనే భర్తని విసుక్కుంది సుమణి.

సుమణి వంక చిత్రంగా చూశారు ప్రతాప్‌గారు. "నేనొకణ్ణి దొరుకుతాను, నా మీద అరవడానికి ఎంత ధైర్యం వస్తుం దో? చూడు! చెల్లాయిని అప్ట్రాల్ ఏం జరి గింది? అని అడగలేకపోయావ్. ఎవ రన్నా భయమే, వణికిపోతావ్, నోట్లోంచి మాటరాదు. ఆరడుగుల మొగుడి మీద మాత్రం నోరేసుకుని అరుస్తావ్!" అని అక్కసుగా అన్నారాయన.

"ఇదుగో పెతాపూ! నాకు కోపం తెప్పిం చకు! నేను నీకు ఏ పనినీ చెప్పట్లేదు. నువ్వూ నాకు ఏ పనీ చెప్పకు!. ఏం చెయ్యాలంటే అది నువ్వే చేసుకో!" అంటూ భర్త మీది కసురుని ఆ కోపం కారు వేగం మీద చూపించింది సుమణి.

ఆ వేగానికి సీట్లో ముందుకు తూలి, 'వాట్ ఎ పిటీ! నీ పిచ్చి డ్రైవింగ్‌తో నన్నే భయపెడతావా? ఇది నీ కారు అనా? నాకు తెలుసు నీతో పెట్టుకుంటే ఇలాగే అవుతుందని. అందుకే బయల్దేరే ముందే నా కారులో వద్దామని అన్నాను' అని గొణుగుతున్నట్టుగా తనలో తనే అను కుంటూ, భార్య వంక చూశారాయన.

★ ★ ★

అమెరికాలో.. మిట్టమధ్యాహ్నం అవు తోంది సమయం.

రాగా కొలీగ్స్‌తో కలిసి హేలోవీన్ లంచ్ పార్టీకి వెళ్ళడంతో, వర్ణ ఒక్కతే రూమ్‌లో రిలాక్స్‌గా బెడ్ మీద వాలి, టేబుల్ మీదున్న లాప్‌టాప్‌లోకే చూస్తోంది.

కంపెనీలో మూడొంతుల మంది స్టాఫ్‌ని దెయ్యం, మంత్రగత్తెల మాస్కులతో భయపెడుతూ తీసిన వీడియో అది. అం దులో ప్రతి ఒక్కరూ భయపడుతున్నారు. ఒక్కొక్కరి భయం ఒక్కోరకంగా ఉంది.

భయపడేవారివీ, భయపెడుతున్న మిగి లిన వాళ్ళవీ రకరకాల ఎక్స్‌ప్రెషన్లతో కొన్నిచోట్ల బాగా నవ్వించేలా ఉంది ఆ వీడియో. కొందరు భయంతో ఏడ్చేశారు కూడా! వర్ణ ఒక్కతె మాత్రం మొదట భయపడినా, తర్వాత రాగా వెంటపడి మరీ ఆమెని చితక్కొట్టేసింది.

వర్ణకి ఆమె భయపడిన క్షణంలో పట్ట రానంత కోపం కలిగినా, ఇప్పుడు ఆ వీడి యోనీ, తన ఆవేశాన్నీ చూస్తుంటే ఆ కోప మంతా పోయింది.

ఆ హేలోవీన్ వీడియోని ఇప్పుడు మళ్ళీ ప్లే చేసి చూస్తోంది వర్ణ. ఒళ్ళు తెలియ నంత ఆవేశంలో తాను చేసిన పనిని చూస్తుంటే, మిగిలినవారితో పాటూ ఆమె పెదవులపై కూడా నవ్వులు పూస్తున్నాయి.

ఆ వీడియోలోని తన క్లిప్పింగ్‌ని కట్ చేసి నందకిషోర్‌కి పంపించింది వర్ణ. అదే వీడియోని తల్లిదండ్రులకీ ఫార్వర్డ్ చేసింది. నందూ రెస్పాన్స్ కోసం, అతని ఫోన్ కోసం ఎదురు చూడసాగిందామె.

అర్ధగంట కూడా గడవకముందే ప్రతాప్ గారు ఫోన్ చేశారు. "హలో!" అంటూ నవ్వేశారాయన. పలకరింపులోనే నవ్వు గొంతులో తెలుస్తుంటే, తండ్రి ఆ వీడియో చూశారని అర్థమైంది వర్ణకి.

గ్రైండర్‌లో పప్పు వేసి వచ్చిన సుమణి ఆయన చేతిలోంచి ఫోన్ తీసుకుని "నిద్ర పోబోయే ముందు భలే ఫన్ వీడియో చూపించావ్!" అంది నవ్వుతూ. ఆవిడ మాట్లాడి వెళ్ళిన తరువాత "పాపం రాగాని అలా కొట్టేశావేంట్రా బంగారుతల్లీ!" అంటూ నవ్వారు ప్రతాప్‌గారు.

తల్లిదండ్రుల మాటలకి చాలా సంతో షంగా అనిపించింది వర్ణకి.

"నందూకి వీడియో పంపించావా? అన డిగారు ప్రతాప్‌గారు.

"ఎస్ డాడీ! బట్ ఇంకా రెస్పాన్స్ రాలేదు" అని నిరాశగా అంది వర్ణ.

"బంగారుతల్లీ! నువ్వు ఫీల్ అవనంటే నీకొక మాట చెప్తానురా!" అన్నారాయన.

కొంచెం గంభీరాన్ని నింపుకొన్న ఆయన గొంతుకి ఆశ్చర్యపోతూ, "చెప్పండి డాడీ! మీరు ఏం చెప్పినా నేను ఫీలవను! చెప్పండి!" అని కొంచెం ఆసక్తిగా అంది వర్ణ.

"అదీ! నువ్వు వీడియో పంపించావ్ కదా! అంతా బానే ఉందిగానీరా ఒకసారి నీ వేరింగ్ చెక్ చేసుకో! మన అప్పియరెన్స్ ఎదుటివారికి ఏరకమైన అవకాశం, అధికారం ఇవ్వకూడదు బంగారుతల్లీ!" అని ఆయన ఇంకా చెప్పబోతున్నారు.

వెంటనే వర్ణ ఆయన మాటలకు అడ్డు వస్తూ "ఎస్ డాడీ! వీడియో చూసినప్పుడే అనుకున్నాను. బట్ అది నైట్.. నేను వేసుకున్నది నైట్‌వేర్. వాళ్ళు నాకు తెలీకుండా వీడియో తీశారు. అందుకే అలా ఉంది. నాతోపాటూ ఉన్న వాళ్ళ బట్టలు కూడా అలాగే ఉన్నాయిగా డాడీ!" అంది.

"ఎస్‌రా వర్ణా! కానీ కొంతమంది బాగా వీక్‌గా ఉన్నవాళ్ళు ఎలాంటివి వేసుకున్నా ఫిజికల్‌గా అంత డిఫరెన్స్ తెలీదు. కానీ వైట్ ఫెయిర్, కొంచెం బాగున్నవాళ్ళు నూలు బట్టలు వేసుకున్నా చూపు వాళ్ళ మీద పడుతుంది. అలాంటిది నైట్‌వేర్స్, షార్ట్‌గౌన్స్ వేస్తే ఎలా ఉంటుంది?" అంటూ చెప్తున్న ప్రతాప్‌గారు కూతురు వైపు నుంచి ఏ రెస్పాన్స్ రాకపోయేసరికి చెప్పడం ఆపారు.

వర్ణ ఏమీ మాట్లాడకుండా సైలెంట్ అయిపోయింది.

బాగా హార్డ్‌వర్క్ చేసి, ఆన్‌సైట్ అవకాశం తెచ్చుకుని యూఎస్ వెళ్ళేంత ఎదిగిన కూతురుకి తాను మరీ చిన్నపిల్లకి చెప్తున్నట్టుగా ఓవర్‌గా చెబుతున్నానా.. అన్న ఆలోచన రావడంతో తన ఎమోషన్ల లోంచి బయటకు వచ్చారాయన.

"లీవిట్ బంగారుతల్లీ! లీవిట్! నువ్వా పెద్దదానివయ్యావు. ఇవేం నీకు తెలియని విషయాలు కాదు కదా! జస్ట్ నీ ఫాదర్‌గా కొంచెం ఎలర్ట్ చేస్తున్నాను. లీవిట్! టేక్ కేర్! ఇంకేంటి?" అంటూ ఆయనే టాపిక్‌ని డైవర్ట్ చేశారు.

తండ్రితో ఇంకాసేపు మాట్లాడి ఫోన్ కట్ చేసింది వర్ణ. తండ్రి మాటల్ని గుర్తు చేసుకుంటూ ఉండగానే తలుపు చప్పుడు వినిపించింది. రాగా అయ్యుంటుంది అనుకుంటూ వెళ్ళి తలుపు తీసిందామె.

ఎదురుగా నందన్ కనిపించేసరికి ఒక్కసారిగా తడబడింది వర్ణ.

"హాయ్ వర్ణా!" చిరునవ్వు నవ్వాడతను.

అతని వంక ప్రశ్నార్థకంగా చూసింది.

ఆమెనే చూస్తూ "మే ఐ కమిన్?" అని నవ్వుతూనే అన్నాడు నందన్.

ఎందుకన్నట్టుగా చూస్తూ సంశయిస్తూనే డోర్ పక్కకు జరిగింది.

నందన్ లోపలకు వచ్చి, అతని చేతిలోని పేక్డ్ స్వీట్స్‌ని, ఫుడ్స్‌ని టేబుల్ మీద పెట్టాడు. వర్ణ దగ్గరకు వచ్చి, "ఐయాం వెరీవెరీ సారీ వర్ణా! ఇంతగా హర్ట్ అవుతావనుకోలేదు. నేను ఇక్కడ ఉంటుండడంతో ఇలాంటి ఫన్నీ గేమ్స్ నాకూ అలవాటైపోయాయి. అందరిలా నువ్వూ క్యాజువల్‌గా తీసుకుని ఆ మూమెంట్‌ని ఎంజాయ్ చేస్తావనుకున్నాను. ఐయాం రియ

## కొత్తగాలి...

**పెళ్లంటే కొత్తబంగారు లోకంలో**
**తేలి ఆడటం కాదు**
**కొత్త బాధ్యతల్ని పంచుకోవడం!**
**మమతానుబంధాల్లో**
**ఇమిడిపోవడం!**

– గిడుగు లక్ష్మీదత్, హైదరాబాద్



లీ సారీ! వన్స్ ఎగైన్ పాల్..!" అని మన స్ఫూర్తిగా బాధపడుతూ చెప్పాడు నందన్.

"ఇట్సోకే!" ముక్తసరిగా అందామె.

"ఊహుం! నువ్వు ఇలా కోపంగా ఉంటే నాకు చాలా గిల్టీగా ఉంటుంది"

"ఇట్సోకె నందన్! నాకు కోపమేం లేదు!" స్థిరంగా చెప్పిందామె.

వర్ణకి దగ్గరగా వచ్చి ఆమె కళ్ళలోకి చూస్తూ, "హే పాల్! ఒక చోట్నుంచి వచ్చిన వాళ్ళం, ఇలా మనలో మనం డిస్ప్యూట్స్‌తో ఉంటే మిగిలిన వాళ్ళకి చాలా అగ్లీగా ఉంటుంది. ఓకే! నీకు నా మీద కోపం లేదని నమ్ముతా! ఎప్పుడో తెలుసా? నువ్వూ, రాగా నా దగ్గరకి గెస్ట్‌లుగా వచ్చి ఉంటే!" అన్నాడు నందన్.

కళ్ళు చిట్లించి ఏదో అనబోయింది వర్ణ.

కానీ, ఆమెకా అవకాశం ఇవ్వకుండా "ఐ యాం వెయిటింగ్ ఫర్ యూ విత్ హార్ట్ ఫెల్ట్ వెల్‌కం!" అంటూ బయటకు వెళ్ళిపోయాడు నందన్.

★ ★ ★

వర్ణ పంపిన వీడియో చూసినప్పటి నుంచీ నందకిషోర్ మనసు మనసులో లేదు.

అతన్ని కలవరపెట్టింది వర్ణ వీడియో కాదు, దానితోపాటు పంపిన మెసేజ్.

'హౌ ఈజ్ దిస్ హేలోవీన్ వీడియో నందూ.. దిసీజ్ టేకెన్ బై నందన్..' అన్న మెసేజ్‌ని మరోసారి చదివి, మళ్ళీ వీడియోని ప్లే చేశాడు నందకిషోర్.

క్లోజప్‌లో నిశ్చింతగా నిద్రపోతున్న వర్ణ ఒన్‌సైడ్ ముఖం.. పాలలాంటి బుగ్గలతో అమాయకంగా కనిపిస్తున్న ముఖం మీద నుంచి కిందకి కదులుతోంది కెమేరా.

పక్కకు తిరిగి ఉన్న వర్ణ శరీరం ఎత్తు పల్లాలతో, ఆకర్షణీయంగా కనిపిస్తోంది. ఆ ఎత్తుపల్లాల మీద నుంచి వర్ణ నున్నని పాదాల వద్దకి వచ్చి ఆగిన కెమేరా అక్కడ కొన్ని సెకన్స్ ఉండి, ఆమెని పూర్తిగా కవర్ చేసింది.

ఒక్కసారిగా మేల్కొన్న వర్ణ.. గట్టిగా అరవడం, అరుస్తూ బెడ్ మీద వెనక్కి జరిగి కూర్చోవడం, ఆ క్షణంలో త్రీఫోర్త్ ఉన్న నైట్ గౌన్‌లోంచి ఆమె కాలిపిక్కలు కనిపించడం, ఆ వెంటనే నవ్వుతున్న



వాళ్ళందర్నీ చూసి.. వర్ణ ఉడుక్కుంటూ మంచం మీద నుంచి లేచి రావడం, రాగా వెంట పడి ఆమెని కింద పడేసి కొడుతు న్నప్పుడు.. వర్ణ శరీరపు కదలికలూ, స్పష్టంగా కనిపిస్తున్న ఎత్తయిన ఎద, వంపు తిరిగిన వర్ణ మెడ.. అన్నీ నందూలో కలవరాన్ని రేపుతున్నాయి.

ఆ వీడియోలో వర్ణ ఫీలింగ్స్ నేచుర ల్‌గా ఉన్నా, ఆ వీడియో మాత్రం చాలా అన్నేచురల్‌గా అనిపించింది అతనికి. ఆ నందన్ అనేవాడు కావాలనే వర్ణ శరీరం లోని కొన్ని పార్ట్స్ మీద కాన్‌సెన్‌ట్రేషన్ చేశాడని బలంగా అనిపించింది. అలా ఉన్నది కొన్ని సెకన్ల సమయమే అయినా, వాటిని తీసిన యాంగిల్స్ మాత్రం నచ్చడం లేదు నందూకి.

ఆ వీడియో గురించి వర్ణకి ఏమని చె ప్పాలో అర్థంకావడం లేదు. ఓ వైపు తల్లి విషయం పజిల్‌లా ఉంటే, మరోవైపు వర్ణ పంపిన వీడియో గజిబిజిగా అనిపిస్తోంది.

అవే ఆలోచనలతో సరిగా నిద్ర కూడా పట్టలేదు నందూకి. ఉదయాన్నే సెల్ చూసిన అతనికి హే లోవీన్ వీడియో ఎలా ఉందంటూ వర్ణ ఇచ్చిన మెసేజ్‌లు మరింత అస్థిమితాన్ని కలిగించాయి.

నిదానంగా సోఫాలో నుంచి లేచి, గోడ గడియారం వంక చూశాడు. ఉదయం ఏడు గంటలు అవుతోంది.

'అమ్మో! ఇంత టైమైందా? ఇంకా అమ్మ లేవలేదేంటీ?' అనుకుంటూ గబగబా తల్లి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు నందూ.

శ్యామల మంచం మీద పడుకునే ఉంది. తల్లి దగ్గరకెళ్ళి "అమ్మా!" అని పిలిచిన రెండుసార్లకు నిదానంగా కదిలిందామె.

కంగారుగా తల్లి నుదుటి మీద చెయ్యి వేసి చూశాడు. సలసలా కాలుతున్నట్లు వేడిగా ఉంది ఆవిడ నుదురు.

కంగారుపడి, ఇంటి ఓనర్‌గారి భార్యని పిలిచి, తల్లిని చూస్తుండమని చెప్పి బైక్ మీద వెళ్ళి ఆ వీధిలోనే ఉన్న క్లినిక్ నుంచి డాక్టర్ని వెంటబెట్టుకొచ్చాడు నందూ.

ఆయన శ్యామలని పరీక్షించి ఒక ఇంజెక్షన్ చేసి, కొన్ని టాబ్లెట్లు రాసిచ్చారు. "ఆవిడ చాలా వీక్‌గా ఉన్నారు. కేర్ తీసుకోండి!" అన్నారు డాక్టర్. ఆయనని తీసుకెళ్ళి దించి వస్తూ హోటల్ నుంచి పాలూ, ఇడ్లీ తీసుకొచ్చాడు నందూ.

అతనే తల్లికి బ్రష్ చేయించి, టిఫిన్ పెట్టాడు. వెంటనే పాలు కాచి, గోరువెచ్చని పాలతో ట్యాబ్లెట్లు వేశాడు. అతనూ ఫ్రెష్షయి తల్లి దగ్గర కూర్చున్నాడు. ట్యాబ్లెట్లు వేసుకోవడం వల్లో? నీరసం వల్లో? కొన్ని నిముషాలకి కళ్ళు బరువెక్కుతుంటే, మత్తుగా కళ్లు మూసుకుంది శ్యామల.

నందూ కాలేజీకి ఫోన్‌చేసి నాలుగు రోజులు లీవ్ అడిగి, తన క్లాసుల్ని వేరే సబ్జెక్ట్స్‌కి ఎడ్జెస్ట్ చెయ్యమని చెప్పాడు.

తరువాత నిద్రపోతున్న తల్లి వంక చూస్తుంటే ఎందుకో హఠాత్తుగా అతనికి తమ ఇంటికి వచ్చిన గౌరీలక్ష్మి అనే కొత్తావిడ గుర్తొచ్చింది. ఆవిడ గురించి తల్లిని నిద్ర లేవగానే అడగాలి అనుకుంటూ, కిచెన్‌లోకి నడిచాడు నందూ.

★ ★ ★

నందూ నుంచి కనీసం మెసేజ్‌గానీ, ఫోన్‌గానీ రాకపోవడంతో 'అతను అప్పటికే నిద్రపోయి ఉంటాడు, అందుకే చూసుండడు' అనుకుంది వర్ణ. కానీ ఇన్ని గంటలు గడిచినా నందూ నుంచి రెస్పాన్స్ రాకపోవడంతో, చూసిచూసీ వర్ణే అతనికి ఫోన్ చేసింది. చేసిన వెంటనే, "నేను పంపిన వీడియో చూశావా..? " అని ఉత్కంఠగా అడిగిందామె.

"ఏదో వీడియో వచ్చిందిగానీ, చూడలేదు. రిలాక్స్‌గా చూస్తాలే వర్ణా! అమ్మ మనింటికి వచ్చింది. కొంచెం తగ్గేవరకూ ఇక్కడే ఉంటుందనుకుంటున్నాను" అని గంభీరంగా అన్నాడు నందూ.

"అత్తయ్య మన ఇంటికి వచ్చారా? ఎప్పుడూ? నువ్వే అత్తయ్యా వాళ్ళ ఇంట్లో ఉంటున్నానని చెప్పావ్‌గా!" అని ఆశ్చర్యపోతూ అడిగింది వర్ణ.

వర్ణకి ఇక్కడి విషయాలు చెప్పి ఆమెని కంగారు పెట్టడం ఇష్టంలేక, "అమ్మకి అక్కడ రెస్ట్‌లెస్‌గా ఉంటోందని ఇక్కడకు వచ్చిందిలే!" అన్నాడతను.

"ఓ..! సరే! ఆంటీని జాగ్రత్తగా చూసుకో! నాలాగ చూసుకోవాలి!" అని నవ్వి, "వీడియో చూశాక ఎలా ఉందో చెప్పు నందూ! ఉండనా!" అంది వర్ణ.

సరేనన్నాడతను. కొన్ని నిముషాల తరువాత, 'వీడియో చూశాను బావుంది' అని వర్ణకి మెసేజ్ పెట్టాడు నందూ.

ఆమె వెంటనే ఆ సీన్ ఎలా ఉంది? ఈ సీన్ ఎలా ఉంది? అని ఆసక్తిగా మెసేజ్‌లు పెట్టింది. అన్నిటికీ 'బావుం ది.. బావుంది' అని రిప్లై ఇచ్చాడు.

వర్ణకి మెసేజ్‌లు ఇస్తుండగానే అతనికి తండ్రి తులసీరామ్‌గారి ఫోన్ నుంచి కాల్ వచ్చింది. గబుక్కున ఎలర్ట్ అయ్యి గబగబా ఇంట్లోంచి బయటకు నడిచాడు నందూ. వరండాలోకి వచ్చిన తరువాత ఫోన్‌కాల్ రిసీవ్ చేసుకుని, "హలో నాన్నా!" అన్నాడు.

"మీ అమ్మ కోసం నిన్న అమ్మమ్మా వాళ్ళ ఊరు వెళ్ళొచ్చాను. అక్కడకూ రాలేదన్నారు నందూ. నాకెందుకో భయంగా ఉంది.." అని నిదానంగా అన్నారు.

కొడుకు నిర్లిప్తంగా ఉన్నట్టనిపించి, ముభావంగా "ఉంటాను" అని చెప్పి ఫోన్ కట్ చేశారాయన.

తండ్రితో ఫోన్‌లో మాట్లాడడం పూర్తికా

గానే దీర్ఘంగా నిట్టూర్చాడు నందూ.

'తమ ఇంటికి వచ్చిన గౌరీలక్ష్మి అనే ఆవిడకీ, అమ్మ ఇలా హఠాత్తుగా తండ్రిని ఒంటరిగా వదిలి వచ్చేయడానికీ ఏదో సంబంధం ఉండి ఉండొచ్చు' అని ఎందుకో సందేహంగా అనిపించింది అతనికి. అందుకే.. జరిగినదాన్ని తల్లి నుంచి ఎలాగైనా రాబట్టాలని గట్టిగా నిశ్చయించుకుని తల్లి దగ్గరకు వచ్చాడు.

శ్యామల ఏదో పుస్తకం చదువుతూ అందులో మునిగిపోవాలని ప్రయత్నిస్తోందిగానీ సాధ్యం కావడంలేదు.

తల్లిలోని అస్థిమితాన్ని గమనిస్తూ "అమ్మా! ఆ రోజు మన ఇంటికొచ్చిన ఆవిడ ఎవరు? " క్యాజువల్‌గా అడుగుతున్నట్టుగా అడిగాడు నందూ.

చిన్నగా నిట్టూరుస్తూ పుస్తకాన్ని మూసి పక్కన పెట్టింది శ్యామల.

అది చూడగానే ఏదో విషయం ఉందని అర్థమైంది నందూకి. వెంటనే విషయంలోకి వస్తూ, "ఆవిడ పేరు గౌరీలక్ష్మి అని చెప్పిందమ్మా! తులసీ ఇల్లేనా? అని అడిగింది. నేను తులసీరామ్‌గారి ఇల్లన్నాను. ఆవిడని మన ఇంట్లో ఎప్పుడూ చూడలేదు నేను.." జరిగింది గుర్తు చేసుకుంటూ అన్నాడు నందూ.

ఎందుకో ఊపిరి అందనట్టు ఒక్కసారిగా దీర్ఘంగా గాలి పీల్చుకుంది శ్యామల.

"తులసి ఇల్లేనా అని నాన్న పేరుని అంత చనువుగా అడిగిందంటే, ఆవిడకి నాన్న బాగా తెలుసా..? ఇప్పుడు ఆవిడ గురించి నాన్నకీ నీకూ ఏమైనా మనస్పర్థ వచ్చిందా? " సూటిగా ఆవిడ ముఖంలోకి చూస్తూ అడిగాడు నందూ.

కొడుకు ప్రశ్నలు విని కూడా పెదవి విప్పలేదు శ్యామల.

తల్లిచేతిని తన చేతుల్లోకి తీసుకుని "చెప్పమ్మా! ఆవిడ నీకేమవుతుంది? " చాలా ఆదుర్దాగా అడిగాడతను.

నిలదీస్తున్నట్టుగా అడుగుతున్న ఆ

## కొత్తగాలి...

**శ్రమ**
**నీ ఆయుధమైనప్పుడు**
**విజయం**
**నీ బానిస అవుతుంది!**

– బిక్కునూరి రాజేశ్వర్,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

ప్రశ్నలకి చాలా ఉద్వేగంగా అనిపించింది శ్యామలకి. అయినాసరే స్థిమితంగా చూస్తూ "నాకు ఏమీ కాదు నందూ! కానీ.. మీ నాన్నకి భార్య! నీకు అమ్మ.. అవు.. తుం..ది..." అంటూ ఇన్నేళ్ళుగా మోసిన గరళాన్ని ఒక్కసారిగా వెల్లడి చేస్తున్నట్టు దీర్ఘంగా ఊపిరి తీసుకుంది శ్యామల.

అంతే..! ఆ మాటలు వినగానే నివ్వెరపాటుతో ఖిన్నుడై నోట మాటరాక మిన్నకుండిపోయాడు నందూ. తల్లి చెప్పిందాన్ని ఎంతమాత్రం నమ్మలేకపోయాడతను.

ఆ అపనమ్మకంలో నుంచి కొన్ని క్షణాలకిగానీ తేరుకోలేకపోయాడు. తేరుకున్న వెంటనే "అమ్మా! నువ్వు చెప్పింది నిజమా? " అని సందేహంగానే అడిగాడు.

చిన్నగా తలూపింది శ్యామల. సుదీర్ఘంగా ఎటో చూస్తూ, "గౌరి మీ నాన్నకి అక్క కూతురు. చిన్నప్పట్నుంచీ ఇంట్లో అందరితో పాటూ గౌరి కూడా ఆయనని 'తులసీ' అని పిలిచేది. మీ నాన్నగారికి కూడా గౌరి అంటే చాలా ఇష్టం. అందుకే పదిహేనేళ్ళ తారతమ్యమున్నా వాళ్ళిద్దరికీ పెళ్ళిచేశారు వాళ్ళవాళ్ళు. మీ నాన్నగారు గౌరిని ప్రాణంగా చూసుకునేవారు. ఆమెకి ఏం జరిగినా తల్లడిల్లిపోయేవారు. అందరి గారాబంతో గౌరి మొండిగా తయారైంది.

## కొత్తగాలి...

**హరితం**
**హరించుకుపోయింది!**
**మానవత్వం**
**మసకబారి పోతోంది!**
**రక్షించండి! రక్షించండి!**

– జి.వి.యస్. ప్రియంవద,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

ఆమేం చేసినా ఇంట్లోవాళ్ళకి తప్పుగా కనిపించేది కాదు. ఆఖరికి ఓరోజు.. ఒకడి మాయమాటలు నమ్మి, ఇంట్లోని డబ్బూ నగలూ తీసుకుని వెళ్ళిపోయింది గౌరి. తొమ్మిది నెలలపాటూ మోసి, ప్రసవించిన పసివాడి. పేగుబంధం కూడా ఆమెని ఆపలేకపోయింది.." గంభీరంగా చెప్పి నందూ ముఖంలోకి చూసింది శ్యామల.

నందూ ముఖంలో ఆనాటి నెలల పిల్లాడు కనిపించాడు ఆమెకి.

ఆ నెలల పసివాణ్ని తానేనని అర్థమైంది నందూకి.

"మోతుబరులైన మీ నాన్నగారి వంశానికి ఊళ్ళో మంచిపేరు ఉంది. ఆ పేరుప్రతిష్టలతో చాలా ఐశ్వర్యంలో పెరిగారు మీ నాన్న. వారి పొలాలూ, పాడీ సంరక్షణ చేసే పెద్దపాలేరు పని మా నాన్నది. మేమూ అక్కడే ఒక పెంకుటింట్లో ఉండే వాళ్ళం. తను ఎంతో ఇష్టపడి పెళ్ళిచేసుకున్న మేనకోడలు గౌరి చేసిన పనికి ఎంతో బాధపడ్డారు మీ నాన్న. దానికి తోడు 'పెళ్ళాం లేచిపోయింద'ంటూ ఊళ్ళో వాళ్ళు చాటుమాటుగా అనుకుంటున్న మాటల్ని భరించలేకపోయారు. ఆస్తినీ, పొలాల్నీ అక్కగారికి అప్పగించి నిన్ను తీసుకుని పుట్టి పెరిగిన ఊరుకి దూరంగా ఇక్కడకు వచ్చేశారు. నీ ఆలనాపాలనా చూడడం కోసమని వాళ్ళ అక్కగారు నన్ను ఇక్కడకు పంపించారు. ఆవిడ అప్పుడప్పుడూ ఈ ఊరు వచ్చి తన తమ్ముడినీ, నిన్నూ చూసి వెళుతుండేవారు. మీ నాన్నగారు ఒంటరిగా పడే అవస్థ చూడలేక, ఆవిడ మా నాన్నతో మాట్లాడారు. నన్ను ఆయనకిచ్చి పెళ్ళి చెయ్యమని ఆవిడ అడగగానే కనీసం మాటమాత్రమైనా నాకు చెప్పకుండా వెంటనే ఒప్పేసుకున్నారు నాన్న. కానీ.." అని ఏదో చెప్పబోతూ సంశయంగా ఆగిపోయింది శ్యామల.

ఆ రోజులు గుర్తొస్తున్నట్టు ఆమె చూపులు పరధ్యానంగా ఉన్నాయి.

తరువాత ఏమైందన్నట్టు ఆసక్తిగా చూశాడు నందూ.

"కూతురుకి రెండో పెళ్ళి సంబంధాన్ని చేస్తున్నానన్న ఆలోచనే రాలేదు నాన్నకి. పేదింటి ఆడపిల్లకి అభిమానమేంటన్న మాటల్తో నా ఇష్టాయిష్టాల్ని తుడిచేశారు. గౌరి స్థానంలోకి రాబోతున్న నాతో ఒకసారి మాట్లాడాలన్నారు మీ నాన్న. నాకు ఆయనతో పెళ్ళి ఇష్టమో? కాదో? అడిగారు. ఆయన ఆలోచనల్ని వివరంగా చెప్పి, తను పెట్టే కండిషన్‌కి ఒప్పుకునేట్టయితేనే ఆయనతో పెళ్ళికి సిద్ధమవ్వమన్నారు. గౌరి మీద ఇంకా ఆయనలో ఉన్న ప్రేమని చూసి ఆశ్చర్యం కలిగింది. ఆ రోజు నేను తలవంచిన కండిషన్ ఇప్పటికీ ఉచ్చులా నా మెడలోనే సజీవంగా ఉంటుందని ఊహించలేకపోయాను" అంది శ్యామల. ఆ వెంటనే ఆవిడ కళ్ళలో పల్చగా ఊరిన తడి ఒక కంటిచినుకుగా ఆమె చెంపల మీదకి జారింది.

'నాన్న పెట్టిన కండిషనేంటి?' అని అడగాలనున్నా, దాన్ని తెలుసుకోవాలని ఉత్కంఠగా అనిపిస్తున్నా, తల్లి దుఃఖాన్ని చూస్తూ అడగలేక ఆగిపోయాడు నందూ.

చెంపల మీదకి జారిన కన్నీటి చుక్కని తుడుచుకోకుండానే, "నన్ను పెళ్ళి చేసుకుంటున్నా కూడా.. భవిష్యత్తులో గౌరి ఏ

రోజున ఇంటికి తిరిగి వస్తే.. అదే రోజు నేను మీ నాన్నగారి జీవితంలోంచీ, ఆయన భార్య స్థానంలో నుంచీ తప్పుకో వాలి అన్నది ఆయన పెట్టిన కండిషన్. అది ఇప్పుడు.. ఇన్నేళ్ళకి జరిగింది.." అంటూ నిబ్బరంగా చెప్పింది శ్యామల.

తల్లి పరిస్థితిని చూసి నందూ కళ్ళు తడిబారాయి. అంతలోనే తండ్రి మీద పట్టలేనంత కోపం వచ్చింది. తనని కని వదిలేసిన గౌరీలక్ష్మి మీద అసహ్యం కలిగింది.

"చాన్నాళ్ళు ఆయనతో పాటూ నేనూ గౌరి కోసం ఎదురు చూశాను నందూ! ఆయనతో జీవిత భాగస్వామిగా ప్రేమని పొందకపోయినా, నీ పెంపకంలోని మాతృత్వపు అనురాగాన్ని పోగొట్టుకుంటానేమో అని చాలాసార్లు భయం వేసేది. గౌరి వచ్చినా.. నిన్ను మాత్రం గౌరికి ఇవ్వకూడదు అనుకున్నాను. ఏళ్ళు గడిచే కొద్దీ ఇక మా జీవితాల్లోకి గౌరి రాదన్న నమ్మకం ఏర్పడింది. కానీ.. వచ్చింది. గౌరి వచ్చింది..! ఆయన ఆఫీసుకి వచ్చి కలిసిందని చెప్పారు మొన్నొక రోజు. అది ఆయన పెట్టిన కండిషన్‌ని గుర్తు చేస్తున్నట్టుగా అనిపించింది. గౌరీ స్థానాన్ని ఖాళీ చెయ్యమన్నట్టుగా తోచింది. మన మధ్య గౌరికి స్థానం లేదని ఆయన నోటితో చెప్తారని ఆశించాను. కానీ.. అలా జరగలేదు. ఆ ఇంట్లో రోజు గడుస్తుందంటే అభిమానాన్ని చంపుకుంటూ బతుకుతున్నట్లయింది. గౌరి నేరుగా ఇంటికి వచ్చిన తరువాత కూడా.. ఈ ఇల్లు నాది, ఆయన పాతికేళ్ళు నాతో ఉన్న నా భర్త అని మొండిగా ఇంకా అక్కడే ఉండలేకపోయాను.." అని చెప్తూ రాబోతున్న దుఃఖాన్ని బలవంతాన అణుచుకుంది శ్యామల. తల్లి మానసికంగా ఎదుర్కొంటున్న భావోద్వేగ అలజడిని అంచనా వేసుకుంటూ మౌనంగా ఉండిపోయాడు నందూ. ఎందుకో అతనికి వర్ణ పంపించిన వీడియో గుర్తొచ్చింది. అతని మనసంతా అదోలా అయిపోయింది.

జీవితం గురించీ, బంధాల్లో ఎదురయ్యే ఆటుపోటుల గురించీ వయసుకు మించిన పరిణతి ఉంది నందూకి. కానీ, ఇప్పుడు అతని జీవితంలో అలాంటి అనుభవం ప్రత్యక్షంగా ఎదుర్కొనే స్థితి వచ్చేసరికి, అతనే తట్టుకోలేకపోతున్నాడు.




**సా**యంత్రం ఆఫీస్ అవర్స్ అవగానే తండ్రి ప్రతాప్‌కి ఫోన్ చేసి మాట్లాడుతూ బయటకు వచ్చింది వర్ణ. ఆమె తండ్రితో మాట్లాడ్డం పూర్తి చేసి ఫోన్ కట్ చేసేసరికి "హాయ్ వర్ణా! షెల్ వి గో.." అంటూ ఆమె దగ్గరకు వచ్చాడు నందన్.

తల ఊపి అక్కడ నుంచి కదిలింది వర్ణ. దూరంగా వర్ణా, నందన్‌ల కోసం ఎదురుచూస్తూ కనిపించింది రాగా.

వర్ణని చూస్తూ, "వర్ణా! ఎ స్మాల్ రిక్వెస్ట్" అన్నాడు నందన్.

"చెప్పు నందన్.." అంది వర్ణ.

"నథింగ్! మనం ఫ్రెండ్స్ కదా! రాగా నా హోమ్‌కి వచ్చిందిగానీ నువ్వింకా రాలేదు. నువ్వొస్తే లేటెస్ట్ తెలుగు మూవీస్ అన్నీ పెద్ద స్క్రీన్‌లో చూద్దాం.." అని ముందుకు నడుస్తూ. "బీ ఫ్రీ వర్ణా! నువ్ నన్ను 'నందన్' అని పిలవకు! 'నందూ' అని పిలువ్ చాలు!" అన్నాడు నందన్.

'నందూ' అన్న పేరు వెనక ముడిప

## కొత్తగాలి...

**రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయ్**
**మనం కళ్లతో చూడలేదు**
**జలం కోసం**
**మూడో యుద్ధం జరగకముందే**
**జనమంతా జాగ్రత్తపడాలి!**

– యు. విజయశేఖరరెడ్డి,
కూకట్‌పల్లి, హైదరాబాద్

దున్న తన భర్త నందకిషోర్‌తో పాటు లెక్చరర్ నందినీ విషయం కూడా గుర్తొచ్చింది వర్ణకి. ఒకవేళ తన నందూ కూడా నందినీని 'నందూ..' అని పిలిస్తే అన్న ఆలోచన వచ్చింది వర్ణకి. అంతే! వెంటనే ముఖంలోని చిరునవ్వు ఎగిరిపోయింది.

రూమ్‌కి వచ్చేసరికి రాత్రి ఏడయింది. వచ్చిన వెంటనే గబగబా తన రూమ్‌లోకి వెళ్ళి నందూకి ఫోన్ చేసింది వర్ణ.

వెంటనే "హలో!" అన్నాడు నందకిషోర్. అప్పుడే లేచినట్టుగా ఉంది నందూ గొంతు. చెయ్యడమైతే చేసిందిగానీ, తన డౌట్ ఎలా అడగాలో అర్థంకాలేదు వర్ణకి. సూటిగా అడిగేస్తే అతన్ని ఇన్సల్ట్ చేసినట్టో? అనుమానించినట్టో? ఉంటుందని లీలగా తెలుస్తోంది. అందుకే ఏం మాట్లాడకుండా "ఏం లేదు! ఊరికే చేశాను.." అని తడబడుతూ చెప్పింది వర్ణ.

"ఊరికేనా! ఫర్లేదులే మాట్లాడు!" అన్నాడు నందూ.

అతనూ తల్లి గురించిన నిజాల్ని వర్ణతో చెప్పాలన్న ఆలోచనలో ఉన్నాడు.

"ఏంలేదు నందూ! అంతా ఓకే! టూ మంత్స్ అయిపోయాయి. ఇంకో ఫోర్‌మంత్స్‌లో వచ్చేస్తాను. అవునూ కాలేజ్ వర్క్ ఎలా ఉంది..? ఎగ్జామ్స్ ఎప్పుడు స్టార్ట్ అవుతాయి..? " అంది వర్ణ.

అతను సమాధానాలు చెప్పాడు.

"మీ కోలెక్చరర్లు పేర్లు పెట్టే పిలుచుకుంటారా? అంటే.. మామూలుగా నిన్ను 'నందకిషోర్' అంటారా? 'నందూ' అని అంటారా? " సంశయంగా అడిగింది వర్ణ.

పేర్లతో రేర్‌గా పిలుచుకుంటాం! మాగ్జిమమ్ 'సార్, మేడమ్' అని పిలుచుకుంటాం, ఏం? " అనడిగాడతను.

"ఏం లేదు. నువ్వు ఇంటర్వ్యూ చేశావే! ఆమె పేరు నందినీ కదా! ఆమెని ఏమని పిలుస్తావ్? " ఆ ప్రశ్న అడగడానికి మొహమాట పడుతున్నట్టుగా అడిగింది వర్ణ.

ఆమె ప్రశ్న వినగానే నవ్వాడు నందకిషోర్. వర్ణ మనసులో ఎలాంటి భావాలు ఉన్నాయో అంచనా వేసుకుంటూ, "ఇప్పటి వరకూ పిలుచుకునే అవసరం రాలేదు. మాది సైన్స్ డిపార్ట్‌మెంట్. మా ల్యాబ్‌లూ, క్లాసులూ అన్నీ కాలేజ్‌కి లాస్ట్‌లో ఉంటాయి చూశావుగా" అన్నాడు.

"అహ! అది కాదూ.."

"ఇట్సోకే వర్ణా! పిలవాల్సిన అవసరం వచ్చినా 'నందూ' అని మాత్రం కచ్చితంగా పిలవను. ఎందుకంటే దగ్గర కానివాళ్ళని అలా పిలిస్తే నేనే చనువు ఇచ్చి, కొత్త సమస్యల్ని నా నెత్తిమీదకి తెచ్చుకున్నట్లవుతుందని నాకు తెలుసు.." అని నవ్వుతూ చెప్పాడు నందకిషోర్.

"అవును! మన మనసుకి దగ్గరైన వాళ్ళని మాత్రమే చనువుగా ముద్దుపేర్లతో పిలవగలం. ఐ నో!" అంది వర్ణ.

'ఓకే! ఇప్పుడే నిద్ర లేచాను. కాలేజ్‌కి వెళ్ళాలి కదా! బట్ నీకో విషయం చెప్పాలి వర్ణా. లంచ్ బ్రేక్‌లోగానీ, ఈవినింగ్‌గానీ లీజర్‌గా ఫోన్ చేస్తాను. ఓకేనా! మరి ఇప్పటికి ఉండనా!" అన్నాడు నందకిషోర్.

అలాగేనని ఫోన్ కట్ చేసింది వర్ణ.

బాత్రూంలోంచి ఫ్రెష్షయి వచ్చిన రాగా ఆమె ఇంకా అలా కూర్చునే ఉండడం చూసి, "ఏయ్! ఇంకా ఇలానే కూర్చున్నావేంటి! త్వరగా ఫ్రెష్షవ్! నందన్ రూమ్‌లో

పెద్ద స్క్రీన్ మీద తెలుగు మూవీ చూద్దా మన్నాడు కదా! ఇవాళన్నా రావే! ప్లీజ్!" అంటూ బతిమాలింది.

"వస్తాలే! ఏడవకు!" అంటూ వర్ణ అయిష్టంగానే బాత్రూంకి వెళ్ళింది.

కాసేపటికి వర్ణా, రాగ ఇద్దరూ నందన్ రూమ్‌కి వచ్చారు. నందన్ వాళ్ళిద్దరినీ లోపలకు ఆహ్వానించి అతని బెడ్‌రూమ్‌లోకి తీసుకెళ్ళాడు. అక్కడ గోడ మీద మినీ థియేటర్ స్క్రీన్‌ని తలపించేలా ఉంది మానిటర్. దానికి ఎదురుగా సోఫా, సోఫాకి అటూ ఇటూ రెండు రౌండ్స్‌గా టేబుల్స్, ఛైయిర్సూ వేసున్నాయి.

పెన్‌డ్రైవ్‌ని పెట్టి అందులో ఉన్న తెలుగు సినిమాల పేర్లు చెబుతూ "ఏ మూవీ చూద్దాం? " అని అడిగాడు నందన్.

ప్లే చేస్తున్న మూవీ టైటిల్స్ చూస్తూ వాటిమీద వచ్చిన పబ్లిక్ టాక్‌నీ, రివ్యూల్నీ మాట్లాడుకుంటున్నారు వర్ణ, రాగా.

వాళ్ళని చూసి, "మీరు డిసైడ్ చెయ్యండి, ఈలోపు స్నాక్స్ తీసుకొస్తాను.." అంటూ కిచెన్ వైపు వెళ్ళాడతను.

ఓరకంట నందన్‌నే చూస్తున్న రాగా వెంటనే, నేనూ వస్తాను హెల్ప్‌కి.." అని చెప్తూ, అతని వెనుక వెళ్ళింది.

ఏ మూవీ పెట్టాలో వర్ణ ఒక్కతే డిసైడ్ చేయలేక, సినిమాల లిస్ట్‌కి పాజ్ ఇచ్చి గోడకు ఉన్న బుక్ షెల్ఫ్ వైపు వెళ్ళింది వర్ణ. అక్కడ రాక్స్‌లో సీడీలూ, పెన్‌డ్రైవ్‌లూ, కార్డ్‌రీడర్‌లూ, ఇంకా పెరిఫెరల్స్ పడేసి ఉన్నాయి. వాటిని చూస్తూ ఇటు తిరిగిన వర్ణకి, వర్ణ అని తెలుగు అక్షరాలు రాసున్న ఒక కాంపాక్ట్ డిస్క్ కనిపించగానే ఉలిక్కిపడి చూసిందామె.

వెంటనే ఆమె చేతులు అప్రయత్నంగా దాన్నందుకున్నాయి. డిస్క్ మీద వర్ణ అని తప్ప ఇంకేం లేదు. 'ఏమై ఉంటుందా? ' అనుకుంటూనే గబగబా ఆ సీడీని తన బ్యాగ్‌లో పెట్టుకుంది. ఈలోగా నందన్, రాగాలు రావడంతో.. వాళ్ళతో మామూలుగా కలిసి కూర్చుంది.

ముగ్గురూ కలిసి ఏ సినిమా చూడాలి అన్నదానిపై ఒక నిర్ణయానికి వచ్చి సినిమాని ప్లే చేసి చూస్తున్నారు.

మధ్యమధ్యలో జోక్స్ వేస్తూ, చాలా రోజుల తరువాత థియేటర్‌లో సినిమా చూసినట్టున్న ఆ వాతావరణాన్ని బాగా ఆస్వాదించింది రాగా.

వర్ణకి మాత్రం తన ఆలోచనల్ని సినిమా బాగా డిస్టర్బ్ చేస్తోంది. ఒకపక్క రేపు నందూకీ తనకీ మొదటి పెళ్ళిరోజని ఉద్విగ్నంగా ఉంటే, ఇంకోపక్క ఇక్కడ నందన్ దగ్గర తన పేరుతో ఉన్న సీడీలో ఏముందో తెలుసుకోవాలని ఉత్కంఠగా ఉంది. ఆ రెండు భావాల మధ్యా, రాగానీ నందన్‌నీ కాదని సినిమా మధ్యలోంచి వెళ్ళిపోవాలని ఉన్నా మొహమాటంతో అక్కడే ఉండిపోయిందామె.

సినిమా పూర్తయ్యేసరికి రాత్రి పదకొండు గంటలైంది. ముగ్గురూ కలిసి డిన్నర్ చేసి, ఎవరి రూమ్స్‌కి వాళ్ళు వెళ్ళిపోయారు. రాగా నిద్రపోయేవరకూ ఏం చేయాలో తెలీక అలాగే కూర్చుంది వర్ణ.

రాగా పడుకున్న తరువాత ల్యాప్‌టాప్ ఆన్ చేసి నందన్ రూమ్‌లోంచి తెచ్చిన సీడీని డ్రైవ్‌లో పెట్టి, వాల్యూమ్ మ్యూట్‌లో పెట్టింది.

అది హేలోవీన్‌డే రోజు వర్ణ భయపడడాన్ని నందన్ తీసిన వీడియో..! ఇదా..! అనుకుంటూ వీడియోని చూస్తున్న వర్ణ ఒక్కసారిగా ఉలిక్కిపడింది.

అందులో.. మంచం మీద నిద్రపోతూ ఉన్న వర్ణ ముఖం, ఆ వెంటనే ఆమె భయపడుతూ బెడ్ చివరకు జరగడం, అలా జరుగుతున్నప్పుడు నైట్ డ్రెస్ తొలగి కనిపిస్తున్న కాళ్ళు, ఆ వెంటనే మరో సన్నివేశం. అన్నీ బిట్స్ బిట్స్‌గా ఉన్నాయి. వాటన్నిటికీ మధ్యమధ్యలో రావలసిన



సీన్స్ మిస్ అయినట్టు అర్థమైంది ఆమెకి.

వీడియో మొత్తంలో వర్ణ ఒక్కతి మాత్రమే ఉంది. ఆమె భయాన్ని చూసి అందరూ నవ్వే సన్నివేశాలేవీ అందులో లేవు. వర్ణ ఉన్న బిట్స్‌ని మాత్రం కట్ చేసి మోడిఫై చేసిన వీడియో అది.

ఇన్ని రోజులూ దాన్ని చూసిన కోణంలో నుంచి బయటకు వచ్చి, ఇప్పుడు ఆ వీడియోని తీసిన కోణంలో నుంచి చూస్తోంది వర్ణ. అందరితో కలిసి ఉన్న ఆ వీడియోలో సన్నివేశాలు పెద్దగా అబ్జెక్షన్ అనిపించకపోయినా, ఇప్పుడు ఆమె మాత్రమే ఉన్న ఆ సన్నివేశాల్ని చూస్తుంటే ఆమెకే కొంచెం ఏదోగా అనిపిస్తోంది. ఇందుకే డాడీ క్లాస్ పీకారు. బట్ తాను రిసీవ్ చేసుకోలేకపోయింది అనిపించింది వర్ణకి. తనకే ఇలా ఉంటే, మరి నందూ ఈ వీడియోని చూసి ఎలా ఫీలై ఉంటాడు? అన్న సందేహం కలిగింది ఆమెకి.

ఆ రోజు నందూ ఈ వీడియోని చూసినా కూడా తాను అడిగితే తప్ప అతని ఎమోషన్స్‌ని ఎక్స్‌ప్రెస్ చెయ్యలేదన్న విషయం వెంటనే గుర్తొచ్చింది ఆమెకి. అతనలా వెంటనే రెస్పాండ్ అవ్వలేదంటే అర్థం.. నందూకి కూడా ఆ వీడియో అబ్జెక్షనేనేమో అనిపించింది.

ల్యాపీ స్క్రీన్ మీద వీడియో పూర్తయిన తరువాత ఇంకా కొన్ని పిక్స్ వస్తూ కనిపించాయి. ఆసక్తిగా వాటిని చూసింది వర్ణ.

వర్ణ రకరకాల డ్రెస్సుల్లో ఉన్న ఫోటోస్, కొన్ని పార్ట్స్‌ని ఫోకస్ చేస్తూ తీసిన క్లోజప్ షాట్స్, ఆమె నవ్వుతూ ఎవరెవరితోనో మాట్లాడుతున్నవీ, ఆఫీస్ పార్కింగ్‌లో ఉన్నప్పుడు పై ఫ్లోర్స్ మీద నుంచి తీసినవీ, వెనక నుంచి తీసినవీ... ఒక్కో పిక్చర్ మూవ్ అవుతున్న కొద్దీ వర్ణ ముఖం కోపంతో ఎరుపెక్కింది.

నందన్ తనని చూస్తున్న వరెస్ట్ కోణం ఈ ఒక్క సీడీలో పూర్తిగా బహిష్కృతమవగానే వర్ణకి అతని మీద చెప్పలేనంత అసహ్యం కలిగింది. ఆ క్షణమే.. ఆమె మనసులో అతని గురించి ఉన్న పాజిటివ్ అభిప్రాయాలన్నీ మాయమైపోయాయి.

ఆ మరుక్షణంలోనే వర్ణలో అంతర్మ

కోపంతో వెంటనే నందన్ రూమ్‌కి వెళ్ళి, ఈ సీడీ చూపించి అతన్ని తిట్టెయ్యాలని ఆవేశంగా అనిపించింది. కానీ, తనని తాను కంట్రోల్ చేసుకుంటూ దీర్ఘంగా ఊపిరి పీల్చుకుని, ల్యాప్‌టాప్‌ని షడ్డౌన్ చేసి సీడీని మళ్ళీ పర్స్‌లో పెట్టుకుందామె.

కానీ వర్ణ అదే కోపంతో, అదే



సమయంలో... నందన్ రూమ్‌కి వెళ్ళుంటే బాగుండేది. సరిగ్గా ఆ సమయానికి ఆమె సెల్‌ఫోన్ రింగైంది. ఆమె నందన్ బెడ్ రూంలో మర్చిపోయిన ఆమె సెల్‌ఫోన్.. సరిగ్గా ఆ సమయానికి రింగ్ అవుతోంది!

సెల్‌ఫోన్ రింగ్ శబ్దానికి, అప్పుడే నిద్ర కుపక్రమిస్తున్న నందన్ ఒక్కసారిగా మేల్కొన్నాడు. అది తన ఫోన్‌లోని రింగ్

ధనం మొదలైంది. చెప్పలేనంత దిగులుగా అనిపించింది. తాను నందూని బాధపెట్టాను అన్నదానికంటే, అతను బాధపడిన విషయాన్ని వెంటనే గ్రహించలేకపోయాను అన్నదానికే ఎక్కువ ఫీలైంది వర్ణ.

ఇన్ని రోజులు నందన్ తన మీద కనబరిచిన శ్రద్ధ, ఆఫీస్‌లో తనకు ఇచ్చే ప్రయారిటీ గుర్తుకు వస్తుంటే.. నందన్‌లో పైకి కనిపించని రెండో ముఖం ఇప్పుడు వర్ణకి చాలా స్పష్టంగా కనిపిస్తోంది.

టోన్‌లా లేకపోవడంతో ఆశ్చర్యంగా ఫోన్ కోసం అటూఇటూ చూశాడు.

షెల్ఫ్‌ల దగ్గరి రాక్‌లో వెలుగుతున్న ఫోన్‌ని చూసి గబగబా లేచి తీశాడతను. అది వర్ణ సెల్‌ఫోన్ అని అర్థమైందతనికి.

వెలుగుతున్న డిస్‌ప్లే మీద 'నందూ కాలింగ్..' అని చూడగానే నందన్ ముఖం క్రూరంగా మారింది.

వర్ణ ఫోన్‌ని ఇక్కడ మర్చిపోయిందని అర్థం కాగానే, అతని పెదాలు వంకరగా మెలితిరిగి నవ్వుకున్నాయి. వాల్‌క్లాక్‌లో అర్ధరాత్రి ఒంటిగంట అవుతుండడం చూసి, వెంటనే కాల్ ఓకే చేసి, "హాలో! ఐయాం నందన్.." అన్నాడు.

నందన్ మాటలు వింటూ, అసహనంతో ఫోన్‌కాల్ కట్ చేశాడు నందూ.

ఈ టైంలో వర్ణ ఫోన్ నందన్ దగ్గర ఎందుకుంది? వాడు ఏదేదో వాగుతున్నాడేంటీ? అని రకరకాల ఆలోచనలతో ఒక్కసారిగా నిస్సత్తువైపోయాడు నందూ.

అప్పటివరకూ హాల్‌లోనే ఉన్న శ్యామల కొడుకువైపు వస్తూ, "నందూ! బయటకెక్కడికో అర్జెంట్‌గా వెళ్ళాలన్నావ్. ఇంకా ఇక్కడే కూర్చున్నావేంటీ? " అంది.

ముఖంలో కమ్ముకుని ఉన్న నీలినీడల్ని వదిలించుకుంటూ గబగబా బెడ్‌రూంలోకి వెళ్ళి పడుకున్నాడు. అతనికి ఎవరితోనూ మాట్లాడాలని లేదు. ఏ పనీ చెయ్యాలని లేదు. తాను ఒంటరివాడైనట్టు, తన నుంచి వర్ణ కొంచెం కొంచెంగా దూరమైపోతున్నట్టు అనిపిస్తోంది.

తమ పెళ్ళిరోజని తాను నిన్నంతా ఉత్సాహంతో చేసిన శ్రమంతా వృథా అయినట్టనిపిస్తోంది నందూకి.

నిమిషాలు గడుస్తున్నాయి.

చల్లని చేతి స్పర్శ చెంపని తట్టగానే ఉలికిపాటుగా కళ్ళుతెరిచాడు నందూ. ఎదురుగా తల్లి!

లేచి కూర్చున్నాడు. తల్లి ముఖంలోకి చూసి, "ఏం లేదమ్మా! కొంచెం తల నొప్పిగా ఉంటే.." అని సంజాయిషీగా ఏదో చెప్పబోయాడు. కానీ, తన పరిస్థితి కూడా అచ్చం తల్లి పరిస్థితిలానే అనిపించి ఒక్కసారిగా దుఃఖం బయటకు పొంగింది అతనికి. వెంటనే, "అమ్మా..!" అంటూ తల్లి ఒడిలో తలదాచుకున్నాడు నందూ.

కొడుకు ఫోన్‌లో మాట్లాడిన మాటల్నీ, 'ఎవడ్రా నువ్వు? వర్ణ గురించి ఇంకొక్క మాట చెడుగా మాట్లాడినా ఊరుకోను!' అంటూ ఇందాక అతను అరిచిన అరుపుల్ని వింది శ్యామల. ఆ మాటల్ని బట్టీ, అతనిలోని బాధని బట్టీ, కాలేజ్‌కి వెళ్ళకుండా పడుకున్న నందూని చూసీ నందూ వర్ణల మధ్య ఏం జరిగి ఉంటుందో అంచనా వేసుకుందామె.

కొడుకు తలని సున్నితంగా నిమురుతూ, "ఏమైందిరా నందూ? మీ ఇద్దరి మధ్యా ఎవరైనా మూడోవ్యక్తి గురించి విభేదమా? " అని అడిగింది శ్యామల.

నందూ విచారంగా తల్లి ముఖంలోకి చూసి "మాలో ఇద్దరు కాదమ్మా నలుగురు కనిపిస్తున్నారు" అని తల దించుకున్నాడు.

నందూ సమాధానానికి ఉలిక్కిపడింది శ్యామల. ఆమెకి వాళ్ళిద్దరి సమస్యేమిటో అస్సలు తెలియకపోయినా పరిష్కారం మాత్రం స్పష్టంగా అర్థమైంది. అందుకే వెంటనే నందూ ముఖంలోకి చూస్తూ, "మీ ఇద్దరూ ఒక్కటిగా మారితే, అప్పుడు మీ మధ్య మూడో మనిషీ, నాలుగో మనిషీ అనే ప్రస్తావన అస్సలు ఉండదు నందూ!" అంటూ వాత్సల్యంతో నందూ భుజం మీద చెయ్యి వేసింది శ్యామల.

అక్కడ అర్ధరాత్రి టైంలో వర్ణ ఫోన్‌లో నందన్ మాట్లాడిన మాటలు గుర్తొస్తుంటే చిన్నగా నిట్టూర్చి, "ప్రాబ్లెం మా ఇద్దరి మధ్యా రాలేదమ్మా! బయట నుంచి వచ్చింది. కానీ అది బయట నుంచీ వచ్చే అవకాశాన్ని మాత్రం తనే ఇచ్చింది" అని

ఒకింత బాధగా అన్నాడు నందూ.

"అవకాశం ఎవరు ఇచ్చినా, బాధపడేది మాత్రం కచ్చితంగా మీ ఇద్దరే నందూ! దాన్ని సరిదిద్దుకోవాల్సింది కూడా మీ ఇద్దరే. మీ వయసుల్లో మీ కళ్ళకు కనబడేవి, చెవులకు వినబడేవి అన్నీ నిజాలు కావు. నువ్వు మిట్టమధ్యాహ్నం నడిరోడ్డు మీద వెళుతుంటావు. నల్లని తారురోడ్డు మీద నీ కళ్ళముందే నీటిజాడలు కనిపిస్తాయి. కానీ, నీ కళ్ళు చూపించిన ఆ నీటి జాడల్ని నమ్మి ఎంతదూరం ముందుకు వెళ్ళినా అక్కడ నీరుండదు. ఒక్కోసారి జీవితంలోనూ అలాంటి ఎండమావుల్ని ఎదుర్కోవాల్సి ఉంటుంది నందూ! వర్ణ మంచిపిల్ల! ముందు తనేమన్నా ఆపదలో ఉందేమో చూడు!" అని కొడుకుని ఒక పక్క అనునయిస్తూనే, కర్తవ్యాన్ని స్పష్టం చేసి చూపింది శ్యామల.

తల్లి మాటలు విని ఆశ్చర్యపోతూ, 'ఈ ఆలోచన నాకెందుకు రాలేదు?' అనుకున్నాడు. తనని తానే తిట్టుకున్నాడు నందూ. 'ఎదుటివాళ్ళకి ఎదురయ్యే అనుభవాల్ని చూసి విశ్లేషించుకుని జాగ్రత్తపడే నేను, నా జీవితంలో అలాంటి అలజడిని ఫేస్ చెయ్యగానే తట్టుకోలేకపోయానా?' అని ఆశ్చర్యంగా అనుకున్నాడతను.

తల్లి మాటలతో తేరుకుని ఆలోచనలోపడ్డాడు నందూ. అతనలా ఆలోచిస్తూ ఉండగానే నందూ సెల్ రింగైంది. అందులోని ఇన్‌కమింగ్ కాల్ తండ్రి నుంచి అని చూడగానే ఎలర్ట్ అయ్యాడు. "హలో నాన్నా..!" అన్నాడు.

"నందూ! ఎక్కడున్నావ్‌రా? నేను నీ కాలేజ్‌కి వచ్చాను. నువ్వు లీవ్‌లో ఉన్నావని చెప్పారు. ఏమైంది? కాలేజ్‌కి సెలవు పెట్టావట! ఒంట్లో బానే ఉంది కదా! నీ ఇంటి అడ్రెస్ చెప్పు! వస్తాను" అని ఆత్రుతగా అడిగారాయన.

ఆయన ఇంటికి వస్తే, తల్లిని చూస్తారన్న కంగారుతో "వద్దొద్దు నాన్నా! నేను

## కొత్తగాలి...

**పుట్టింటి ప్రేమ**
**పన్నీటిమయం**
**అత్తింటి ప్రేమ**
**కట్నకానుకలమయం!**

– సోంపాక సీత,
భద్రాచలం, ఖమ్మం జిల్లా

ఇంట్లో లేను. బయటకు వచ్చాను. అది సరే! మీరు కాలేజీకి ఎందుకు వెళ్ళారు? నాతో ఏమైనా పనా? ఒక్కఫోన్ చేస్తే నేనే మీ దగ్గరికి వచ్చేవాణ్నిగా!" అని తండ్రి అక్కడకు వెళ్ళిన కారణం తెలుసుకోవాలని ఆదుర్దాగా అడిగాడు నందూ.

ఒక క్షణం మౌనంగా ఉండిపోయారు తులసీరామ్‌గారు. ఆ తరువాత, "మీ అమ్మ కనిపించట్లేదని పోలీస్ రిపోర్ట్ ఇవ్వడానికి బయల్దేరాను. నిన్ను తీసుకువెళదామని నీ కాలేజీకి వచ్చాను" అని గద్గదమవుతున్న గొంతుతో అన్నారాయన.

తండ్రి మాటలకి ఉలిక్కిపడ్డాడు నందూ. తల్లేమో తన దగ్గరే ఉంది. అటు తండ్రేమో కంగారు పడుతున్నాడు. ఇప్పుడేం చెయ్యాలన్న సందిగ్ధంలో ఉండిపోయాడు కొన్ని సెకన్లు.

"సరే! నిన్ను ఇబ్బంది పెడుతున్నట్టున్నా, ఉంటానురా!" అని నిర్భావంగా ఫోన్ కట్ చెయ్యబోయారు ఆయన.

"నాన్నా! నేను అర్జెంట్ వర్క్ ఉండి వేరే ఊరు వచ్చాను. అక్కడకు రాగానే ఫోన్ చేస్తాను. ఇద్దరం కలిసి పోలీస్ రిపోర్ట్ ఇద్దాం" అన్నాడు నందకిషోర్.

చిన్నగా నిట్టూర్చి "సరే! ఉంటాన్రా!" అన్నారాయన.

"మీ ఆరోగ్యం జాగ్రత్త నాన్నా! ఒక్కరే

## కొత్తగాలి...

**నిదుర దూరంగా ఉందని**
**కిటికీ తీశాను**
**వెన్నెల వైఫైలా**
**చుట్టేసుకుంది!**

– బొడ్డు గోవిందరాజు,
మన్యంవారిపాలెం, తూ.గో. జిల్లా

పోలీస్టేషన్‌కి వెళ్ళిపోకండి! నేనూ వస్తాను!" అని మరీమరీ చెప్పాడు నందూ.

"ఊఁ!" అని నిర్లిప్తంగా అన్నారాయన.

★ ★ ★

అమెరికాలో ఉదయం పది గంటలవుతోంది సమయం.

ఆఫీస్ రూమ్ బయట.. నందన్ రూమ్‌లో మర్చిపోయిన తన సెల్‌ఫోన్‌ని తెచ్చిన రాగా దగ్గర నుంచి ఫోన్ తీసుకుని ఏదో మాట్లాడుతోంది వర్ణ.

బంగారు జరీ ఉన్న లేత ఎరుపురంగు చీరలో, రాగా పక్కన కనిపించిన వర్ణని చూడగానే నందన్ కళ్ళు మెరుపుతో పెద్దవయ్యాయి. పెద్ద అంగల్తో ఆమె దగ్గరకు వచ్చి "హాయ్ వర్ణా! నీ ఫోన్ తీసుకున్నావా?" అని నవ్వుతూ అడిగాడు.

అతని వంక సీరియస్‌గా చూసింది వర్ణ. వెంటనే తన పర్స్‌లోంచి సీడిని తీసి, అతని కళ్ళముందు పెట్టి పట్టుకుంది. సీడీ మీద 'వర్ణ' అని తన చేతిరాతతో రాసిన తెలుగు అక్షరాల్ని చూడగానే ఉలిక్కిపడ్డాడు నందన్.

"వర్ణా! ప్లీజ్ లిజన్! నేను నిన్ను ఫస్ట్ టైం చూసినప్పుడే చాలా ఇంప్రెస్ అయ్యాను. బట్ నీకు మ్యారేజ్ అయ్యిందని తెలీదు. స్టిల్ ఐ లవ్ యూ" అంటూ ఇంకేదో చెప్పబోయాడు నందన్.

కానీ, అప్పటికే గాలిలోకి లేచిన ఆమె చేయి నందన్ చెంపని బలంగా తాకింది.

అంతే! అక్కడే ఉన్న రాగాతో పాటూ కొంచెం దూరంలో ఉన్న మరికొందరూ షాకింగ్‌గా చూశారు.

ఎఱ్ఱచీర కట్టుకున్న వర్ణలోని ఉద్వేగమూ ఎఱ్ఱగా మారింది. కోపమూ, అసహ్యమూ నిండిన భావంతో సీడీ వంక చూపిస్తూ "యూ బ్లడీరోగ్! ఇలా ఇంప్రెస్ అయ్యేవాడు నా దృష్టిలో.." అంటూ అతన్ని చాలా తిట్టాలని ఉన్నా ఆ మాటల్ని పలకడం ఇష్టం లేక ఆపేసిందామె. వెంటనే, సీడీని పట్టుకుని చకచకా ఛైర్మన్ రూమ్ వైపు నడిచింది వర్ణ.

సరిగ్గా అప్పుడే "వర్ణా! యూ హావ్ ఎ పార్శిల్! ఫ్రామ్ ఇండియా.." అని ఎవరో గట్టిగా అరిచారు.

ఆ అరుపుకి ఉలిక్కిపడి, తన ఎమోషన్ లోంచి బయటకొచ్చి చూసింది వర్ణ. వర్ణని పిలిచిన కొలీగ్‌తో పాటూ పార్శిల్ పట్టుకుని వచ్చినతను దాన్ని వర్ణ చేతికిచ్చాడు.

'ఇండియా నుంచీ పార్శిలా?' అనుకుంటూ దాని వంక చూసింది వర్ణ. పార్శిల్ మీద 'ఫ్రమ్ నందకిషోర్, విత్ లవ్' అని కనిపించగానే వర్ణ కళ్ళలోని కోపమంతా ఆవిరైపోయింది. దానిని తీసుకున్న తరువాత ఓపెన్ చేసి చూడకుండానే, చకచకా ఛైర్మన్‌గారి దగ్గరకు వెళ్ళింది వర్ణ.

★ ★ ★

తెల్లవారుఝామున.. నిద్ర లేవగానే నందూ మనసులో వర్ణ మెదిలి, సన్నని చిరునవ్వుతో ఆమెని తలుచుకుంటూ తన ఫోన్ తీశాడు.

ఈ రోజు తమ పెళ్ళిరోజు! మొట్టమొదటి పెళ్ళిరోజు! వర్ణకి విషెస్ చెబుదామని అర్ధరాత్రే ఫోన్ చేశాడతను. కానీ.. లైన్ కలవలేదు. ఇప్పుడు రింగ్ చేసినా కలవకపోవడంతో ఫోన్‌ని పక్కన పెట్టి సోఫాలోంచి లేచాడు.

తల్లికోసం చూస్తుంటే, రాత్రి నిద్రపోయే ముందు తల్లికీ, తనకీ తండ్రి విషయంలో జరిగిన సంవాదన మెదిలింది నందూకి. తల్లి ఎక్కడుందోనని పిలిచాడు. ఆవిడ వంటగదిలోంచి పలికింది. తల్లి దగ్గరకొచ్చి "అమ్మా!" అని మళ్ళీ పిలిచాడు నందూ.

తల తిప్పి చూసి మరుక్షణంలోనే కొడుకు ఏమడుగుతాడో తెలిసినట్టు నందూని పట్టించుకోకుండా పనిలోపడిందామె.

"ఏం ఆలోచించావు? అక్కడాయన టెన్షన్ పడుతున్నారు. పోలీస్ కంప్లయింట్ ఇద్దామంటున్నారు. ఆయనకి ఏదో ఒకటి చెప్పాలిగా? " అని సందిగ్ధంగా అడిగాడు.

శ్యామల చేతిలోని చాకు ఒక క్షణం ఆగింది. మళ్ళీ క్యారెట్‌ని ముక్కలుగా కోయడంలో పడిపోయింది శ్యామల. స్టవ్ వెలిగించి దాని మీద చిన్న మూకుడును పెడుతూ, "ఆలోచించాల్సింది ఇప్పుడు కాదు నందూ! ఆ రోజు..! మీ నాన్నగారు ఆ కండిషన్ పెట్టిన రోజే నేను మళ్ళోసారి ఆలోచించి ఉండాల్సింది! అంతా అయిపోయాక ఇప్పుడాలోచించినా ప్రయోజనం ఉండదు" నిర్లిప్తంగా అందావిడ.

"గౌరీలక్ష్మి ఆఫీసుకి వచ్చిందని చెప్పారు గానీ, నాన్న మళ్ళీ ఆ కండీషన్ గురించి ఏమీ మాట్లాడలేదన్నావ్‌గా.." అంటున్న నందూ మాటలకి అడ్డుతగిలింది శ్యామల.

"మీ నాన్న మాట్లాడలేదు. కానీ, గౌరి అడిగిందిగా! 'నేను రాగానే నిన్ను వదిలేస్తానని తులసీ అన్నాడట కదా! తులసీకి చెప్పి ఊళ్ళోని ఇల్లు నీ పేరు మీద రాయిస్తాలే!' అని గౌరి అందంటే దానర్థం ఏంటి నందూ? " అంది శ్యామల.

"ఆవిడెవరో వెళ్ళిపొమ్మంటే నువ్వు ఎలా వచ్చేస్తావమ్మా? పాతికేళ్ళు నన్నూ, నాన్ననీ ప్రాణంగా చూసుకున్నావు. ఎవరో వచ్చి ఇది వాళ్ళ స్థానం అంటే తీసుకో అని వదిలేసి వచ్చేస్తావా!" అని కొంచెం విసురుగానే అడిగాడు నందూ.

చేస్తున్న పనాపి నందూ వైపు తిరిగింది శ్యామల. "మీ నాన్నా, గౌరీ కలిసి పెరిగారు నందూ! వాళ్ళ అనుబంధం వేరు. గౌరి ఆయనని వదిలి వెళ్ళిపోయి ఇన్నేళ్లయినా ఆమె మీద ఆయనలో ఉన్న భావం అలాగే ఉండిపోయింది. గౌరి ఆ రోజు కాలేజీకి వచ్చిందని చెప్పినప్పుడు కూడా.. ఆయన గౌరి పరిస్థితికి చలించిపోవడం స్పష్టంగా తెలిసింది నాకు" అని నందూ వంక స్థిరంగా చూస్తూ చెప్పింది శ్యామల.

తల్లి వంక దిగులుగా చూస్తూ "అలాగని నాన్ననొదిలి ఎలా ఉంటావమ్మా? " అని గద్గదంగా అడిగాడు నందూ.

"నేను నా ఒక్కదాని గురించి మాత్రమే ఆలోచించట్లేదురా. దేవుడు మా ముగ్గురి జీవితాల్నీ చిత్రంగా ముడేశాడు. ఒకరు తెరమీదకు వస్తే మరొకరు తెర వెనకకు వెళ్ళాల్సిందే!" అని తనలో తాను అనుకుంటున్నట్టు చిన్నగా అందావిడ.

"ఆవిడ నాన్నతో మహా అయితే ఒక సంవత్సరం కలిసుందేమో! నువ్వు పాతికేళ్ళు నాన్నతోనే ఉన్నావు. నన్నూ, నాన్ననీ వదిలి కనీసం మీ వాళ్ళ ఇంటికి కూడా ఎప్పుడూ వెళ్ళలేదు. నాన్న మీద ఆవిడ కంటే నీకే ఎక్కువ హక్కు ఉంటుందమ్మా! నేను చెబుతున్నాగా!" అంటూ స్టవ్ బర్నర్‌ని ఆఫ్ చేసి తల్లి చేయి పట్టుకుని లాగి, తండ్రి దగ్గరకు వెళదామన్నట్టుగా ఆ గదిలోంచి బయటకు తీసుకురాబోయాడు నందూ.

ఆవిడ ఉన్న చోటు నుంచి కదలకుండా, "నందూ! హక్కు అనేది కాలానికి అతీతం. అది మనసులోంచి రావాలి. నాన్నకి ఆవిడ రక్తసంబంధం. వాళ్ళు కాపురం చేసింది సంవత్సర కాలమే అయినా వాళ్ళిద్దరికీ అది మొదటి పెళ్ళి. వాళ్ళు పంచుకునే అనుభవాలు వేరు, వాటి గాఢత వేరు. గౌరి వెళ్ళిపోవడం వల్ల నేను

## కొత్తగాలి...

**చదువు**
**చిన్న విత్తనం లాంటిది**
**అది మహావృక్షమై నీకేకాదు**
**పదిమందికీ నీడనిస్తుంది!**

– కాళ్ల గోవిందరావు,
ఆముదాలవలస, శ్రీకాకుళం జిల్లా

ఆయన జీవితంలోకి వచ్చాను. కానీ, ఆయన మనసులోంచి గౌరీ వెళ్ళలేదు. ఇది నీకు నేను చెప్పినా అర్థం కాదురా! రెండో పెళ్ళి చేసుకుని నాన్న నాతో కలిసి ఒకే ఇంట్లో ఉన్నా, మా మనసులూ శరీరాలూ కలవడానికి చాలా సంవత్సరాలు పట్టింది. ఆ కలవడం కూడా గౌరిని మర్చిపోయే ప్రక్రియలో ఒక భాగంగానే జరిగింది. ఎన్ని అడ్డంకులూ, ఆటంకాలూ వచ్చినా మొదటి అనుభవాలు మనసుల్లో గూడుకట్టుకుని ఉండిపోతాయి నందూ! ఒకసారి మనసులు కలిశాక, మధ్యమధ్యలో వచ్చే ఆటుపోట్లూ ఆకర్షణలూ ఎంత బలమైనవైనా, ఏదో ఒకరోజు అవి కరిగిపోవాల్సిందే! నా జీవితంలాగా!" అని చిన్నగా నిట్టూర్చింది శ్యామల.

"అది కాదమ్మా! ఒకసారి నాన్న దగ్గరికి వెళదాం! నాన్నతో నేను మాట్లాడతాను!" అని తల్లిని ఒప్పించబోయాడు అతను.

"వద్దు నందూ! నాన్నా నేనూ కలిసున్న ఈ పాతికేళ్ళ జీవితం మాత్రమే నీకు తెలుసు. కానీ నేను.. గౌరి, ఆయనా కలిసి పెరగడాన్ని కూడా చూశాను. నా కళ్ళారా చూశాను. వాళ్ళ అనుబంధం ఎంత బలమైందో నీకంటే నాకే బాగా తెలుసు. ఇకీ విషయం గురించి మర్చిపో!" తల దించుకుని చెప్పింది శ్యామల.

తల్లి తీసుకున్న కఠిన నిర్ణయానికి కదిలిపోయాడు నందకిషోర్. వర్ణలా, మిగిలిన ఆడవాళ్ళలా తల్లి ఎప్పుడూ ఆనందంగా నవ్వుతూ తుళ్ళుతూ ఎందుకు ఉండేది కాదో ఇప్పుడు అర్థమవుతోంది అతనికి.

ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా తలని నిదానంగా ఊపి, అక్కడ నుంచి భారంగా కదిలాడు నందూ.

వెళ్ళి స్నానం చేసి, రెడీ అయ్యి చిన్న పనుందని చెప్పి, బైక్ వేసుకుని ఇంట్లోంచి బయటకు వచ్చాడు అతను.

తండ్రి తులసీరామ్‌గారికి ఫోన్ చేసి, తల్లి తన దగ్గరకు వచ్చిందని మెల్లగా చెప్పాడు నందూ.

"శ్యామల నీ దగ్గరకు వచ్చిందా! నేను ఎక్కడెక్కడో వెతుకుతున్నాను కదరా! ఎలా ఉంది? ఎప్పుడొచ్చింది?" సంతోషం నిండిన గొంతుతో ఆత్రుతగా అడిగారు తులసీరామ్‌గారు.

"నేను ఇంటికి వస్తున్నాను నాన్నా!" అన్నాడు నందూ.

"అమ్మని తీసుకొచ్చెయ్‌రా!" అన్నారు. నందూని ఎన్నో ప్రశ్నలు గజిబిజి పెడుతున్నాయి. "ట్రై చేస్తా నాన్నా!" అన్నాడు.

"అలాగే!" అని ఫోన్ కట్ చేశారాయన.

తిన్నగా తండ్రి ఇంటికి వచ్చి, తలుపు తట్టాడు నందకిషోర్.

నాలుగు నిముషాలకి తలుపు తెరుచుకుంది. గౌరి వచ్చి తలుపు తీస్తుందని ఊహించిన అతనికి ఎదురుగా పెరిగిన గడ్డంతో, మాసిన బనీనుతో ఉన్న తండ్రిని చూడగానే ఆశ్చర్యం కలిగింది.

ఎదురుగా కొడుకుని చూసి ఆనందంగా చిరునవ్వు నవ్వారు తులసీరామ్‌గారు. 'శ్యామల ఏదీ?' అన్నట్టుగా ఆసక్తితో వెంటనే నందూ వెనక చూశారు.

తండ్రి భావాన్ని గ్రహించాడు నందూ. కానీ, వెంటనే నందూకి.. ఆయన తన తల్లి శ్యామలకి పెట్టిన కండీషన్ గుర్తొచ్చింది. అంతే! తండ్రి కళ్ళలోకి సూటిగా

చూస్తూ, "మీ మొదటి భార్య రాగానే అమ్మని వెళ్ళిపోవాలని కండీషన్ పెట్టారట కదా! ఆవిడ ఇక్కడే ఉంటే, అమ్మ ఇక్కడికి ఎలా వస్తుంది?" అని సీరియస్‌గా అడిగాడు.

కొడుకు మాటలకి ఖంగుతిన్నారు తులసీరామ్‌గారు. ఏం మాట్లాడలేక ఇంట్లోకి నడిచారు ఆయన.

తండ్రి వెంట అయిష్టంగా లోపలకి వచ్చాడు నందూ. అతను తల్లి గురించి తండ్రితో పోట్లాడటానికి వచ్చాడు. తండ్రి ఒక్కడితోనే కాదు, ఆ గౌరీలక్ష్మిని కూడా ఎన్నో అడగాలనీ, తననీ నాన్ననీ వదిలేసి అప్పుడు ఎలా వెళ్ళిపోయావ్..? ఇప్పుడు ఎందుకు వచ్చావ్..? అని నిలదియ్యాలనీ ఇక్కడకు వచ్చాడతను.

ఇంట్లో ఏ అలికిడీ లేకపోవడంతో అటూ ఇటూ చూశాడు నందూ. ఎక్కడా ఆవిడ ఉన్న జాడ కనిపించలేదు.

వాలు కుర్చీలో కూర్చుంటున్న తండ్రిని చూసి "నేను వర్షని పెళ్ళి చేసుకుంటాను అన్నప్పుడు మీరేం చెప్పారో గుర్తుందా నాన్నా? నా మిత్రుడికి ఇచ్చిన మాటని నువ్వు నిలబెట్టలేదు, నా పేరు చెడగొట్టావు అన్నారు, ఇంకా అదీ ఇదీ అని ఏదేదో అన్నారు. నిజమే నాన్నా! మీకు చాలా మంచి పేరుంది, నేను మీ మంచి పేరుని చెడగొట్టాను. మీరు అన్నవన్నీ నిజమే! అందుకే ఎప్పుడో పాతికేళ్ళ క్రితం అమ్మదగ్గర తీసుకున్న మాట కోసం, అమ్మని ఈ రోజు దిక్కులేనిదానిగా చేశారు.." అని తండ్రి వంక ఉక్రోషంగా చూస్తూ అన్నాడు నందూ.

కనుబొమల్ని ముడిచి, కొడుకు వంక విస్తుపోయి చూస్తున్నారాయన.

"సంవత్సరం కూడా మీతో కలిసి లేని మీ అక్క కూతురు కోసం, మిమ్మల్నీ నన్నూ వదిలేసి వెళ్ళిపోయిన ఆవిడ కోసం.. పాతికేళ్ళు మిమ్మల్ని నమ్ముకుని, మీరే లోకంగా బతికిన అమ్మని ఇంట్లోంచి గెంటేశారు.." అంటుండగానే..

కుర్చీలోంచి చర్రున లేచి, "నందూ!" అని గట్టిగా అరిచారాయన.

"కోపం వస్తోందా నాన్నా? వస్తుందిలే! ఆవిడ వచ్చి అమ్మని ఎన్నో అన్నా మీకు కోపం రాలేదుగానీ, నేను ఆవిణ్ని ఒక్క మాట అంటే కోపం వస్తోందా మీకు?" అని కచ్చగా అన్నాడు నందూ.

"నందూ! ఒక నిముషం ఆగరా!" అని గబగబా లోపలకు వెళ్ళారు తులసీరామ్‌గారు. నిమిషాలు గడుస్తున్నాయి. బయటకు రావడం లేదు. తండ్రి కోసం అసహనంగా ఎదురుచూస్తున్నాడు నందూ.

పది నిమిషాల తర్వాత ఇంట్లోంచి ప్యాంటూ షర్టుతో బయటకు వచ్చారు తులసీరామ్‌గారు. "నీకు సమాధానాలు చెప్పాల్సింది నేను కాదు.. నాతో రా!" అంటూ నందూ చెయ్యి పట్టుకుని బయటకు తీసుకొచ్చి, ఇల్లు తాళం వేశారు ఆయన.

మధ్యాహ్నం పన్నెండు గంటలవుతుంటే, వాళ్ళిద్దరూ తులసీరామ్‌గారి సొంత ఊరు చేరుకున్నారు. నందూని తీసుకెళ్ళి గౌరి ముందు నిలబెట్టారు ఆయన.

హఠాత్తుగా వచ్చిన వాళ్ళిద్దర్నీ చూసి ఖిన్నురాలైంది గౌరీలక్ష్మి.

"గౌరీ! నందూ ఏదేదో అంటున్నాడు. ఆ రోజు ఏం జరిగిందో నిజం చెప్పు! శ్యామల తానుగా వెళ్ళిపోతానందా? నువ్వే తనని వెళ్ళిపొమ్మన్నావా? నేను శ్యామల దగ్గర పెళ్ళికి ముందే మాట తీసుకున్న విషయం నీకెలా తెలిసింది?" అని సూటిగా గంభీరంగా అడిగారు తులసీరామ్‌గారు.

ఆ గంభీరంలో అదృశ్యంగా గద్దింపు కూడా కనిపించింది గౌరికి. ఏ రోజూ ఒక్కమాట కూడా అని ఎరుగని తులసీ ఇప్పుడు అంతెత్తు ఉన్న కొడుకుని ముందు పెట్టి నిలదీస్తుంటే నిజం చెప్పడం కన్నా వేరే దిక్కు తోచలేదు ఆవిడకి.

"నేను ఇక్కడకి తిరిగి రాగానే నన్ను చూసి మన ఊరిలోనే ఉన్న శ్యామల అన్నయ్య వచ్చాడు. శ్యామల జీవితాన్ని నాశనం చేయొద్దని బతిమాలాడు. అదేం టని అడిగితే, నువ్వు తీసుకున్న మాట గురించి చెప్పాడు. అది వినగానే నీ మంచి మనసు తెలిసొచ్చింది తులసీ. వెంటనే నీ కోసం మీ ఆఫీస్‌కి వచ్చి కలి శాను. కానీ, నువ్వేమో ఇంకెప్పుడూ రావ ద్దని చెప్పావు. ఇంక ఇక్కడకు వచ్చేశాను. శ్యామలకి ప్రమాదం జరిగిందనీ, చావు బతుకుల్లో ఉందనీ తెలిసి నువ్వు ఒంటరి వాడివి అయిపోతావేమోనని మళ్ళీ వచ్చాను. శ్యామల ఇన్నేళ్ళు నా స్థానంలో ఉంది. నేను పొందాల్సినదంతా అదే అను భవించింది. అందుకే ఇకనైనా తనని వచ్చిన చోటకే పొమ్మన్నాను. కావాలంటే ఈ ఇల్లు రాసిద్దామనుకున్నాను కూడా! నేనలా అనగానే శ్యామల ఇంట్లోంచి వెళ్ళి పోయింది. తనెక్కడకు వెళ్ళిందో నాకు తెలీదు. అందుకే శ్యామల వెళ్లడాన్ని చూడ లేదని నీతో అబద్ధం చెప్పాను. నేనేమైనా తప్పు చేసుంటే అది నీతో అలా అబద్ధం చెప్పడం మాత్రమే తులసీ. కానీ నువ్వే శ్యామలతో అప్పుడలా చెప్పి, నాకు లేని పోని ఆశలు కల్పించి, ఇప్పుడు నా దారి నన్ను చూసుకోమన్నావు!" నిలదీస్తున్న ట్టుగా అంది గౌరీ.

గౌరి వచ్చిన రోజున ఏం జరిగిందో? అది శ్యామలని ఎంతగా కలతపెట్టిందో? తులసీరామ్‌గారికీ, నందూకీ అర్థమైంది.

కొడుకువంక ఓసారి చూసి గబగబా బయటకు నడిచారు తులసీరామ్.

"తులసీ! తులసీ! ఆగు తులసీ!" అంటూ ఆయన వెంట గబగబా బయటకు వచ్చింది గౌరీలక్ష్మి.

తులసీరామ్ ఒక క్షణం ఆగి వెనక్కి తిరిగి చూశారు. గౌరినీ, ఆ వెనకే వస్తున్న నందూనీ చూడగానే ఆయనకు వెంటనే శ్యామల గుర్తుకొచ్చి గుండె లోతుల్లో కలు క్కుమంది. తాను భర్తగా ఆమెకి అందిం చింది చాలా తక్కువ సుఖసంతోషాలే అయినా, శ్యామల ప్రతిక్షణాన్నీ తన కోసం, తన బిడ్డకోసమే వినియోగించింది. ఆమె తనకి రెండో భార్య అన్న విషయాన్ని తానే మర్చిపోయేలా చేసింది.

గౌరి వదిలేసిపోయిన ఆమె బిడ్డ నం దూని శ్యామల తన బిడ్డలా పెంచింది.. అనుకుంటుంటే తులసీరామ్‌గారికి మొట్ట మొదటిసారిగా ఇప్పుడొక సందేహం మెరు పులా తొంగిచూసింది. ఆ వెంటనే ఏదో అర్థమయ్యీ.. కానట్లయింది ఆయనకి.

తానెంత మూర్ఖుడిలా ఉన్నాడంటే, కనీ సం శ్యామలకి సంతానం ఎందుకు కలగలే దన్న విషయాన్ని కూడా ఈ క్షణం వరకూ పట్టించుకోనంత! అనుకోగానే తన మీద తనకే కోపం ,వచ్చింది తులసీరామ్‌గారికి.

ఆయన్నే తానుగా భావించి ఇన్నేళ్ళ పాటూ ఆయన జీవితంలో ఇమిడిపోయిన శ్యామల.. ఇప్పుడు ఆయన దేహంలో ఒక భాగంగా అనిపిస్తుంటే 'నేను' అనేదంతా శూన్యంగా కనిపించింది తులసీరామ్‌గారికి.

గబగబా వెళ్ళిపోతున్న తులసీరామ్‌గారి వెనక గౌరీలక్ష్మి, ఆవిడ వెంట నందూ వేగంగా వచ్చారు.

"నన్ను క్షమించు తులసీ!" అని గట్టిగా అంది గౌరీలక్ష్మి.

ఆయన వెనక్కి తిరిగి, "ఇంక చాలు గౌరీ! జరగకూడనిదంతా జరిగిపోయింది. నువ్వు వస్తే శ్యామల వెళ్ళిపోవాలని మాట తీసుకున్నది నీకోసమే! నెలకో, ఏడాదికో గాయపడిన మనసుతో నువ్వు తిరిగొస్తావ నుకున్నాను. వచ్చి నేను రెండో పెళ్ళి చేసు కున్నానంటే నువ్వు ఇంకా గాయపడతావని అలా చేశాను. ఆ రోజు శ్యామలని బాధ పెడుతున్నానని తెలిసినా ఆ మాట తీసు కున్నాను. కానీ ఇప్పుడు పాతికేళ్ళ తర్వాత నువ్వు వచ్చి శ్యామలనే కాదు, నన్నూ

# మనసున ఉన్నదీ...

★ చతుర జూన్ సంచికలో అలపర్తి రామ కృష్ణ నవల 'జీవనలిపి' ఏకబిగిన చదివించింది. సమాజంలో వివిధ రకాల మనుషుల మనస్తత్వాలను, అందుకు దోహదం చేసే రకరకాల సంఘటనలు, సంఘర్షణలు జీవన పరిణామంలో ఒక అంతర్భాగమే అయినా ఈ నవలను నడిపించిన తీరు, పాత్రల నిడివి రీత్యా అద్భుతంగా చిత్రీకరించారు. డబ్బు జీవితంలో ఒక భాగమే కానీ డబ్బే జీవితం కాదని కొన్ని పాత్రల ద్వారా చెప్పించిన తీరు చాలా బాగుంది. డి. హెచ్. లారెన్స్ ఆంగ్లకథకు ఎ. వి. రెడ్డిశాస్త్రి అనువాదం 'కొయ్యగుర్రపు విజేత' బాగుంది. ఎంతసేపూ మరికొంత డబ్బు కావాలి అనే యావ గల కుటుంబ పెద్దల పాత్రల్ని చక్కగా చిత్రించారు. 'నవలావలోకనం'లో బొల్లిముంత శివరామకృష్ణగారి 'మృత్యుంజయులు' నవలపై విశ్లేషణ చక్కగా సాగింది. శీర్షికలన్నీ అర్థవంతంగా దాచుకునే రీతిలో ఈ నెల సంచికను అందించారు.

**– శ్రీదాస్యం లక్ష్మయ్య,** హుస్నాబాద్

★ చతుర జూన్ సంచికలో రోహిత ముఖచిత్రం చూడముచ్చటగా ఉంది. అలపర్తి రామకృష్ణ నవల 'జీవనలిపి' ఎంతో ఉత్కంఠభరితంగా చిత్రమైన మలుపులతో సాగింది. 'కొత్తగాలి' కవితలు ఆహ్లాదకరంగానూ, ఆలోచింపదగినవిగానూ ఉన్నాయి. చతురసమ్'గతులు యువతకు విజ్ఞాన భాండాగారం!

**– పక్కి బాలకృష్ణారావు,** విజయనగరం

★ 'జీవనలిపి' నవల పేరుకు తగ్గట్టుగా చక్కని వ్యవహార శైలిలో, అందరికీ అర్థమయ్యే రీతిలో ఉంది. ఆదర్శోన్ముఖ యదార్థవాద రచనగా ఈ నవలను చెప్పుకోవచ్చు. ఉన్నంతలోనే సమాజానికి తోడ్పడండి అన్న సందేశం గోచరిస్తుంది. సమాజంలో జరిగే ప్రతి అన్యాయాన్నీ వేలెత్తి చూపడమే కాకుండా చక్కని పరిష్కారాలు చూపారు రచయిత.

**– నండూరి లీలా ప్రసూనాదేవి,** సికింద్రాబాద్

★ 'జీవనలిపి' నవల మనిషి ఎలా జీవించాలో చెబుతుంది. మనిషికి 'జీవితం' ఒకసారి మాత్రమే లభించే అమూల్య కానుక. దాన్ని తీర్చి దిద్దుకోవాల్సిన బాధ్యత అతనిదే కదా? అందుకు కోటి కుటుంబం చక్కని ఉదాహరణ. చిరుద్యోగి, తక్కువ ఆదాయం అయినా ఆ కుటుంబంలో సుఖసంతోషాలకు కొదవలేదు. వారిలో పరోపకారభావన ఉంది. సంపూర్ణ తన బిడ్డల్ని తీర్చి దిద్దింది. సమాజోపకరణ నవల. రచయిత అభినందనీయులు. 'చతుర' యాజమాన్యానికి ధన్యవాదాలు.

**– ధవ్వూరి శ్రీధరాచార్యులు,** సీతారాంబాగ్, హైదరాబాద్

★ 'జీవనలిపి' నవల ఆద్యంతం ఆసక్తిగా సాగింది. ఉన్నంతలోనే ఎదుటివాళ్లకు సాయపడాలనే సంపూర్ణ మనస్తత్వం ఆకట్టుకుంది. స్నేహితురాలు మరణించడంతో ఆమె బిడ్డను తన పిల్లలతో సమానంగా పెంచడం అభినందనీయం. పెద్దకథ 'కొయ్యగుర్రపు విజేత' హృద్యంగా సాగింది. తల్లి బాధను పసిగట్టిన పాల్ ఆమె బాధను తీర్చే క్రమంలో మరణించడం విచారకరం. 'మృత్యుంజయులు' నవలపై విశ్లేషణ చక్కగా సాగింది. 'అక్షరం'లోని సూక్తులు పాటించదగినవి. 'భామనే సత్యభామనే..!' శీర్షిక ఆసక్తిగా సాగింది.

**– మణిదీప్,** హైదరాబాద్

★ 'కొత్తగాలి' కవితలు చాలా బాగున్నాయి. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నారు పెద్దలు. నాలుగు పంక్తుల్లో గొప్ప జీవితసత్యాన్ని మనసుకు హత్తుకునేలా చెప్పడంలో కవులు కృతకృత్యులయ్యారు. సందేశాత్మకమైన నవల'జీవనలిపి' చదువుతూ మధ్యలో ఈ చిరుకవితలు చూస్తుంటే కమ్మటి భోజనంలో వేడివేడి పకోడీలు నంజుకు తింటున్నట్లుగా హాయిగా వుంది.

– సత్యనారాయణ, తెనాలి

బాధపెట్టావ్. ఆ రోజు మన ఇద్దరి మధ్య బంధాన్ని నిలబెట్టుకోలేకపోయావ్. నేను నిలబెట్టాలని ఎంతో ప్రయత్నించాను. కానీ దానికిప్పుడు కాలం చెల్లిపోయింది గౌరీ. ఈ రోజు నా గుండెల్లో లేవు. నీకీ విషయం నువ్వు వచ్చిన రోజునే చెప్పాను. అయినా వినకుండా శ్యామలని కలిసి అబద్ధాలు చెప్పి, తను నాకు దూరమయ్యేలా చేశావ్.

ఈ రోజుకీ నీ స్వార్థమే తప్ప నా గురించి ఆలోచించలేకపోయావ్. ఇక మనిద్దరి ధార్లూ కలవడం జరగని పని గౌరీ! ఇంకెప్పుడూ నాకు కనిపించకు!" అని గంభీరంగా చెప్పి, వేగంగా గేట్లోంచి బయటకు నడిచారు తులసీరామ్‌గారు.

నిజాలూ అబద్ధాలూ కళ్ళముందు వేటికవి పొరలుగా విడిపోతుంటే తేలికైన మనసుతో గబగబా తండ్రి వెంట అడుగు లేశాడు నందూ. కానీ, తల్లి దగ్గర లేక ఆయన గుండె భారమైందని.. తిరుగు ప్రయాణంలో ఆయన కళ్ళల్లోని తడిని చూశాక గానీ అర్థం కాలేదు నందూకి. తండ్రిని తీసుకెళ్ళి తల్లి ఎదుట నిలబెట్టి జరిగిందంతా చెప్పాలనీ, తల్లి ముఖంలో ఎప్పుడూ చూడనంత సంతోషాన్ని కళ్ళారా చూడాలనీ అనిపించింది అతనికి.

సాయంత్రం అయిదు గంటలవుతుంటే నందూ సెల్‌ఫోన్ మోగింది. ఇంటి ఓనర్ ల్యాండ్ లైన్ నెంబర్‌ని చూడగానే అది తల్లి చేస్తున్న ఫోన్ అనీ తాను ఇంకా ఇంటికి రాకపోవడంతో కంగారు పడుతూ చేసిందని అర్థమైంది నందూకి.

వెంటనే తండ్రి వైపు చూశాడు. ఆయన ఫోన్ రింగ్ అయిన శబ్దానికి ఇటు చూసి మళ్ళీ తల తిప్పుకుని ఎటో చూస్తున్నారు.

"నాన్నా!" అని పిలిచాడు నందూ. ఆయన చూడగానే, "అమ్మ.." అని కాల్‌ని ఓకే చేసి సెల్‌ఫోన్‌ని తండ్రి చేతికిచ్చాడు.

తులసీరామ్‌గారి కళ్ళు ఆ సెల్‌ఫోన్ వంక అపనమ్మకంగా చూశాయి. ఆ వెంటనే సంభ్రమంతో వెలిగాయి. సెల్‌ఫోన్‌ని చెవి దగ్గర పెట్టుకుని, "శ్యామలా!" అని పిలిచారాయన.

అవతల శ్యామలకి ఒక్కక్షణం గుండె ఆగి మళ్ళీ కొట్టుకున్నట్లయింది. నందూకి ఫోన్ చేస్తే ఈయన మాట్లాడుతున్నారేంటి? అంటే నందూ ఆయన దగ్గరకు వెళ్ళాడా? ఆశ్చర్యపోయిందామె. ఊహించని ఈ పరిణామానికి భర్తతో ఏమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయిందామె.

భార్య మాట్లాడకపోయినా ఆమె భావాల్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు తులసీరామగారు. గౌరీ చేసిన తప్పుకు ప్రాయశ్చితం చేసుకోవాలనుకున్నారు. అందుకే పశ్చాత్తాపం నిండిన గొంతుతో, "శ్యామలా! నేను తులసీని కాదు, నీ భర్త తులసీరామ్‌ని శ్యామలా! నువ్వు వెంటనే ఇంటికి వచ్చేయ్ శ్యామలా!" అని బతిమాలుతున్నట్టుగా అన్నారాయన.

బదులుగా, "ఊఁ!" అని మాత్రం అంది.

తులసీరామ్‌గారు ఆత్రుతగా ఏదో అడగబోతుంటే, "ఉంటాను!" అని ఫోన్ రిసీవర్ పెట్టేసింది ఆవిడ. ఇన్నిరోజులుగా అల్లకల్లోలంతో ఉన్న ఆవిడ మనసు ఆయన గొంతు విని నిబ్బరం చెందుతూంటే, వెంటనే భర్తని చూడాలని, ఆయన సాంగత్యంలో సేద తీరాలని ఎంతో ఆరాటంగా అనిపిస్తోంది శ్యామలకి.

★ ★ ★

రాత్రి తొమ్మిది గంటల సమయం.

సరిగ్గా అప్పుడు.. కారుని చాలా వేగంగా డ్రైవ్ చేస్తోంది సుమణి. ఆమె కారు రాజీవ్‌గాంధీ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ వైపు దూసుకుపోతోంది.

కొన్నిక్షణాల క్రితం కూతురు వర్ణ ఫోన్‌లో మాట్లాడిన మాటలే సుమణి చెవుల్లో గింగుర్లు తిరుగుతున్నాయి. ఆరునెలల ఆన్‌సైట్ ట్రైనింగ్ కోసం యూఎస్ వెళ్ళిన

## కొత్తగాలి...

**భయం, దిగులు**
**కాకుల్లాంటివి!**
**వాటిని ధైర్యమనే**
**కర్రతో అదిలించాలి!**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

వర్ణ రెండు నెలలకే తిరిగి వచ్చేస్తుండడం ఆవిడకి అయోమయాన్ని కలిగిస్తోంది.

ఆ అయోమయానికి తోడు 'ఈ విషయం అప్పుడే డాడీకీ, నందూకీ చెప్పకు! నువ్వు మాత్రమే ఎయిర్‌పోర్టుకి రా!' అని వర్ణ ఆర్డర్ చెయ్యడం మరింత అలజడిని కలిగిస్తోంది సుమణికి.

హఠాత్తుగా వర్ణ ఇండియాకి తిరిగి వచ్చేస్తుందంటే అక్కడ ఏం జరిగిందో? వర్ణకి ఏమైందో? ఏమోనని చాలా ఆదుర్దాగా ఉంది సుమణికి. అందుకే ఉద్విగ్నంతో కారుని వేగంగా నడుపుతోంది.

మరికొన్ని నిమిషాలకి ఎయిర్‌పోర్టు ఏరియాలోకి చేరింది సుమణి కారు. హడావుడిగా పార్కింగ్ ముగించుకుని కంగారుగా లోపలకు వచ్చిందావిడ.

సరిగ్గా అప్పుడే "మమ్మీ!" అని సంతోషంతో పిలుస్తూ పరుగున వచ్చి తల్లిని గట్టిగా కరుచుకుపోయింది వర్ణ. వెళ్ళినప్పటికంటే కొంచెం సన్నబడినా స్నఫ్ కలర్ చీరలో కూతురు ఎంతో అందంగా కనిపించింది సుమణ కళ్ళకి.

ఎన్నో ఊహించుకుని భయపడిన సుమణికి సంతోషంగా ఉన్న కూతురు కళ్ళ ముందు కనిపించేసరికి ఆమెలోని భయాలన్నీ మటుమాయమయ్యాయి. ఆనందంగా వర్ణ చేతిని పట్టుకుని "ఎలా ఉన్నావ్ బేబీ? ఏంటింత సడెన్‌గా వచ్చేశావు? రాగా రాలేదా? " ఆత్రుతగా అడిగింది.

జరిగినదాన్ని తల్లికి చెప్పే ఉద్దేశ్యం అస్సలు లేనట్టుగా "మిమ్మల్నందర్నీ చూడాలనిపించింది. వచ్చేశా!" అని చెప్పి నవ్వింది వర్ణ.

"సడెన్‌గా వచ్చేస్తున్నావు, ఏమైందోనని ఇప్పటివరకూ ఎంతో టెన్షన్ పడ్డాను. రీజన్ చెప్పకుండా నన్ను ఇరిటేట్ చెయ్యడంలో నువ్వూ.. మీ నాన్నలా తయారవుతున్నావు! పదా! ఇంటికి వెళదాం!" అని చిరుకోపంతో అంటూ వర్ణ చేతిలోని ట్రాలీ సూట్‌కేసుని లాగి తీసుకుని ముందుకు నడిచింది సుమణి.

తల్లి కోపాన్ని చూసి చిరునవ్వు నవ్వుతూ "డాడీ నిన్ను చాలా ఇరిటేట్ చేసేవారన్న మాట!" అని మాట మార్చింది వర్ణ.

"ఆయనకు తోడు ఇప్పుడు నువ్వు తయారయ్యావుగా!" అలకగా అంది తల్లి.

కారు ఎయిర్‌పోర్ట్ సరౌండింగ్స్‌లో నుంచి సిటీలోకి ప్రవేశించింది.

"ఎక్కడికి? మన ఇంటికేనా? " అని అడుగుతూ కారు స్పీడ్ పెంచింది.

"ఊహుఁ! ఫస్ట్ అత్తయ్యని చూడాలి!" అని ఉత్సాహంగా చెప్పింది వర్ణ.

ఆమె మాటలకి ఆశ్చర్యపోయి చూసింది సుమణి. 'శ్యామల ఆ ఇంట్లోంచి వచ్చేసిన విషయం కూతురుకి తెలుసా? లేదా? ' అని మనసులో అనుకుంటూ కారుని నందూ ఉంటున్న ఇంటి రూట్‌లోకి మళ్ళించింది.

ప్రయాణ బడలికతో నందూని తలుచుకుంటూ రిలాక్స్‌గా కళ్ళు మూసుకుంది వర్ణ. నందూ గురించిన ఆలోచనల్లో, ఊహల్లో మునిగిపోయిందామె. కారు సడెన్‌గా ఆగడంతో కళ్ళు తెరిచి బయటకు చూసింది వర్ణ.

ఆమెకి పక్కగా ఉన్న మెయిన్ గేట్! చిరపరిచితమైన ఆ గేటుని చూసి ఆమె గుండె రెట్టింపు వేగంతో కొట్టుకుంది.

అమెరికా నుండి చెప్పకుండా వచ్చిన

తాను ఇప్పుడు నందూ ముందు నిలువబో తోంది. అది కూడా తమ మొదటి పెళ్ళి రోజున! ఈ రోజు, ఈ క్షణంలో.. తనని చూడగానే, నందూ భావాలు ఎలా ఉంటాయో అనుకుంటుంటే, ఎంతో ఉద్వి గ్నంగా, ఉత్కంఠగా ఉంది వర్ణకి.

అడుగులో అడుగువేస్తూ గేట్ తీసుకుని లోపలకు నడిచింది వర్ణ.

కారు లాక్ చేసి, పర్స్‌లోని సెల్‌ఫోన్‌ని తీసి చూసుకుంటూ, కూతురి వెంట నడి చింది సుమణి. ఫోన్‌లో ప్రతాప్‌గారి నుంచి ఉన్న మిస్డ్ కాల్స్, మెసేజెస్‌ని చూస్తూ ఆశ్చర్యపోయింది సుమణి.

ఎయిర్‌పోర్ట్‌లో సైలెంట్‌మోడ్‌లో పెట్టి న ఫోన్‌ని ఇప్పటివరకూ అలాగే ఉంచే శానా? అనుకుంటూ, భర్త పంపిన మెసే జెస్‌ని ఓపెన్ చేసి చూస్తూ నిదానంగా వస్తోంది సుమణి.

సమయం రాత్రి పదకొండు గంటలవు తోంది. హాల్లో లైట్ ఇంకా వెలుగుతూనే ఉంది. హాల్ మధ్యలో పెద్ద గొలుసుకు వేలాడుతున్న కేన్ ఛెయిర్‌లో కూర్చుని వర్ణకి ఫోన్ కలవట్లేదని చింతిస్తూ మళ్ళీ మళ్ళీ ట్రై చేస్తున్నాడు నందూ. అతను రాత్రి తొమ్మిది గంటలకు తండ్రిని తీసు కుని ఇంటికి వచ్చాడు.

ఊహించని విధంగా భర్త తులసీరా మ్‌ని వెంట బెట్టుకువచ్చిన కొడుకుని చూసి, ఆశ్చర్యపోయిన శ్యామల కొడుకు ద్వారా అంతా తెలుసుకుని కొంచెం కుదు టపడింది. ముగ్గురూ కలిసి భోజనం చేశాక తల్లిదండ్రుల్ని పడుకోమని చెప్పి, హాల్లోకొచ్చి కూర్చున్నాడు నందూ.

తమ పెళ్ళిరోజు మరో గంటలో ముగి సిపోతుంటే.. ఈ ఆఖరి క్షణాల్లో అయినా వర్ణని విష్ చెయ్యాలని అనిపించి పదేపదే ఆమె ఫోన్‌కి ట్రై చేస్తున్నాడు నందూ.

ఒక పక్కగా తెరిచిన కిటికీ గ్రిల్స్‌లోంచి బయటకు కనిపిస్తున్నాడు అతను. హా ల్లోని లైట్ వెలుతురులో స్పష్టంగా కనిపి స్తున్న నందూని ఆత్రంగా చూస్తూ ముం దుకు కదిలి కాలింగ్‌బెల్ నొక్కింది వర్ణ.

నందూ తలుపు తీయగానే.. బయట నిలబడ్డ వర్ణని చూసి ఉలిక్కిపడ్డాడు. అతను పెళ్ళిరోజు కోసమని కొని వర్ణకి ఒకరోజు ముందుగానే అందాలని యూఎస్‌కి పార్శిల్‌లో పంపిన స్నఫ్ కలర్ లైట్ వెయిట్ శారీ.. వర్ణ ఒంటిని సుతిమె త్తగా చుట్టుకుని ఉంది.

అంతే! ఇది కలో? నిజమో? అర్థంకాక అయోమయంగా చూస్తూ, "వర్ణా!" అని గట్టిగా అరిచినట్టే పిలిచాడతను. ఆ మరుక్షణంలోనే సంతోషంతో సుడిగాలిలా ఆమెని చుట్టేసి, రెండు చేతుల్తో ఎత్తి లోప లకు తీసుకెళ్ళాడు నందూ. ఆమెని సోఫాలో దించి "ఏంటి సర్‌ప్రైజ్! యూఎస్ నుంచి.. ఎలా..?" అంటూ ఇంకా షాకింగ్‌గా చూస్తూనే అడిగాడు.

వర్ణ అతన్నే చూస్తోంది.

రెండు నెలలు దూరంగా ఉన్నా తామి ద్దరిలో ఏ మాత్రం చెక్కుచెదరని అనుబం ధాన్ని చూసుకుంటోంది వర్ణ.

తన మీదకు వంగొని ఉన్న నందూ మెడలో రెండు చేతుల్నీ దండలా వేసి అతని కళ్ళలోకి చూస్తూ, "మనం ఒక్క టిగా కాక.. రెండుగా విడిపోతున్నామేమో అనిపించింది నందూ! అందుకే.. వచ్చే శా..!" అని ఉద్వేగంతో అతన్నే చూస్తూ గుసగుసగా చెప్పింది వర్ణ.

భర్త నుంచి వచ్చిన మెసేజ్‌ల్ని చదు వుతూ గుమ్మంలోంచి లోపలకు రాబో యిన సుమణి.. ఎదురుగా సోఫాలో ఉన్న వర్ణ, నందూల్ని చూసి గబుక్కున అడుగు వెనక్కు వేయబోయింది.

కానీ అప్పటికే.. షాకింగ్‌గానూ, ఆనం దంతోనూ నందూ అరిచిన అరుపులకి తులసీరామ్‌గారూ, శ్యామల బెడ్‌రూమ్‌లో నుంచి బయటకు వస్తున్న దృశ్యం సుమణి

చూపుల్ని పట్టి ఆపేసింది.

తులసీరామ్‌గారినీ, శ్యామలనీ కలిపి ఇక్కడ చూడగానే సుమణికి నోటమాట రాలేదు. ఒక పక్క యూఎస్ నుంచి వర్ణ వచ్చిన ఆశ్చర్యం, మరోపక్క తులసీరామ్ గారు శ్యామలా ఇద్దరూ ఇక్కడే ఉండడం.. ఇది ఎలా సాధ్యమైందో అర్థంకాక వెంటనే అడుగుల్ని వెనక్కు వేసింది.

వెంటనే గబగబా భర్తకు ఫోన్ చేసింది సుమణి. తనకి తెలియకుండా ఏదో జరిగిందని మాత్రం అనిపించింది ఆవిడకి.

అక్కడ.. భార్య ఎక్కడకి వెళ్ళిందా? అని కంగారుపడుతున్న ప్రతాప్‌గారు- సుమణి నుంచి ఫోన్ రావడంతోనే "హలో! సుమణీ! ఎక్కడున్నావ్? ఏమైంది?" అని ఆదుర్దాగా అడిగారు.

"పెతాప్! వెంటనే నందూ ఇంటికి రా!" అని హడావుడిగా చెప్పి, కాల్ కట్ చేసి, కంగారుగా ఇంట్లోకి వచ్చింది సుమణి.

వర్ణ, నందూ ఇద్దరూ అతని తల్లిదండ్రుల కాళ్ళకి నమస్కరించారు.

తులసీరామ్‌గారూ, శ్యామల వాళ్ళిద్దర్నీ మనస్ఫూర్తిగా దీవిస్తూ పైకి లేపారు.

"మీరు ఇలాగే అన్యోన్యంగా జీవితకాలం కలిసుండాలి నందూ!" అంటూ కొడుకు తల నిమిరారు తులసీరామ్.

"ఈ రోజుతో మా పెళ్లయి సంవత్సరం అయింది నాన్నా!" అని చిరునవ్వుతో చెప్పాడు నందూ.

వెంటనే ఒక్కసారిగా కొడుకుని గుండెలకు హత్తుకుని "నా పంతంతో ఇన్నిరోజులూ నిన్ను చాలా బాధ పెట్టానురా!" అని గాద్గదికంగా అన్నారాయన.

ఆ తండ్రీ కొడుకుల మధ్య అనురాగాన్ని సంతోషంగా చూస్తోంది వర్ణ.

కోడలు వంక ఎంతో వాత్సల్యంగా చూశారు తులసీరామ్‌గారు. వర్ణ గురించి ప్రతాప్ మాటల్లో ఎంతో విన్న ఆయనకి కోడలిపై పుత్రికావాత్సల్యం కలిగింది.

"ఓఓఓ!! వాట్ ఎ మిరకిల్! అందరూ ఒకేచోటకి ఎలా వచ్చారు!? ఏరా బంగారు తల్లీ! ఒక్క ఫోన్ అయినా లేకుండా ఏంట్రా ఈ సడెన్ సర్‌ప్రైజ్!" అని అంటూ ఆ షాక్ ఇచ్చిన ఆనందంతో కనీసం షూని కూడా బయట విడువకుండా అలానే ఇంట్లోకి వచ్చేశారు ప్రతాప్‌గారు.

ఆయనని చూసి ఆనందంతో సుమణి, ప్రతాప్‌ల కాళ్లని కూడా తాకి ఆశీర్వాదాలు తీసుకున్నారు వర్ణ, నందకిషోర్‌లు.

నక్షత్రాలలాంటి కాంతితో వెలిగిపోతున్న ముఖాలతో ఉన్న తమ ఇద్దరి తల్లిదండ్రుల్నీ ఇలా తమ ఇంట్లో ఒకేచోట చూస్తుంటే సంతోషంగా, అంతకు మించిన సంతృప్తిగా ఉంది వర్ణ, నందూలకి.

కానీ అందరికీ మాత్రం వర్ణ విషయం ఇంకా గమ్మత్తుగానే ఉంది. యూఎస్ నుంచి హఠాత్తుగా వచ్చేసిందేంటని అందరూ వర్ణ వంక ప్రశ్నార్థకంగా చూశారు.

నందన్ సీడీ కలిగించిన ఏహ్యతతో, ఇంకా నందూని విడిచి అక్కడే ఉండలేక, నందన్ మీద కంప్లయింట్ చేసి మరీ ఛైర్మన్‌గారితో మాట్లాడి అప్పటికప్పుడు ఉన్న ఫ్లైట్‌కి వెంటనే బయల్దేరి వచ్చేసినట్టు బయటకు చెప్పలేదు వర్ణ.

నందూ ఆమె వంకే చూస్తున్నాడు. వర్ణ చిన్నిముఖం మరింత చిన్నదై.. ఆమె ఈ రెండు నెలలనీ రెండు సంవత్సరాలుగా గడిపిందని చెప్పకనే చెబుతోంది అతనికి.

అతని చూపులకి రూపం లేకపోయినా అవి సూటిగా వచ్చి బలంగా తాకినట్టనిపించి నందూ వంక చూసింది వర్ణ.

చెరొక సగంగా ఉన్న వాళ్ళిద్దరి పంచప్రాణాలూ ఏకమవడం కోసం ఎంతో ఉద్విగ్నంగా ఎదురుచూస్తున్నాయి. వాళ్ళిద్దరూ ఏకమవ్వబోయే ఆ అద్వైతక్షణం కూడా.. వారిద్దరి కోసం మరింత సజీవత్వాన్ని నింపుకుని, ప్రేమపూర్వక ఆహ్వానంతో ఎదురుచూస్తోంది. ©



# దొంగ దెబ్బలు

- నారంశెట్టి ఉమామహేశ్వరరావు

'పార్వతీ! నీకు ఫోను' చెప్పేసి పేపర్లో తల దూర్చారు శ్రీవారు.

పేపర్ చదువుతుండగా ఫోనొస్తే ఆయనంతే. ఎవరు చేశారో చెప్పరు. చెప్పడానికి ఆయన తెలుసుకుంటే కదా!

ల్యాండ్‌లైనుకి కాల్ అనగానే సరోజ, ఉమాదేవి, కాంతం, అనసూయలలో ఎవరో ఒకరు చేసి ఉంటారనుకున్నా. బ్రాడ్‌బ్యాండ్ వాడేవాళ్ళకి బి.ఎస్.ఎన్.ఎల్. ఇచ్చిన సదుపాయం 100 ఉచిత కాల్స్. నేను స్నేహితులతో మాట్లాడుతుంటాను.

రిసీవర్ ఎత్తి 'హలో' అనగానే 'నేను అనసూయను. మన కాంతంని దొంగలు కొట్టారట. హాస్పిటల్‌లో ఉంది. పది గంటలకు వెళదాం. రెడీగా ఉండు' అనేసి ఫోను పెట్టేసింది. మాట్లాడే చాన్స్ ఇవ్వలేదు. పిల్లలకీ, భర్తకీ లంచ్ బాక్సులు ప్రిపేర్ చేస్తోందేమో, బిజీగా ఉంది కాబోలు అనుకున్నా.

దొంగలు కాంతంని కొట్టడమేంటి? చైన్లు, సూట్‌కేసులు కొట్టేస్తారు కదా! అన్న ప్రశ్న ఉదయించగా దాన్ని బలవంతంగా లోపలకు తొక్కేసి పనిలో పడ్డాను.

అనుకున్నట్టే అనసూయ రాగానే హాస్పిటల్‌కి వెళ్లాం ఇద్దరం. బెడ్ మీద పడుకుంది కాంతం. ఎడమ చేతికి బ్యాండేజి ఉంది. ముఖం మీద గాయాలకి మందు రాసినట్టు తెలుస్తోంది. బేలగా చూస్తోంది. బాగా భయపడిపోయినట్టు ఆమె ముఖం చెబుతోంది. కాంతం భర్త మమ్మల్ని కూర్చోమని కుర్చీలు చూపించాడు.

'ఈ దెబ్బలేంటి అన్నయ్యగారూ?' అనసూయ మాటలకు కాంతం నోరు విప్పబోయింది. ఆమెను వారించి అతడే ప్రారంభించాడు.

'దొంగతనాలు, చైను స్నాచింగులు పెరిగాయన్న భయంతో కొంతకాలం క్రితం నగలన్నీ లాకర్లో వేశాం. మెడ బోసిగా ఉందని ఒక రోల్డు గోల్డు గొలుసు కొనుక్కుంది కాంతం. గిల్టుదే కదా అని పెద్ద సైజు తీసుకుంది' ఆగాడు కాసేపు.

'కాంతం చేసిన పని తెలిసి మేమూ అలాగే చెయ్యాలని సిద్ధపడ్డామన్నయ్యగారూ!' నేను చెప్పాను.

'పూర్తిగా విన్న తరువాత నిర్ణయం తీసుకోమ్మా. వేకువజామున ఐదింటికే మార్నింగ్ వాక్‌కి వెళ్ళడం కాంతంకి అలవాటు. పొరుగింట్లో ఉండే సావిత్రిగారు లేకపోవడంతో ఒక్కతే వెళ్ళింది నిన్నా, ఇవాళ. నిన్న ఉదయం కాంతం మెడలో గొలుసు తెంపుకుపోయాడట ఓ కుర్రాడు. గొలుసు పోయినందుకు బాధ పడలేదు మేం. గోల్డు గొలుసు లాకర్లో వెయ్యడం మంచి దయిందనుకున్నాం. పోయింది గిల్టు నగే కావడంతో ఎవరికీ చెప్పలేదు' ఆపాడు కాంతం భర్త.

'ఆ దొంగకి బుద్ధి వచ్చి ఉంటుంది' అన్నాను నేను సంతోషంగా.

## చతుర కత

'అలా జరిగితే బాగుణ్ణు. కానీ జరిగింది వేరు. గొలుసు తెంపుకుపోయిన కుర్రాడు మరొకడిని తోడు తెచ్చుకుని ఈ రోజు ఉదయం దారిలో కాపు కాసాడట. కాంతం వాళ్ళని సమీపించగానే చేతిలో ఉన్న దుడ్డుకర్రలతో ఇష్టం వచ్చినట్టు బాదారట. -గిల్టు నగ వేసుకుని మోసం చేస్తారా? పడ్డ కష్టమంతా వేస్టయింది. మరొకసారి గిల్టు నగతో కనిపిస్తే చంపేస్తాను- అంటుండగా ఎవరో వస్తున్న అలికిడి విని పక్కనున్న బండ మీదకి కాంతంని తోసేసి పారిపోయారట. బండ మీద పడ్డం వల్ల చేయి విరిగింది' పూర్తి చేశాడు ఆయన.

'ఔరా! ఇవేమి దొంగ దెబ్బలు!?' అని ముక్కున వేలేసుకున్నాం నేనూ అనసూయ. ©




# కాలాతీతం

## టోనీ మారిసన్ ది బ్లూయెస్ట్ ఐ

ఆర్థిక మాంద్యం తర్వాత 1941లో ఓహియో రాష్ట్రంలోని లోరేన్‌లో కథ ప్రారంభమవుతుంది. తొమ్మిదేళ్ల క్లాడియా, ఆమె అక్క పదేళ్ల ఫ్రీడా మెక్‌టేర్, వాళ్ల తల్లిదండ్రులు పేదలబస్తీలో 'చలికి తట్టుకోలేని నాచుపట్టిన పాత ఇంట్లో' నిత్య పోరాటంగా బతుకుతుంటారు. డబ్బులేదు గానీ ఇంట్లో ప్రేమకు కొదవలేదు. కనీసం కొంతైనా కలిసివస్తుందని హెన్రీని పేయింగ్ గెస్ట్‌గా ఉండమంటారు. మరోపిల్ల పెకలా బ్రీడ్‌లవ్ కూడా వచ్చి చేరుతుంది. ఇటీవలే పెకలా తల్లిని తండ్రి చోలీ తీవ్రంగా కొట్టి, ఇల్లు తగలబెట్టటానికి ప్రయత్నించాడు. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడదు పెకలా. ఆమె కురూపి. బాలనటి షర్లీ టెంపుల్ అంటే చాలాఇష్టం. నలుపు రంగే తాను కురూపిగా ఉండటానికి కారణమని నమ్ముతుంది. షర్లీ లాంటి తెల్లచర్మం ఉన్న పిల్లలే నిజమైన అందగత్తెలు అనుకుంటుంది.

తల్లిదండ్రుల ఇంట్లో దుర్భరమైన జీవితం గడిపిందా పిల్ల. తండ్రి తాగుబోతు. అమ్మ, నాన్న దెబ్బలాడుకోని రోజులేదు. తను అందంగా ఉండివుంటే తల్లిదండ్రులు పోట్లాడుకునేవారు కాదేమో? తనతో కూడా ప్రేమగానే ఉండేవారు కదా! తెల్లతోలుకూ, అందానికీ సంబంధముందనుకుంది గనుక, తనకు నీలికళ్లుంటే ఇంకా బాగుండేదనుకుంటుంది పెకలా. తన కోరిక తీర్చమని దేవుణ్ని ప్రార్థిస్తుంది. ఈ కళ్లతో కాదు, నీలికళ్లతో తాను లోకాన్ని చూడగలగాలి. లోకం తనను అందగత్తెగా చూడాలి. వాళ్ల ఇంటి పై అంతస్తులో ముగ్గురు వేశ్యలు- మేరీ, పోలాండ్, చైనా- ఉంటారు. డబ్బుల కోసం మగాళ్లను ఆకర్షించటమే వాళ్ల పని. తిట్లు, బూతులు, ఉమ్మేసుకోవటాలు, విరగబడి నవ్వటాలూ- ఇవే వాళ్ల కాలక్షేపం. పెకలా పట్ల సానుభూతి ప్రదర్శిస్తారు. ప్రేమ, సెక్స్, డబ్బు గురించిన కథలు చెబుతారు. స్కూల్లో

పెకలాను మగపిల్లలు టీజ్ చేస్తారు. గోధుమరంగు తోలున్న మారీన్ పీల్ కూడా వాళ్లతో కలిసి ఏడిపిస్తుంది. ఇలా, పెకలాను టీజ్ చేస్తున్నందుకు క్లాడియా ఒకనాడు మారీన్ మీద చేయి చేసుకోవటానికి ప్రయత్నిస్తుంది. కానీ, ఆ గొడవలో ఆమె మారీన్‌కు బదులు పెకలాను తీవ్రంగా గాయపరుస్తుంది. జూనియర్ అనే పొరుగు కుర్రాడు పెకలాకు మాయ మాటలు చెప్పి, ఇంట్లోకి రమ్మని తీసుకెళ్లి పిల్లితో ఆమె మీద దాడి చేయిస్తాడు. ఆ తర్వాత, తనే ఆ పిల్లిని చంపి, ఆ నేరాన్ని పెకలా మీదికి తోస్తాడు. అలా పెకలా తల్లి ఆమెను చెడామడా తిట్టి ఇంట్లోంచి వెళ్లగొడుతుంది.

1942లో పేయింగ్ గెస్ట్‌గా ఉన్న హెన్రీ ఒకనాడు ఫ్రీడాతో అసభ్యంగా ప్రవర్తించడంతో ఇంట్లోంచి గెంటివేస్తారు. ఫ్లాష్‌బాక్‌ల ద్వారా మనకు పెకలా తల్లిదండ్రులు చోలీ, పాలిన్ బ్రీడ్‌లవ్ గురించి తెలుస్తుంది. పాలిన్‌ది అవిటికాలు. ఇంట్లో ఆమెనందరూ విరిగిన ఫర్నీచర్‌లా తిరస్కారభావంతో చూడటానికి అదే కారణం. బాల్యంలో ఆమె కూడా రొమాంటిక్ స్వప్నాలలో విహరించింది. అందమైన రాజకుమారుడు తనను వెదుక్కుంటూ వస్తాడనుకునేది. హాలీవుడ్ సినిమాలు చూసి అందంగా ఉన్న స్త్రీలు మాత్రమే అనుకున్నవి సాధించగలరని గాఢంగా నమ్మింది. జీన్ హార్లో (హాలీవుడ్ హీరోయిన్)లా తెల్లతోలూ, బ్లాండ్ జుత్తూ ఉండాలని, అప్పుడే హీరోలు తమ వలలో పడతారని భావించేది.




నాలుగు రోజుల పసిగుడ్డు చోలీని, తల్లి రైల్వేట్రాక్ దగ్గర వదిలేసింది. ఆంట్ జిమ్మీ ఆ అనాథను చేరదీసి ఉన్నన్నాళ్లూ కన్నతల్లిలా చూసుకుంది. యువకుడిగా ఎదిగిన చోలీ, ఆమె మరణించిన రోజే, డార్లీన్ అనే యువతితో తొలిసారి సంగమిస్తాడు. వాళ్లిద్దరూ పరిష్వంగంలో ఉన్నప్పుడే ఇద్దరు తెల్లవాళ్లు అటుగా వచ్చి వాళ్ల మీద టార్చిలైటు వేస్తారు. వాళ్లది వికృతానందం. అవహేళనగా నవ్వుతూ తమకు వినోదంగా మరికొంతసేపు ఆ పని కొనసాగించుకుంటారు. చోలీ, డార్లీన్‌లకది భరించలేని అవమానం. తెల్లవాళ్లనేమీ చెయ్యలేక, కోపాన్ని డార్లీన్ మీద ప్రదర్శిస్తాడు. ఆ తర్వాత పిచ్చెక్కినట్టయి ఊరి నుండి ఊరికి తిరుగుతూ కనిపించిన ప్రతిస్త్రీతో సంబంధం పెట్టుకుంటాడు. అలా కెంటకీలో పాలిన్ తారసపడుతుంది. ఇద్దరూ లోరేన్‌లో స్థిరపడతారు.

ఇక వర్తమానంలోకి వస్తే, పీకల్దాకా తాగి ఇంటికి వచ్చిన చోలీకి, బట్టలు ఉతుకుతున్న పెకలా కనిపిస్తుంది. ఏం చేస్తున్నాడో తెలియని ఆ దశలో, కన్న కూతురన్న ఇంగితం కూడా కోల్పోయి వంటింట్లో పెకలా మీద అత్యాచారం చేస్తాడు. ఆ తర్వాత ఆమె మీద బొంత కప్పుతాడు. మరి కాసేపటికి ఇంటికి వచ్చిన పాలిన్, స్పృహ కోల్పోయిన కూతుర్ని చూసి నిర్ఘాంతపోతుంది. తండ్రే తన మీద అత్యాచారం చేశాడని చెబుతుంది పెకలా. తల్లి ఆమెను నమ్మదు. నేరమంతా పెకలాదే అన్నట్టు ఆమెను చావగొడుతుంది. ఆ తర్వాత మరోరోజు కూతుర్ని మళ్లీ రేప్ చేస్తాడు చోలీ.

పెకలాకు గర్భం వస్తుంది. మంత్రాలు, మాయమాటలతో సమస్య పరిష్కరిస్తానని గొప్పలు చెప్పుకున్న సోప్‌హెడ్ చర్చ్

# టోనీ మారిసన్



క్లో ఆర్డెలియా వఫోర్డ్ 1931లో అమెరికాలోని ఓహియో రాష్ట్రంలో జన్మించింది. దక్షిణాది రాష్ట్రాల నల్లజాతి విద్వేషాన్ని, హింసను భరించ లేక ఓహియోకు వచ్చి స్థిరపడ్డారు ఆమె తల్లిదండ్రులు. కూతురిలో ఆత్మ స్థయిర్యం పెంచటానికి నల్లవాళ్ల గర్వించదగ్గ ఆఫ్రికన్ అమెరికన్ పరం పరకు చెందిన కథలు చెప్పేవారు. బాల్యంలో జేన్ ఆస్టిన్, టాల్‌స్టాయ్‌లను చదివి సాహిత్యం పట్ల ఆసక్తి పెంచుకొంది క్లో. పన్నెండో ఏట కాథలిక్కు మతాన్ని స్వీకరించినప్పుడు ఆమెకు పెట్టిన 'ఆంథోనీ మారిసన్' అనే పేరును ఆ తర్వాతి కాలంలో ఆమె 'టోనీ మారిసన్'గా మార్చుకుంది.

కార్నెల్ యూనివర్శిటీ నుంచి 1955లో ఎం.ఎ. పట్టా పొంది, కొంతకాలం హ్యూస్టన్‌లోని టెక్సాస్ సదరన్ యూనివర్శిటీలో ఇంగ్లీషు బోధించింది. 1958లో హెరాల్డ్ మారిసన్‌ను వివాహం చేసు కుంది. ఇద్దరు పిల్లల తర్వాత దంపతులు విడిపోయారు. తరువాతి దశలో ప్రముఖ ప్రచురణ సంస్థ 'రాండమ్ హౌజ్'కు టోనీ మారిసన్ ఎడిటర్‌గా పనిచేసింది. ఆమె టోనీ కేడ్ బంబారా, హెన్రీ డ్యూమాస్, ఏంజిలా డేవిస్, గేల్ జోన్స్ వంటి వాళ్ల రచనల్ని ప్రచురించింది. హోవర్డ్ యూనివర్శిటీలో ఇంగ్లీషు బోధిస్తున్న కాలంలోనే, ఇద్దరు పిల్లల పెంపకం బాధ్యతలు కూడా తన మీదే వేసుకొని, 1970లో తొలి నవల 'ది బ్లూయెస్ట్ ఐ' ప్రచురించింది.

రెండో నవల 'సూలా'(1975)కు నేషనల్ బుక్ అవార్డు గెల్చుకుంది. మూడో నవల 'సాంగ్

అనే మోసగాడిని నమ్ముతుంది. పుట్ట బోయే బిడ్డకు నీలికళ్లు రావాలని అర్థి స్తుంది. తన కుక్కకు కొన్ని మాంసం ముక్కలు వెయ్యమనీ, వాటిని తిన్నాక అది వింతగా ప్రవర్తిస్తే ఆమె కోరిక తీరు తుందని మరోసారి ఆమెను మోసం చేస్తా డు వాడు. చర్చ్‌కు కుక్క బతికుండటం ఇష్టంలేదు. తనకిచ్చిన మాంసం ముక్కలో విషం కలిసిందని పెకలా గ్రహించలేదు. మాంసం తిన్న కుక్క కింద పడి, మరణ వేదనతో పొర్లినప్పుడు తన కోరిక తప్పక తీరుతుందని సంతోషిస్తుంది పెకలా.

ఇరుగు పొరుగులు గుసగుసలాడుకోవ టంతో పెకలా గర్భం గురించి తెలుసుకుం టారు క్లాడియా, ఫ్రీడా. లోరేన్ గ్రామంలో అందరూ బిడ్డ చచ్చిపోతే బాగుంటుందను కుంటారు కానీ, క్లాడియా, ఫ్రీడా శిశువు బతకాలని కోరుకుంటారు. 1942 వేసవిలో మారిగోల్డ్ మొక్కలు నాటి, వాటికి పువ్వులు పూస్తే, పెకలా బిడ్డ కూడా బతు కుతుందని నమ్ముతారు. కానీ పెకలా ప్రస వించిన శిశువు మరణిస్తుంది. తల్లీ కూతు ళ్లు పాలిన్, పెకలా ఊరి పొలిమేరలకెళ్లి బతుకుతారు. పెకలా క్రమంగా మతిస్థి మితం కోల్పోతుంది. ఎప్పుడూ అద్దంలోకి చూసుకుంటూ నీలికళ్ల కోసం నిరీక్షిస్తుంది.

స్థూలంగా ఇదీ కథ. 'ఇంతేలే పేదల బతుకులు' అని చెప్పదలచుకుందేమో రచ యిత్రి. అత్యంత సంపన్న దేశం అమెరి కాలో నల్లజాతి పేదల బతుకులివి. కానీ కేవలం కథ కోసం దీన్నెవరూ చదవరు. ఇదొక వచనకావ్యం. అంటే వచన కవి తలో కథ చెప్పినట్టుగా ఉంటుంది. అను భూతి ప్రధానమైన కథనం.

'ఇదిగో ఇల్లు. ఆకుపచ్చ, తెలుపు రంగుల్లో ఉంది. ఎర్రటి తలుపు, అందంగా ఉంది. ఇదీ కుటుంబం. అమ్మా, నాన్నా, డిక్, జేన్ ఆకుపచ్చ, తెలుపు రంగు ఇంట్లో ఉంటారు. అందరూ సంతో షంగానే ఉన్నారు. జేన్‌ను చూడండి, ఎర్రటి డ్రెస్ వేసుకుని...'

ఇంగ్లీషులో ఈ వాక్యాలు కవితాత్మకంగా

ఆఫ్ సాలమన్'తో జాతీయస్థాయి రచయితగా గుర్తింపు తెచ్చుకుంది. ఇది 'బుక్ ఆఫ్ ది మంత్ క్లబ్'కు కూడా ఎంపికైంది. 1940లో రిచర్డ్ రైట్ రచన 'నేటివ్ సన్' తర్వాత ఇలా ఎంపికైన నల్ల జాతి రచయిత్రి ఈవిడే. దీన్ని నేషనల్ బుక్ క్రిటిక్స్ అవార్డు కూడా వరించింది. 1998 నాటి 'బిలవెడ్' టోనీ మారిసన్ కీర్తి ప్రతిష్ఠల్ని మరింత పెంచింది. పులిట్జర్ ప్రైజ్ కూడా వచ్చిందీ నవలకు.

టోనీ మారిసన్‌ను 1993లో నోబెల్ బహుమతికి ఎంపిక చేసినప్పుడు 'ఆమె దార్శనికత, కవితా సాంద్రత అమెరికన్ వాస్తవికతను కొత్త కోణంలో పరిచయం చేశాయి' అని ప్రశంసించారు న్యాయనిర్ణేతలు. మారిసన్ పదకొండో నవల 'గాడ్ హెల్ప్ ది చైల్డ్' 2015లో ప్రచురితమైంది. 2011లో రట్గర్స్ యూనివర్సిటీ మారిసన్‌ను గౌరవ డాక్టరేట్‌తో సత్కరించింది. ప్రస్తుతం ఆమె 'ది నేషన్' పత్రికలో సంపాదకవర్గ సభ్యురాలు.

ధ్వనిస్తాయి. రెండు మూడు పదాలతోనే ముగుస్తుంది వాక్యం. ఉద్వేగాన్ని, బాధను గుండెల్లో దాచుకుని, గుండె గొంతుకలో కొట్లాడుతున్నట్లుగా కథ చెబుతుంది. అది కేవలం శైలీ విన్యాసం కాదు. కవిత్వ భాష! న్యూయార్క్ టైమ్స్ పత్రికా సమీక్షకుడు 'నవల రూపం మార్చుకొని కవిత్వంగా మారింది' అనటానికి ఇదే కారణం.

### పెకలా కథ చెప్పిన క్లాడియా

నాలుగు కాలాలు.. ఆకురాలు కాలం, చలికాలం, వసంతకాలం, వేసవి కాలంగా విభజితమయిందీ నవల. ఆకురాలు కాలంలో క్లాడియా ఇంటికి వస్తుంది పెకలా. వసంతకాలంలో తండ్రి ఆమెను రేప్ చేస్తాడు. వేసవిలో పొట్ట పెరుగుతుంది. గర్భాన్ని దాచుకోలేదు. చలికాలంలో మతిభ్రమిస్తుంది.

అలాగే ఇందులో డిక్, జేన్, 1940 నాటి ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు సుపరిచితమైన పాత్రలు. పండంటి సంసారాల్లో మాత్రమే ఉంటారు వాళ్లు. అందుకే 'అమ్మా, నాన్నా, డిక్, జేన్' అంటూ ప్రారంభిస్తుంది క్లాడియా. దీనికి విరుద్ధంగా నిత్య నరకంగా ఉంటుంది పెకలా ఇల్లు.

నిజానికి పెకలా అమెరికాలో నల్లజాతి పేదలందరికీ ప్రతీక. తెల్లవాళ్ల సమాజంలో తిరస్కృతులుగా బతుకున్నారు ఇలాంటివాళ్లు. నీలికళ్లొస్తే తనూ హాలీవుడ్ వాళ్లలా వెలిగిపోతానని కలలు కంటుంది పెకలా. ఇది తెల్లవాళ్లు స్త్రీ అందానికి నిర్ణయించిన ప్రమాణం. తెల్లవాళ్లు అందంగా ఉంటారు. నల్లవాళ్లంతా కురూపులు. అందరూ వాళ్లను చీదరించుకునే వాళ్లే. ఇంట్లో క్లాడియాను అందరూ ప్రేమిస్తారు. కానీ సమాజంలో ఆమె బహిష్కృతురాలు. రచయిత్రి తాను పుట్టిన ఊళ్లోనే కథ జరిగిందని చెప్పడం వల్ల క్లాడియా ద్వారా తను చూసిన కథనే చెబుతున్నట్లుంటుంది. తమపట్ల వివక్ష ప్రదర్శిస్తున్న తెల్లవాళ్లంటే ఆమెకు కోపం. పెద్దవాళ్లు ఈ విషయాల్లో రాజీ పడ్డారు కానీ, తమ అమాయకత్వంలో పిల్లలు అసమానతలను అంగీకరించలేరు. నల్లవాళ్లెప్పుడూ షర్లీ టెంపుల్‌లా సినిమా తారలు కాలేరు కదా!

పెకలా తండ్రి చేసిన పని చాలా దారుణమే. కానీ దానికి ఆమె ఎందుకు శిక్ష అనుభవించాలి? బిడ్డ ఎందుకు చచ్చిపోవాలి? అవాంఛిత గర్భమే అయినప్పటికీ, దాని మీద ఆమెకు అధికారం లేదా? ఇంత సంఘర్షణకు లోనైన క్లాడియా, వయసు పెరిగేకొద్దీ తానూ రాజీపడింది. తన తల్లిదండ్రుల విలువలనే అంగీకరించింది. ఇక పెకలా కుటుంబ విషయానికి వస్తే, తన అవిటికాలు ఒక లోపమనుకోలేదు ఆమె తల్లి పాలిన్. తొలుత చోలీ కూడా ఆమెను గాఢంగానే ప్రేమించాడు. కానీ సినిమా గ్లామర్, తారల సౌందర్య ప్రమాణాలు ఆమె ఆలోచనల్ని మార్చేశాయి. ఎప్పుడూ తెల్లవాళ్లు మాత్రమే

హీరోయిన్లు. వాళ్లకు అవిటికాలుండదు. అవును మరి! అడ్వర్టైజ్‌మెంట్ బోర్డుల మీద ఎప్పుడైనా అవిటి కాలున్న నల్లతోలు హీరోయిన్ కనిపించిందా? తెల్లతోలు లేక పోవటమే నల్లవాళ్ల పాలిట శాపం. ఇక చోలీ కూడా అడుగడుగునా తెల్లవాళ్ల చేతుల్లో అవమానాలకు గురయ్యాడు.

నవలలో తను చెప్పదలచుకున్నదంతా 'వసంతకాలం' భాగంలో స్పష్టం చేస్తుంది రచయిత్రి. 'భౌతిక సౌందర్యమూ, రొమాంటిక్ ప్రేమ అనే రెండు భావనలే మనిషి మస్తిష్కాన్ని కలుషితం చేశాయి. ఇంత కన్నా వినాశకరమైన ఆలోచనలు మరేమీ లేవు'. తెల్లవాళ్లనెవర్నీ నవలలో ప్రధాన పాత్రలుగా తీసుకోలేదు రచయిత్రి. తెల్ల వాళ్ల సౌందర్య ప్రమాణాలు నల్లవాళ్లకు ప్రాణ సంకటంగా తయారయ్యాయి. చివరికి నల్లవాళ్లు కూడా తమలో తాము, కొందరు తక్కువ నలుపు, కొందరు ఎక్కువ నలుపు, కొందరు గాఢమైన లేదా లేత గోధుమరంగు అంటూ వివక్ష పాటిస్తున్నారు. సాటి నల్లవాళ్లను తక్కువగా చూస్తున్నారు. నల్లజాతి స్త్రీలు కూడా అసంభవమని తెలిసినా, తెల్లరంగు పిల్లలు పుట్టాలని, నీలికళ్లు కావాలని కలలు కంటున్నారు. ఇందులో ఒక నల్ల జాతి స్త్రీ తనకొడుక్కి ఇలా బోధిస్తుంది. 'తెల్లవాళ్లు కానివాళ్లందరూ నల్లవాళ్లు అనుకోకూడదు. గోధుమరంగు నలుపు కాదు. అంటే మనం నీగ్రోలం కాదు' అని. తను నల్లటి నలుపని పెకలాకు తెలుసు. తనకు బిడ్డ కూడా నల్లగానే పుడుతుందనుకునేది. మొక్కలు నాటే సన్నివేశం ఒక ప్రతీక. అమెరికన్ నేలలో కొన్నిరకాల మొక్కలు పుష్పించవు. అంటే నల్లవాళ్లకిక్కడ స్థానం లేదు. 'నల్లరేగడి భూమిలో మొలకెత్తిన విత్తనం పెకలా' అంటుంది రచయిత్రి. చివరికి చోలీ, పెకలా, ఆమెకు పుట్టిన పిల్లలూ అందరూ మట్టిలో కలిసిపోతారు. దీనికి కారణాలు వివరిస్తుంది క్లాడియా.




'కొన్ని రకాల పువ్వులకు కొన్ని నేలలు పనికిరావు. కొన్ని విత్తనాలు మొలకెత్త లేవు. కాయలు కాయలేవు. నేలతల్లి, విత్తనాలను నిరాకరించిందంటే వాటికి బతికే హక్కు లేదని అర్థం. ఈ అవగాహన తప్పే కావచ్చు. కానీ ఏంచేస్తాం? ఇప్పటికే జరగాల్సింది జరిగిపోయింది'

తను పెద్దమనిషి అయిన రోజునుండీ, తను గర్భం దాల్చవచ్చనీ, పిల్లల్ని కనవచ్చనీ పెకలాకు తెలుసు. కానీ 'మొదట ప్రేమికుణ్ని వెదుక్కో' అని సలహా ఇస్తుంది ఫ్రీడా. ప్రేమంటే ఏమిటో? ప్రేమికులంటే ఎలా ఉంటారో? తెలియని అమాయకురాలు పెకలా. తల్లిదండ్రుల పడగ్గదిలోంచి వచ్చిన ఎగశ్వాసలూ, మంచం కిర్రుమన్న శబ్దాలూ, తనకు పరిచయమైన వేశ్యల సెక్స్ వ్యాపారం మాత్రమే ఆమెకు తెలుసు. ఒకవేళ వయోసహజమైన ప్రేమ భావన ఆమెలో ఎంతో కొంత ఉందనుకొన్నా తండ్రి చేసిన అఘాయిత్యంతో అది అసహ్యంగా, ఒక బాధామయమైన, అవమానకరమైన అనుభవంగా మారింది. ఆమెకు పురుషుడు కావాలి.. కానీ కన్నతండ్రి రూపంలో ఉన్న పురుషుడు కాదు. ప్రేమించే పురుషుడు. తాగిన మత్తులో ఉన్న కామాంధుడు కాదు. అతడి స్పర్శ ఆమె ఒంటినిండా విషంలా వ్యాపించింది. 'ప్రేమికుడి మీద ఆధారపడి ఉంటుంది ప్రేమ. ప్రేమికుడు దుర్మార్గుడైతే ఆ ప్రేమ కూడా దుర్మార్గమైనదే' అంటుంది కవయిత్రి లాంటి ఈ రచయిత్రి. టోనీ మారిసన్ గానం చేసిన అమెరికన్ సమాజంలోని నల్లవారి విషాద గీతం 'ది బ్లూయెస్ట్ ఐ'.




కె.ఎన్.వై. పతంజలి

# ఖాకీవనం

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

**పాఠకులు, మేథావులు, రచయితల్లోనూ ప్రాచుర్యం పొందిన కె.ఎన్.వై. పతంజలి 'ఖాకీ వనం' 'చతుర' 1980 నవంబరు సంచికలో ప్రచురితమైంది. పూర్తిగా పోలీస్ వ్యవస్థ గురించిన నవల ఇది. మన సమాజంలో పోలీసు వ్యవస్థ ఓ విచిత్ర సమాహారం. పోలీసులంటే జనం నమ్ము తున్నారా? భయపడుతున్నారా? వాళ్ళు మంచివాళ్ళా? దుర్మార్గులా? సమాజ సేవకులా? ప్రజల్ని హింసించే వాళ్ళా? నిజాయితీ పరులా? లంచగొండులా? వాళ్ళని నమ్మవచ్చా? లేదా? పోలీసులు సుఖపడుతున్నారా? సమయాసమయాలు లేని చాకిరీతో బాధపడుతున్నారా? వాళ్ళకి సక్ర మంగా విధి నిర్వర్తించే స్వాతంత్ర్యం ఉందా? లేదా? ఆత్మాభిమానం కొరవడి బాధపడుతున్నారా? అధికారం చెలాయించి ఆనందిస్తున్నారా? ఇలాంటి ప్రశ్నలకి, నిర్ధారణగా ఇదీ జవాబు అని చెప్ప లేని ఓ మిశ్రమ వ్యవస్థ అది. దాని తీరు, నిర్వహణ కూడా అలాంటివే. పూర్తిగా పోలీసు వ్యవస్థ మీద తెలుగులో దీనికి మించిన మేరో నవల కనిపించదు. రకరకాల ఘటనలైనా ఒక లక్ష్యంతో సాగే ఇలాంటి రచనకి ప్రత్యేకమైన నేర్పుండాలి.**

'ఖాకీవనం' నవలలో మురికి వాడల బతుకు దగ్గర్నించీ, ఖద్దరు నాయకుల వరకు పలు విష యాల్ని రచయిత పతంజలి చర్చించారు. కానీ ఆయన దృష్టి కేంద్రీకరణ అంతా ముఖ్యంగా పోలీసుల స్థితిగతుల మీద... వారి మనస్తత్వం, ప్రవర్తనా సరళి మీద.. అహంభావం, ఆత్మన్యూ నతల మీద.




నవల ఆరంభమే ఓ సంక్లిష్ట సంఘటనతో జరుగు తుంది. ఎస్.పి. గారి భార్య వారింటికి డ్యూటీకి వచ్చిన సుందరయ్య అన్న కానిస్టేబు ల్‌తో దొడ్డికెళ్ళిన చంటిపిల్ల ముడ్డి కడిగించింది. మారు మాట లేకుండా ఆ పని చేసిన సుందరయ్య మనసు చచ్చిపోయింది. ఉద్యోగస్థితిని తిట్టుకున్నాడు. వీధి గేటు దగ్గర డ్యూటీలో ఉన్న ఆర్డర్లీ కానిస్టే బుళ్ల ముందు తన గోడు వెళ్ళబోసుకున్నాడు. ఇంటి లోపలికి వినపడకుండా నలుగురూ ఎస్. పి.ని, ఆయన గయ్యాళి భార్యనీ నానా తిట్లు తిట్టుకున్నారు. చేతకాని స్థితిలో బలమైన ఆయుధం తిట్టే. ఎస్.పి. గారు ఇంటి పనులు చేయించుకోమన్నారు కాబట్టి ఆయన భార్య ఉచ్ఛం, నీచం అనకుండా అన్ని పనులూ చెపు తోంది. పది రూపాయలిచ్చి మార్కెట్ నుంచి ఆరు రకాల చేపలు తెమ్మంది. ఇద్దరు కానిస్టే బుళ్లు వెళ్ళి ఆ పది రూపాయలు కూడా ఖర్చు చేయకుండా ఎస్.పి. గారికని చెప్పి చేపలు దండుకొచ్చారు. పరువు తీసే శారని ఆ పనినీ తిట్టింది ఆవిడ. ఓ తీరూ తెన్నూ లేని పనులు వాళ్ళ పాలిట నిత్యన రకం. ఎస్.పి. గారింటి దగ్గర కానిస్టేబుళ్లు డ్యూటీలో ఉండటం సాధారణమే!. కానీ వాళ్ళు ఏ పనుల కోసం? అన్నది నిర్ధారణ లేదు. రూలు వేరు, జరుగుతున్నది వేరు. అడిగే వాళ్ళు, అడ్డుకునేవాళ్ళు లేరు. కాబట్టి ఎవరి ఇష్టారాజ్యం వారిది. నవల ఆరంభంలోని ఈ సంఘటనతోనే పోలీసులు సగం చచ్చి ఉద్యో గాలు ఎలా చేస్తున్నారో? చూపించారు పతంజలి.

అందర్నీ పిలిచేది 'పీసీ' అని అంటే 'పోలీసు కానీస్టేబుల్' అని! అందరివీ ఖాకీ యూనిఫారాలే! ఇక టోపీలు, లాఠీలు సరేసరి! కానీ లోలోపల అంతరంగాలలోనే భేదం.

పోలీసంటే తిరుగులేని అధికారమని, దొరికిన వాళ్ళందర్నీ భయపెట్టి, జులుం చేసి పొగరు ప్రదర్శించాలని అనుకునే కానిస్టేబుల్ ఒకడైతే.. అధికారులు పెట్టే హింస భరించలేక వాళ్ళు చెప్పినట్టు చేయ్యలేక, వాళ్ళ ముందు నోరురాక, పక్కకి వచ్చిన తర్వాత అడ్డమైన తిట్లూ తిట్టుకునే కానిస్టేబుల్ మరొకరు.

అధికారుల కనుసన్నల్లో మెలుగుతూ, నక్క వినయం చూపిస్తూ, వాళ్ళకి తొత్తులా వుంటూ, రకరకాలుగా కాకాపడుతూ, పబ్బం గడుపుకుని, ఏదోరకంగా జీవితాన్ని సుఖమయం చేసుకోవాలనుకునే సుబ్బారావు లాంటివాళ్లు మరికొందరు! ఎవరి తీరు ఏరకమైనా అందరూ తమ తమ ఉద్యోగాల్ని తిట్టుకునేవారే! ఏం జరిగినా నోరు మూసుకు వూరుకోవడం మంచిది. తప్పేదా? వదిలేదా? 'బూటు కట్టిన్నాడు పట్టిన ఈ శని, సర్వీసు వున్నంత కాలమూ వదలదు' అన్నదే మెజారిటీ భావన.

ఉద్యోగంతో భౌతికమైన ఈ రకం బాధైతే మరికొందరిది మరోరకం. ఎటువంటి దుర్మార్గానికైనా వెనుకాడని కానిస్టేబులు తీరుకి భిన్నంగా పాపభీతితో సతమతమయ్యే నారాయణ లాంటి వారు కొందరు. భిన్నమైన వ్యవస్థలో విభిన్నమైన వ్యక్తులతో ఓ పటం మన కళ్ళముందు నిలిపారు పతంజలి.

డి.ఐ.జి. బ్రహ్మానందం, ఎస్.పి పార్థసారథి, డి.ఎస్.పి. కామేశ్వరావు, సి.ఐ. కాశీపతి ఇంకా చాలామంది కానిస్టేబుళ్లు.. ఒకవైపు. పూరిగుడిసెలో బతికే గౌరి, దాని తండ్రి, దానిపెత్తండ్రి తాగుబోతు సూరీడు, పోలీసు రైడింగులో అవమానపడిన కమలి, భాస్కర్, క్రైమ్ సర్కిల్ ఇన్స్పెక్టర్ ప్రభాకర్, పోలీసులకి మద్దతుగా నిలిచిన ఎస్.ఐ. ప్రకాశరావు పాత్రలు మరోవైపు.

పోలీసుల్లో అలజడి రేపి, వారిని ఆవేశపరచి, నిరసనని ప్రేరేపించి, చివరికి సమ్మెకి దిగేలా చేసిన సంఘటనలు రెండు. ఒకటి కానిస్టేబుల్ సుబ్బారావు మున్సిపల్ కార్మికుల మీద చెయ్యి చేసుకోటం, రెండోది చెరబట్టిన గౌరి దగ్గర్నుంచి అర్ధరాత్రి తిరిగి వస్తున్న సి.ఐ. కాశీపతిని కత్తితో పొడిచి హత్య చెయ్యటం.

పోలీసు దుర్మార్గం కరుడుకట్టిన వ్యక్తి కాశీపతి. మురికివాడలో నివసించే గౌరి అతని కంట పడింది. అప్పుడప్పుడే సవత్తాడింది గౌరి. ఏపుగా, నదురుగా కనిపించింది కాశీపతికి. గౌరి తండ్రిని భయపెట్టి, పోలీసు జులుంతో హింసించి లొంగదీసుకున్నాడు. చేసేదేం లేక, తప్పని పరిస్థితిలో ఆ తండ్రే తన కూతురు గౌరిని, కాశీపతికి అప్పగించాడు. ఆ పిల్లని తీసుకొచ్చి వేరే ఇంట్లో పెట్టి, రోజూ తన కామం తీర్చుకుంటున్నాడు కాశీపతి. ఆ రోజు అలాగే తన కోరిక తీరాక, అర్ధరాత్రి మోటార్‌సైకిల్ మీద తన ఇంటికి బయలుదేరాడు. ఆ దారిలో కాపు కాసిన భాస్కర్ పాతపగతో కాశీపతిని ఆపి, రోడ్డు మీదే కత్తితో పొడిచి.. పొడిచి చంపాడు. ఓ పోలీసు ఆఫీసరు హత్య, డి.ఐ.జి. స్వయంగా రంగప్రవేశం చేశాడు..

దీనికి తోడు కానిస్టేబుల్ సుబ్బారావు పోలీసు పొగరుతో మునిసిపాలిటీ కార్మికుడ్ని అనవసరంగా ఈడ్చి కొట్టి, కింద పడిన అతని ఛాతీ మీద తన బూటుకాలితో తొక్కిపెట్టి... 'తెలిసిందిరా లం..కొడకా! పాకీ నాకొడకా! ఈ కాలిలాగే గట్టిగా నొక్కానంటే రక్తం కక్కుకుని మరీ చస్తావు. పోలీసోడంటే నీకు తమాష లాగుందిరా? జాగ్రత్త..!' అని తీవ్రంగా అవమానించాడు.

'పరదేశీ' అన్న ఆ కార్మికుడు ఆ తర్వాత చాలా గొడవచేశాడు. తమ యూనియన్నంతా కదిపాడు. చెత్తలారీలు, ట్రక్కులు, ట్రాక్టర్లు, వందల సంఖ్యలో కార్మికులు, సుబ్బారావు పనిచేస్తున్న వన్‌టౌన్ పోలీసుస్టేషన్‌ని ముట్టడించారు. సుబ్బారావుని సస్పెండ్ చేసే వరకూ గొడవ సద్దుమణగలేదు.

అదే రోజు రాత్రి కాపు వీధిలో 'చిన్నరవణ' అన్న లోకల్ వ్యవహర్తతో గొడవ పెట్టుకున్నారు పోలీసులు. రవణ మనుషులు వాళ్ళని బాగా తన్ని పంపించారు.

పోలీసులకి తన్నులు, ఓ కానిస్టేబుల్ సస్పెన్షన్, ఓ పోలీసు ఆఫీసరు మర్డరు.. పైగా ఊళ్ళో డి.ఐ.జి.! డి.ఐ.జిగారి ఆర్డర్‌తో డి.ఎస్.పి. కామేశ్వరావు, పోలీసులు విజృంభించి, ఆ రాత్రి కాపు వీధిలో నానాభీభత్సం సృష్టించారు. చిన్నరవణని అరెస్ట్ చేశారు. పోలీసుస్టేషన్‌లో అతను చచ్చిపోయాడు. 'కార్డియాక్ అరెస్ట్' అని అబద్ధం సర్టిఫికేట్‌తో కోర్టులో తప్పుడు కేసు ప్రొడ్యూస్ చేసి, కేసు మూసేశారు. మేజిస్ట్రేట్ తమకి అనుకూలంగా ఇచ్చిన తీర్పుతో ఇంకేం గొడవ ఉండదనుకున్నారు.

# రచనారంగంలో సాహసి



సాహసోపేత రచయితగా, పదును తేరిన సంభాషణా రచయితగా పేరుపొందిన పతంజలి తొలి నవల 'ఖాకీవనం'. పతంజలి పూర్తి పేరు కాకర్లపూడి నారసింహ యోగ పతంజలి. 1952 మార్చి 29న విజయనగరం జిల్లా ఆలమండ గ్రామంలో జన్మించారు. కె.వి.వి. గోపాలరాజు, సీతాదేవి దంపతులకు పుట్టిన పతంజలి 1975 నుంచి పాత్రికేయులుగా 'ఈనాడు' మొదలు వివిధ పత్రికలలో పనిచేశారు. 'పతంజలి పత్రిక' పేరుతో కొంతకాలం సొంతంగా పత్రికను కూడా నిర్వహించారు. నవలారచయితగా, ఫీచర్ రైటర్‌గా, టీవీ సీరియల్ స్క్రిప్ట్ రైటర్‌గా పనిచేశారు. 'షబ్నమ్' అనే కలంపేరుతో రచనలు చేశారు.

పెంపుడు జంతువులు, రాజుల లోగిళ్లు (అసంపూర్తి) నవలలు, ఖాకీవనం, రాజుగోరు, వీరబొబ్బిలి, గోపాత్రుడు, పిలక తిరుగుడు పువ్వు, ఓ దెయ్యం ఆత్మకథ అనే నవలికలు రాశారు. దిక్కుమాలిన కాలేజీ (తొమ్మిది కథలు), చూపున్న పాట అనే కథా సంపుటాలు వెలువరించారు.

పతంజలి అందుకున్న వివిధ పురస్కారాల్లో రావిశాస్త్రి రచనా పురస్కారం, చాసో స్ఫూర్తి పురస్కారం ప్రధానమైనవి. 'సిందూరం' సినిమాకు ఉత్తమ మాటల రచయితగా బంగారు నంది అందుకున్నారు. 2009 మార్చి 11న విశాఖపట్నంలో మరణించారు.

కానీ చిన్నరవణ మనుషులు రాజధానిలో అల్లరి లేవదీశారు. హోంమినిష్టర్‌కి, సి.ఎం.కి ఫిర్యాదు చేశారు. మీడియాలో పెద్ద దుమారం లేచింది. కేసు తిరిగి ఎంక్వయిరీకి వచ్చింది. ఎస్.పి. ఎంక్వయిరీ ఆఫీసరుగా విచారణ చేసి, ఓ నాటకం ఆడాలని అనుకున్నారు పోలీసుశాఖ వారు. ఆ రాత్రి కాపు వీధికి వెళ్ళి జనాన్ని చితకబాదిన పందొమ్మిది మంది కానిస్టేబుళ్లని సస్పెండు చెయ్యడం, ఈ నాటకంలో ఓ భాగం అన్నారు. ఈ చర్యకి నిరసనగా పోలీసులు ఎదురు తిరిగారు. ఎస్.ఐ. ప్రకాశరావు ఆధ్వర్యంలో ఎస్.పి. ఆఫీసు ముందు ఆందోళనకి దిగారు.

ఎ.ఎస్.పి.ని వాళ్ళతో మాట్లాడి రమ్మని పంపించాడు ఎస్.పి. పార్థసారథి. ఆందోళనకారులకి గంటసేపు నచ్చజెప్పిన ఎ.ఎస్.పి. తిరిగి వచ్చి. 'సార్! రాత్రి పన్నెండు గంటల్లోపల సస్పెన్షన్ ఆర్డర్లు విత్‌డ్రా చెయ్యకపోతే రేపు సమ్మె చేస్తారట సార్! సివిల్ పోలీసు, రిజర్వ్ పోలీసులు కూడా. అదీ వాళ్ళు మీకు చెప్పమన్నది' అని చెప్పాడు.

ఈ లోపల హెడ్‌క్వార్టర్స్ నుంచి వచ్చిన మరో మెసేజ్ పట్టుకుని ఓ కానిస్టేబుల్ వచ్చాడు. ఎస్.పి. పార్థసారథి అది చదివాడు. 'ఇదంతా నా ఖర్మ! ఈ లం..కొడుకులు సమ్మె చేస్తారంటారు. ఆ లం..కొడుకులు రద్దుచేసుకోవద్దంటారు. మధ్య నేను చస్తున్నాను' అనుకున్నాడు.

మర్నాడు పోలీసులు సమ్మెతోపాటు నిరాహార దీక్ష ప్రారంభించారు. ఐ.జి. కి స్వయంగా రాక తప్పలేదు. ఐ.జి. రాకతో పోలీసుల్లో సమ్మె ఉత్సాహం పెరిగింది. మరి ఒకటి రెండు రోజులు అలాగే దీక్ష కొనసాగిస్తే, సమ్మె మిగిలిన ప్రాంతాలకీ విస్తరించి, ఉధృతమై, హోంమినిష్టర్ని కూడా కాళ్ళబేరానికి రప్పిస్తుందని ఎస్.ఐ. ప్రకాశరావు వాళ్ళని ఉత్తేజపరిచాడు.

ఎస్.పి.ని, డీ.ఎస్.పి.ని దూరంగా వుంచి, ఐ.జి. సమ్మెకారుల మధ్యకి వచ్చి ఉపన్యాసం ఆరంభించాడు. 'నో.. మీరు ఇలా చెయ్యకూడదు. ఇది చట్టబద్ధం కాదు. దీనివల్ల మీకే నష్టం. యూనిఫాంలో వుండి మీరిలా ఎలా ప్రవర్తించగలుగుతున్నారో? నాకు అర్థంకావటంలేదు. నా మాట వినండి. మీరు అనవసంగా చెడిపోతారు. చేజేతులా ఉద్యోగాలు పాడుచేసుకోవద్దు'

ఐ.జి. మాట ఎవరూ వినలేదు సరికదా, ఓ కానిస్టేబుల్ వెనక నుంచి తోసేశాడు. ఐ.జి వెళ్ళి మరో కానిస్టేబుల్ మీద పడ్డాడు. 'అదేంటిసార్! మీద పడ్డారు!' అని అతను ఓ నెట్టునెట్టాడు. అలా ఐ.జి. పని బంతాటగా మారింది. ఎస్.పి, డి.ఎస్.పి. వచ్చారు రక్షణగా. ఐ.జి. వెనుతిరక్క తప్పలేదు.

మర్నాడు సమ్మె ఉధృతమైంది. అలాగే ఐ.జి. తదితరుల పన్నాగాలు ఉధృతమయ్యాయి. సమ్మె మరికొన్ని ప్రాంతాలకి పాకింది. అధికారులు బి.ఎస్.ఎఫ్. బలగాల్ని పిలిపించారు. అర్ధరాత్రి దాడులు జరిగాయి. నిరాహారదీక్ష శిబిరంలో

# నవలా ప్రపంచానికో కుదుపు



'ఒరే' అని పిలిచింది కొత్త ఎస్.పి. భార్య. ఆర్డర్లీ సుందరయ్య తుళ్లి పడి చూశాడు. 'ఇదిగో! చంటిది దొడ్డికి కూచున్నట్టుంది. కాస్త కడిగి..' అని చెప్పి ఆవిడ విసవిసా లోపలికెళ్లింది.

- 'తప్పేదా? వదిలేదా? బూటుకట్టిన నాడు పట్టిన శని సర్వీసున్నంత కాలమూ వదలదు!' - అన్నాడొక ఆర్డర్లీ.

- 'ఇంటి కాపలాకి మన జవాన్లింతమంది ఉండగా మనకి మళ్లీ ఈ వెధవ కుక్కెందుకు డాడీ?' అన్నది ఎస్.పి. కూతురు.

- 'డాడీ! ఫన్! మెడకు బెల్టుంటే కుక్క! నడుముకి బెల్టుంటే పోలీస్!' - ఇంటికి కొత్తకుక్కని తెచ్చిన తండ్రితో.

ఇలా ఎన్నెన్నో.. పతంజలి 'ఖాకీవనం' నవల నిండా కడుపులో దేవే వ్యంగ్య విషాదాలు, విషాద వ్యంగ్యాలు.

అణచివేత ఉన్నచోట ప్రతిఘటన తప్పదు.. బానిసత్వం ఉన్నచోట తిరుగుబాటు తప్పదు.. ఇది ఏ డిపార్టుమెంటులోనైనా, ఏ వ్యవస్థలోనైనా తప్పదు.. తిరుగుబాట్లను అణచివేసే డిపార్టుమెంటులోనే తిరుగుబాటు.. కె.ఎన్.వై. పతంజలి 'ఖాకీవనం' నవల చెప్పే సత్యమిది. 1980లో 'చతుర' ప్రచురించిన ఈ నవల పాఠకలోకంలో పెను సంచలనం కలిగించిందనడం సత్యదూరం కాదు. నవలకు ఆ పేరు ఎన్నుకోవడంలోనే పతంజలి తనేమిటో సాహితీలోకానికి తెలియజేశారు. అదుపు లేని అహంకారానికి, అంతం లేని బానిసత్వానికి నెలవుగా రూపుదిద్దుకున్న వ్యవస్థ మీద రాసిన నవలకు ఆ పేరే ఒక అద్భుతం. ఆ వనంలో చిన్నా, పెద్దా అన్నీ ఖాకీలే! పుట్టినవీ ఖాకీలే! పెరిగినవీ ఖాకీలే! స్వరాజ్యం వచ్చినా బ్రిటీష్ కాలం నాటి ఆర్డర్లీ విధానాన్నే కొనసాగించుకుంటున్న ఖాకీ వ్యవస్థ దుర్మార్గాన్ని, మానవత్వ వ్యతిరేక సంప్రదాయాన్ని కళ్లకుకట్టేలా అక్షరబద్ధం చేసిన నవల ఇది. స్వార్థానికి తెల్లోడు, నల్లోడు అనే తేడా లేదని, దుర్మార్గానికి స్వతంత్రమైనా, పరతంత్రమైనా ఒకటే అనే నిష్ఠుర సత్యాన్ని పోలీసు డిపార్టుమెంటులో కొనసాగుతున్న ఆర్డర్లీ వ్యవస్థ నేపథ్యంగా 'ఖాకీవనం'లో చెప్పారు. ఇతరులకు పట్టుబడని, తనకు మాత్రమే సాధ్యమైన వ్యంగ్యం పతంజలి సొంతం.

ఇక చివర్లో తిరుగుబాటు! తిరుగుబాటు విజయవంతం కాకపోయినా హెచ్చరికను తెలియజేస్తుందన్నది స్పష్టమవుతుంది. నవల ముగింపులో ఆర్డర్లీకి కాఫీ ఇచ్చినపుడు అధికారి ప్రవర్తనే దానికి సాక్ష్యం!

ఇలాంటి సాహసోపేత రచన చేయడం పతంజలికే చెల్లు! ప్రచురించే ధైర్యం సామాజిక బాధ్యత ఉన్న 'చతుర' కే చెల్లు!

ఇంత మంచి నవలపై మరోసారి చర్చించాల్సి రావడం గొప్ప అవకాశం. సంపాదకులకు అభినందనలు! కృతజ్ఞతలు!

– వై.ఎస్. కృష్ణేశ్వరరావు,
రచయిత, సినీ నటులు

వాళ్ళని అరెస్టు చేశారు. అలాగే ఆందోళన చేస్తున్న వారిని, అరవై మందికి పైగా అరెస్టు చేశారు. సమ్మెని అణిచెయ్యగలిగారు. పోలీసుల చేత పరేడ్ గ్రౌండ్‌లో పనిష్మెంట్ డ్రిల్ చేయించారు.

ఒకరికొకర్ని ఎదురెదురుగా నిలబెట్టి, చెంప చెళ్ళుమనేలా ఒకరిచేత మరొకర్ని కొట్టించారు. గతి లేక తమవారిని తామే కొట్టడం ఘోర అవమానం. పోలీసుల ఆత్మాభిమానం ఈ రూపంలో మరోసారి దెబ్బతింది.

అంతా సద్దుమణిగాక డి.ఎస్.పి. కామేశ్వరరావు కంట్రోల్ రూమ్‌కి వచ్చినప్పుడు, అక్కడ డ్యూటీలో ఉన్న లక్ష్మణరావు సెల్యూట్ చెయ్యలేదు సరికదా, అధికారి కళ్ళల్లోకి సూటిగా చూశాడు. లక్ష్మణరావే కాదు, మరో కానిస్టేబుల్ చూపులు అలాగే కనిపించాయి ఆ అధికారికి. ఈ సందర్భంలో రచయిత పతంజలి 'అవే అచూపులు, అందులో అవే కత్తులు' అంటారు.

పోలీసు కలహాల్ని, ఘర్షణల్ని సమ్మెలాంటి చారిత్రక స్థాయిదాకా చిత్రీకరించటం మరో విశేషం. ఈ నవలలోని పలు ఘటనలు ఆంధ్రదేశంలో జరగకపోయినా, మనదేశానికి చెందినవే అని, వివిధ వార్తా పత్రికల నుంచి సేకరించినవేనని, ఈ రచయిత నవలాంతంలో వివరణ ఇచ్చారు. నిస్సందేహంగా ఇదో విభిన్నమైన తెలుగు నవల. ©

# చతుర ప్ర.జ.



పాఠకుల ప్రశ్నలకు
**ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస**
**డా. కె. రామానుజాచార్య**
సమాధానాలు

*ప్ర. రావణుడు శ్రీరాములవారి ముత్తాతల నాటివాడు. రావణుడు, అతని తమ్ములు, కొడుకులు యుద్ధసమయానికి ముదివగ్గులై ఉండాలి. కానీ యుద్ధరంగాన రావణుని తేజస్సును చూసిన శ్రీరాముడు ఆశ్చర్యపడ్డారు. అంతకుముందు హనుమంతుడు చూసినప్పుడు కూడా అంతే! రావణుని యౌవన రహస్యం ఏమిటి?*

**– చిత్తూరి ప్రసాద్‌రెడ్డి,** చింతలగూడెం

**జ.** మన ఆయుః ప్రమాణాన్ని చూచుకొని రావణుని ఆయుఃప్రమాణాన్ని, యౌవనాన్ని, బలాన్ని అంచనా వేయటం తప్పు. ఇపుడు నడుస్తున్న కలియుగము 28వది. రాముడు అవతరించిన త్రేతాయుగము 12వ త్రేతాయుగము. అనగా 64 యుగాల క్రింద రామావతారము. అంతకు చాలా లక్షల సంవత్సరాల ముందు రావణుని పుట్టుక, ఆనాటి త్రేతాయుగ ఆయుః ప్రమాణము లక్షా డెబ్బయి వేల సంవత్సరాలు. దానికి తోడు తపో నియమనిష్ఠలతో బ్రతికిన రావణ బ్రహ్మ నిత్యయౌవనుడే! అమిత బలశాలే!

*ప్ర. స్త్రీలు పూజలు, దీపారాధన చేసినా ఫలితం అంతగా ఉండదని, ఋతుక్రమాల వల్ల పాపమే అధికంగా ఉంటుందంటారు. దీపారాధన తరువాత స్త్రీలు గంటకొట్టరాదని చెబుతారు. వీటికి శాస్త్రీయత ఉందా?*

**– టి.ఎల్. సుమతి,** కర్నూలు

**జ.** శాస్త్రీయత అని ఈనాడు తరచూ అందరూ వాడుతున్నారు. అసలు శాస్త్రం.. శాస్త్రీయతకు అర్థం మీరనుకున్నది కాదు. ఇపుడు శాస్త్రం అంటే సైన్స్ అనే అర్థంలో వాడుతున్నారు. శాస్త్రం అన్నదానికి అది అర్థం కాదు. శాసనకరణం శాస్త్రం.. అని. అందరినీ శాసించేది శాస్త్రము. సూర్యోదయ, సూర్యాస్తమయం, గ్రహణం, వర్షం, కరవు, భోజనం, నిద్ర, బ్రతుకు, మరణం, నియమపాలన.. మనకు తెలియకుండానే మనము ప్రవర్తించుచున్నాము. అది శాస్త్రము. శాస్త్రము వలన జరిగేది శాస్త్రీయము. సైన్స్ ఇంద్రియాలకు అందేదాన్ని చెపుతుంది. ఇంద్రియాలకు అందని దానిని చెప్పేది శాస్త్రము. పూజ శాస్త్ర ప్రబద్ధమే! పూజలోని నియమాలు శాస్త్ర ప్రబద్ధాలే! స్త్రీలు దీపారాధన చేయరాదని ఎవరూ చెప్పలేదు. ఋతుక్రమములో ఉన్నపుడు పూజ చేయరాదని చెప్పారు. ఇంటిలోని పూజకు పురుషులు, స్త్రీలు ఎవరూ గంట కొట్టరాదు.

*ప్ర. కర్మఫలం అనుభవించక తప్పదన్నపుడు ఈ దానాలు, ధర్మాలు, గ్రహశాంతులు ఎందుకు?*

**– ఎ. పూర్ణచంద్రరావు,** విశాఖపట్నం

**జ.** దానాలు, ధర్మాలు, గ్రహశాంతులు కూడా కర్మ ఫలమే! మనము దానాలు ధర్మాలు గ్రహశాంతులు చేయవలసిన కర్మలు అపుడు చేసి యుంటాము. అందుకే ఇపుడు చేస్తున్నాము. రోగాలకు మందున్నట్లు అపరాధాలకు, పాపాలకు కూడా ప్రాయశ్చిత్తాలుంటాయి.

*ప్ర. పూర్వజన్మలో పాపం ఈ జన్మలో అనుభవిస్తామంటారు. అసలు మనని పుట్టించమని దేవుని వేడుకోం కదా! మన అనుమతి తీసుకోకుండా మనని పుట్టించి, శిక్షించడం వింతగా లేదా?*

**– బి. శ్రీనివాసరావు,** హైదరాబాద్

**జ.** అనుమతి యజమాని తీసుకోడు. భృత్యుడే తీసుకుంటాడు. దేవుడంటే అవగాహన లేని ప్రశ్న ఇది. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు, ఆది మధ్యాంత రహితుడు, అనంత శక్తి సంపన్నుడు, అందరినీ రక్షించువాడు దేవుడు. మనం అనుమతి తీసుకొని కొడుకును కంటున్నామా? వాని అనుమతి తీసుకొని




# చతుర ప్ర.జ.2



జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించటానికి ఉపన్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

పెంచుతున్నామా? మనము చేసుకొనిన కర్మకు అనుగుణముగా దేవుడు జన్మలనిస్తాడు. కష్టసుఖాలు ఇస్తాడు. మోక్షము ఇస్తాడు.

*ప్ర. ఇంద్రుడు దేవతలుండే స్వర్గలోకానికి పాలకుడైనప్పటికీ చాలా విషయాలలో అపకీర్తి పాలయ్యాడు ఎందుకు?*

**– పెయ్యాల శ్రీనివాసరావు,** అలికాం

**జ.** మూడు లోకాల పాలకుడైనా, దేవతలకు రాజైనా, కశ్యప ప్రజాపతి పుత్రుడైనా ప్రకృతిలో ఉన్నంత వరకు ఇంద్రియాలను గెలవలేడు.. కామక్రోధాలు జీవునికి నిత్యశత్రువులు. వాటిని గెలువజాలని ప్రతివారు అపకీర్తిపాలవుతారు.

*ప్ర. నవగ్రహాలకు ప్రదక్షిణ చేసిన తరువాత కాళ్లు కడుగుకోవచ్చా?*

**– రామకూరు నాగేశ్వరరావు,** శ్రీకాకుళం

**జ.** కాళ్ళు కడుగుకోవచ్చా? కాదు. కడుక్కోవాలి! ఒక నవగ్రహాలకే కాదు. శివాలయానికి వెళ్లి వచ్చినా కాళ్ళు కడుక్కోవాలి. అది శాస్త్ర విహితం. విష్ణ్వాలయానికి వెళ్లివచ్చినప్పుడు కాళ్లు కడుగుకోనక్కరలేదు.

*ప్ర. పూర్వం అమెరికా వెళ్లివచ్చిన వారిని ఇంట్లోకి, ముఖ్యంగా వంటింట్లోకి రానిచ్చేవారు కాదు. బ్రాహ్మణ పంక్తిలో భోజనానికి కూర్చోనిచ్చేవారు కాదు. ఇప్పుడా పద్ధతి మారిపోయింది. నా మట్టుకు నేను అమెరికాలో ఉండి పౌరసత్వం కూడా తీసుకున్నాను. నేను పూజలు, ధనుర్మాస వ్రతం చేస్తున్నాను. దీనివల్ల నాకే ప్రమాదం రాదు కదా? ఇప్పుడు మన స్వామీజీలు చాలా మంది అమెరికాలో ఆధ్యాత్మిక ఉపన్యాసాలిస్తూ, యజ్ఞయాగాదులు చేస్తున్నారు. ఇది సరైనదేనా?*

**– ఆమంచర్ల సరస్వతి,** హైదరాబాద్

**జ.** పూజలు, వ్రతాలు ఎపుడూ ప్రమాదాలను ఇవ్వవు. సముద్రము దాట రాదని శాస్త్రము. ఆ రోజుల్లో విమానాలు లేవు. నావలలో వెళ్ళేవారు. అందుకు ఆ నియమం. ఇపుడు విమానాలలో ఆకాశమార్గాన సముద్ర స్పర్శ లేకుండా పోతున్నాం. అదీకాక స్వామిజీలు ధర్మప్రచారానికి, ధర్మప్రబోధానికి, భక్తభావాన్ని స్థాపించటానికి వెళ్ళుతున్నారు. వారూ తరించాలి కదా!

*ప్ర. శ్రీకృష్ణుడు, ఏకలవ్యుడు వరుసకు అన్నదమ్ములవుతారని చదివినట్లు గుర్తు. వారెలా సోదరులవుతారు? వారిద్దరి మధ్య సత్సంబంధాలు లేకపోవడానికి కారణలేమిటి?*

**– డా. ధరణి పార్థసారథి,** హైదరాబాద్

**జ.** హరివంశ మహాపురాణంలో శ్రీకృష్ణ జన్మ ఖండంలో ఆ వివరాలున్నాయి. శ్రీకృష్ణుడు వసుదేవుని కొడుకు. వసుదేవుని పెద్దనాన్న కొడుకుకు కొడుకు ఏకలవ్యుడు. కావున వారిద్దరూ సోదరులు. పుట్టగానే విధివిధానంలో అరణ్యానికి చేరి ఆటవికులతో కలిసి పెరిగి ఆటవిక వృత్తిని చేపట్టి అలాగే బ్రతికాడు ఏకలవ్యుడు.

*ప్ర. శ్రీరామునికి సంతానం లవకుశులు. మరి ఆయన సోదరులు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు సంతానం లేదా? ఉంటే పేర్లేమిటి?*

**– పక్కి బాలకృష్ణారావు,** విజయనగరం

**జ.** ఒకసారి వాల్మీకి రామాయణం ఉత్తర కాండ చదవండి! భరత శత్రుఘ్న లక్ష్మణులకు ఒక్కొక్కరికి ఇద్దరిద్దరు పిల్లలున్నారు. అన్ని పేర్లు తెలుస్తాయి. తెలుగులో అనువాదం కూడా ఉన్నది. అర్థం కాదని దిగులు లేదు.

ప్ర. శివుడు అర్ధనారీశ్వరుడు కదా! ఇక శ్రీమహావిష్ణువు మోహినిగా స్త్రీరూపం ధరించడమే కాక శివునితో కలిసి స్వామిఅయ్యప్పను కన్నాడు. అంటే సగం పురుషుడు, సగం స్త్రీ అనే కదా! తిరుమలలో శ్రీవారి విగ్రహం వెనుక భాగం స్త్రీలా ఉంటుందని అంటారు. త్రిమూర్తుల్లో బ్రహ్మను మాత్రమే పూర్ణపురుషుడు అనుకోవాలా?

**– గరిశకుర్తి రాజేంద్ర,** కామారెడ్డి

**– తటవర్తి రామకృష్ణ,** తాళ్లగడ్డ, హైదరాబాద్

**జ.** ఎవరో చెప్పిన కథలను అలాగే నమ్మి ఒక భావం ఏర్పరచుకొని ప్రశ్నిస్తున్నారు. శ్రీమహావిష్ణువు పురుషోత్తముడు. ఒక్క శ్రీమన్నారాయణుడే పురుషుడు. తక్కిన వారంతా స్త్రీలని అన్ని పురాణాలు ఘోషిస్తున్నాయి.

'వాసుదేవస్య ఏవాసే పూర్ణః పురుష ఉచ్యతే, స్త్రీ ప్రాయం ఇతరతో సర్వం' అని పురాణ వాక్యము. అయ్యప్ప ప్రస్తావన పద్దెనిమిది పురాణాలలో, పద్దెనిమిది ఉపపురాణాలలో, ఇతర ఆర్ష గ్రంథాలలో లేదు. కొందరు అందించిన గాథలు ఇవి. ఏమైనా ఒక దేవతగా ఆరాధించి, నియమ నిష్ఠలతో తరించుచున్నారు. సంతోషిద్దాము!

ప్ర. దేవుని ఊసెత్తనివారు దర్జాగా బతుకుతున్నారు. లేచింది మొదలు దైవనామాన్ని స్మరించే వారు దీనులుగానే మిగిలి ఉన్నారు. ఏమిటీ వైరుధ్యం తెలుపగలరు?

**– మహబూబ్ కమల్,** కాజీపేట

**జ.** దర్జాగా బ్రతుకుట, దారిద్ర్యాన్ని అనుభవించుట ఇవి కావు వ్యక్తిత్వానికి కొలబద్దలు. సంపదలు, సుఖాలు, భోగాలు మనిషిని అహంకారిని చేస్తాయి. అహంకారంతో ఆ దేవునే మరిచిపోతారు. కష్టాలు, దారిద్ర్యం, బాధలు సదా భగవంతుని స్మరింపచేస్తాయి. భగవంతుని మరిపించే దర్జా కావాలా? భగవంతుని తలపించే దీనత్వం, కష్టాలు కావాలా? కుంతి 'విపద స్సన్తు న శ్శశ్వత్' ఆపదలే రావాలి అని కోరుకున్నది. కష్టాలలో వ్యక్తిత్వం వికసిస్తుంది. సుఖాలలో మోహం, దర్పం పెరుగుతాయి. భగవంతుడు తన భక్తులను వ్యక్తిత్వం కలవారినిగా తీర్చిదిద్దుతారు.

ప్ర. అన్ని దానాల్లో అన్నదానం ఎంతో పుణ్యమంటారు. కొన్ని ఆలయాల పరిసరాల్లో కులాల వారీగా అంటే బ్రాహ్మణ, ఆర్యవైశ్య, క్షత్రియ, కమ్మ వగైరా కులాలవారికే అన్నదానం చేస్తున్నారు. మరి ఈ వివక్షను ఎలా సమర్థిస్తారు?

**– యు. చిట్టిబాబు,** న్యూ పాల్వంచ

**జ.** ఈ వివక్ష దేవాలయాధికారులు చేసినది కాదు. ఆగమశాస్త్రం చేసినది కాదు. ఏ రాజ్యాంగం చేసినదీ కాదు. కొన్ని కులాల వారు తమ కులంవారికి భోజనాలు పెట్టాలనుకొని 'వైశ్య అన్నదాన సత్రం, బ్రాహ్మణ అన్నదాన సత్రం' ఇలా పేర్లు పెట్టుకుంటున్నారు.

తిరుమలలో, శ్రీశైలంలో, ఉడిపిలో, ఇతర క్షేత్రాలలో దేవస్థానాలు నిర్వహించే వాటికి 'నిత్యాన్నదాన సత్రాలు' అనే పేరు ఉంటుంది కానీ కులం పేరు ఉండదు. ఆయా కులాల వారు తమ వారికి చేసుకున్న ఏర్పాట్లు ఇవి. మనం ఎలా తప్పు పడతాం?

ప్ర. ప్రతిఏటా భద్రాచలంలో సీతారామకల్యాణం చేస్తుంటారు. అలాగే తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామికి నిత్యకల్యాణం చేస్తారు. ఈ వివాహ వేడుకల పరమార్థం తెలుపగలరు? మానవులకు ఒకసారే వివాహం జరుగుతుంది కదా!

**– యం. మీనాక్షి,** సూర్యాపేట,

**– గానుగపెంట నరసింహులు,** బద్వేలు

**జ.** కల్యాణం అంటే నిజంగా మోక్షం. అనగా జీవాత్మ పరమాత్మను చేరటం. జీవులందరూ స్త్రీలు. పరమాత్మే పురుషుడు. ఈ జీవాత్మ పరమాత్మను చేరటమే కల్యాణము. అందుకే అది నిత్యము జరుగవలసినది. మన కల్యాణము ప్రకృతి బంధము. పరమాత్మ కల్యాణం ప్రకృతి మోక్షం. అది ప్రతినిత్యమూ జరగాలి. దాని ఆంతర్యం తెలిసే ఆ వివాహం మనకూ అతనితో జరగాలని కోరుకోవాలి. ©

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. ఒక మహారాజుగా శంతనునికి తన కుమారుడు భీష్మునికి స్వచ్ఛంద మరణాన్ని వరంగా ఇచ్చే అద్భుతశక్తి ఎలా వచ్చింది?

**– ఎన్. లక్ష్మీనాంచారమ్మ,** విజయవాడ

**జ.** ఒక శంతనునికే కాదు. ఆ ద్వాపర యుగం వరకు నూటికి 90 వంతులు సత్యనారాయణులు, సదాచార సంపన్నులు, తపోనిష్ఠులు. సత్యాన్ని, ధర్మాన్ని, సదాచారాన్ని నియమనిష్ఠలతో పాటిస్తే ఆ శక్తి మనకూ వస్తుంది. ఆహార, వ్యవహార, ఆచార నియమాలు, భగవదుపాసన వాక్కుకి, మనసుకీ, బుద్ధికీ దివ్యశక్తులనిస్తాయి.

# భామనే.. సత్యభామనే..!

29

## సొగసు చూడతరమా...

**'టర్న్ లెఫ్ట్'తో హాలీవుడ్‌లో తొలిఅవకాశం అందిపుచ్చుకుంది ఆ ముద్దుగుమ్మ. ఆ తర్వాత బాలీవుడ్‌ను పలకరించింది. 'ఫ్రం సిడ్నీ విత్ లవ్' సినిమాతో బాలీవుడ్‌లో అడుగుపెట్టినా 'యే జవానీ హై దీవానీ'తో అందరికీ సుపరిచితురాలైంది. జర్మనీలో పుట్టి భారతీయ సినీ ప్రేక్షకులను కట్టిపడేస్తున్న ఆ చిన్నది ఎవ్లిన్ శర్మ! ఆ అందాల భామ సౌందర్యరహస్యమేంటో చూద్దాం..**



ప్రతిరోజూ ఉదయం యోగా చేస్తుంటా. ఈత కొట్టడం, వేగంగా నడవడం చాలా ఇష్టం. గుండెకు సంబంధించిన వర్కవుట్స్‌లో ఇవి చక్కని ఫలితాన్నిస్తాయి. ప్రకృతిని చూస్తూ ఆరుబయట వ్యాయామం చేయడం వల్ల అలసట తెలియదు.

ఉదయం లేవగానే నీళ్లు తాగడంతో రోజు ప్రారంభిస్తాను. ఉదయం అల్పాహారంలో పండ్లు తీసుకుంటాను. మధ్యాహ్న భోజనంలో కూరగాయలు, సలాడ్స్ ఎక్కువగా ఉంటాయి. రాత్రి భోజనంలో సూపు, సాండివిచ్.. నా పాత్రల కనుగుణంగా ఆహారాన్ని మారుస్తుంటా.

నూనె, తీపి పదార్థాలకు దూరంగా ఉంటా. నిజానికి స్వీట్స్ అన్నా, వేపుడు పదార్థాలన్నా ఇష్టం లేదు. అది నాకు చాలా ఉపయోగకరంగా ఉంది.

ఆరోగ్యకరమైన ఆహార అలవాట్లు, ఎక్కువగా నీరు తాగడం మెరిసే చర్మానికి రహస్యం. ఇంట్లో లభించే పెరుగు, పసుపు, దోస వంటి వాటితో చర్మసౌందర్యానికి మెరుగులు దిద్దుకుంటా. అలోవీరా క్రీమ్ వాడతా. పెదాలకు సహజమైన తేనె ఉపయోగించడం వల్ల పగుళ్లు రాకుండా మృదువుగా ఉంటాయి. మన శరీరంలోని

అతి పెద్ద అవయవం చర్మం. దానికి సరిపడ నీరు ఎపుడూ అందించాలి. కావలసినంత నీరు తాగకపోతే ఎటువంటి ఫేస్‌క్రీములు వాడినా పెద్దగా ఫలితముండదు. ఒక టీస్పూను పంచదార పొడి, నాలుగు చుక్కలు బాదం నూనె, ఒక టీస్పూను తేనె, కొద్దిగా నిమ్మరసం కలిపి ముఖానికి, పొడిబారిన ప్రదేశాల్లో రాసుకుని పదినిమిషాల తర్వాత కడిగేయాలి. బాదం నూనె, తేనె మాయిశ్చరైజర్‌లాగా పనిచేసి చర్మంపై పగుళ్లు మాయమై మృదువుగా ఉంటుంది.

వారానికి రెండుమూడు సార్లు తలస్నానం చేస్తాను. తలస్నానానికి ముందు మాడుకు బాదం నూనె పట్టిస్తా. వారానికి ఒకసారి జుట్టుకు స్పా చేయించుకుంటా. కొబ్బరినూనె, పాలు, గుడ్డు వంటి సహజమైన పదార్థాలనే జుట్టు పోషణలో వాడతా.

తగినంత విశ్రాంతి, ధ్యానం అవసరం. అన్ని సమస్యలనూ పక్కన పెట్టి ప్రతిరోజూ ఓ పదినిమిషాల పాటు బయటికి వెళ్తా. మనసు ప్రశాంతంగా ఉండడమే కాకుండా దాని ప్రభావం



చర్మంపైనా ఉంటుంది. ఏమాత్రం ఖర్చు లేకుండా చర్మసౌందర్యానికి లభించే చక్కని మందు నిద్ర. సరిగా నిద్ర పోకపోతే బాగా అలసట కనిపించేది చర్మంలోనే. కాబట్టి కంటి నిండా నిద్రపోతా.

ప్రతిరోజూ ఇష్టమైన ఏదో ఒక ఆట ఆడుతుండాలి. విసుగ్గా కాకుండా ఇష్టంగా, సరదాగా వ్యాయామం చేయడం వల్ల మంచి ఫలితముంటుంది.

సేకరణ : సంధ్యారాణి

## వ్యక్తిత్వం



- ప్రతిరోజూ పద్యాలు, కొటేషన్స్. ఇలా మనకు నచ్చినవి ఏదో ఒకటి స్మరణం చేసుకోవాలి. దీనివల్ల మెదడు చురుకుగా పనిచేయడమే కాక జ్ఞాపకశక్తి కూడా పెరుగుతుంది. ఏ విషయాన్నయినా టక్కున చెప్పేయొచ్చు.
- గతాన్ని మార్చే శక్తి మనకు లేదు. ప్రస్తుత పనులే భవిష్యత్తును నిర్ణయిస్తాయి. గతంలో జరిగిన తప్పులను సరిదిద్దుకుంటూ మరింత మెరుగ్గా పనులు చేయడం వల్ల భవిష్యత్తులో విజయం మన సొంతమవుతుంది.
- మిమ్మల్ని బాధపెట్టే ఏకైక వ్యక్తి మీరే. ఇతరుల మాటలు, చర్యల ప్రభావానికి గురవ్వాలా? వద్దా? అని నిర్ణయించుకునేది మీరే. ఎదుటివారి ప్రభావానికి లోనవకుండా ఉండేందుకు తగిన శక్తి ఎవరిలోనైనా ఉంటుంది. కాబట్టి దాన్ని అధిగమించేందుకు ప్రయత్నించాలి.

## మహిళా శక్తి



✦ **అభివృద్ధిని కుంటుపరుస్తున్న నీ గతం నుంచి బయటికి వచ్చేయి.. నీవు కోరుకుంటున్న కొత్త లోకాన్ని సృష్టించుకో.**

– ఒప్రా విన్‌ఫ్రే



✦ **ఒక వ్యక్తిని ఖైదు చేయొచ్చు! లేదా నాశనం చేయొచ్చు! లేదా చంపొచ్చు..! కానీ ఒక ఆలోచనను మాత్రం ఎవరూ ఏమీ చేయలేరు!**

– బెనజీర్ భుట్టో



## చిట్కాలక్ష్మి

* రాజ్‌మా, కందులు వంటి గుగ్గిళ్లు వండేపుడు అవి ఉడికి, మరికాసేపటికి దించుతామనగా ఉప్పు వేయాలి. లేదంటే సమయం, గ్యాస్ రెండూ వృథా అవుతాయి.
* కొవ్వొత్తులు ఫ్రిజ్‌లో ఉంచి అవసరమైనపుడు తీసి వెలిగిస్తే ఎక్కువ సేపు వెలుగుతాయి.
* తురిమిన కొబ్బరి ఫ్రిజ్‌లో పెడితే ఎక్కువ రోజులు నిలవ ఉంటుంది.
* అల్లం కొద్దిరోజులు ఫ్రిజ్ కింది షెల్ఫులో ఉంచి తర్వాత తీసి ఆరబెడితే ఎక్కువ రోజులు నిలవ ఉంటుంది.
* ఆకుకూరలు కాడలు తరిగి పాలథీన్ కవర్‌లో ఉంచి ఫ్రిజ్‌లో పెడితే తాజాగా ఉంటాయి.

**జతపరచండి జవాబులు :** 1. బి, 2. డి, 3. జి, 4. ఎ 5. సి, 6. హెచ్, 7. ఐ, 8. ఎఫ్

## టెక్ గురూ!

### స్మార్ట్ డిక్షనరీ

ఇతర భాషలు నేర్చుకుంటున్నారా? ఏదైనా ఆయా భాషల్లోని వాక్యాలకు అప్పటికప్పుడు అర్థం కావాలా? అయితే వెంటనే స్మార్ట్ డిక్షనరీ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోండి. ఎపుడూ ఇంటర్‌నెట్ కనెక్షన్ ఉండాల్సిన అవసరంలేదు. ఆఫ్‌లైన్‌లో కూడా పనిచేస్తుంది. యాప్ ఇన్‌స్టాల్ చేస్తున్నపుడే ఈ డిక్షనరీ కూడా డౌన్‌లోడ్ అవుతుంది. ఇంగ్లీషు, నార్వేజియన్, పొలిష్, స్పానిష్, రష్యన్ భాషలు దీనిలో ఉన్నాయి. పదాలకే కాకుండా వాక్యాలకు కూడా అర్థం తెలుసుకునే వీలుంది. ఇంకా ఆయా పదాలను ఎలా పలకాలి?, ప్రాథమిక వ్యాకరణం వంటివి ఇందులో ఉన్నాయి. ఇంతకుముందు వెతికిన పదాలు, వాటి అర్థాలు తిరిగి చూసుకునే వీలు కూడా ఉంది.

### ట్రాన్స్‌లేటర్ ప్లస్ ప్లస్

ఉద్యోగ రీత్యా, ఇతరత్రా పనుల మీద కొత్త ప్రదేశాలకు వెళ్లినపుడు అక్కడి భాష రాక చాలా ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుంది. కనీస అవసరాలు తీరడానికైన నానా తంటాలు పడి అక్కడి భాష నాలుగు ముక్కలు నేర్చుకోవలసి వస్తుంది. అయితే ఇపుడు ఆ సమస్యను పరిష్క




రిస్తూ వచ్చిందే ట్రాన్స్‌లేటర్ ప్లస్ ప్లస్ యాప్. రెండు ఇయర్‌ఫోన్లలో ఒకదానిని మాతృభాషకు సెట్ చేసి, మరోదాన్ని ట్రాన్స్‌లేట్ చేయాల్సిన భాషకు సెట్ చేయాలి. ఇపుడు చెరొక మైక్రోఫోన్‌ను పెట్టుకుని సంభాషణ కొనసాగించాలి. మనం మాట్లాడింది ఎదుటివారి భాషలోకి మార్పు చెంది వారికి వినిపిస్తుంది. అలాగే ఎదుటివాళ్లు మాట్లాడింది మనభాషలోకి మారి వినిపిస్తుంది. ఈ యాప్ ద్వారా టర్కిష్, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, స్పానిష్, ఇటాలియన్, గ్రీకు, చైనీస్, అరబిక్, రష్యన్ భాషల్లో ఏ భాష నుంచి ఏభాషకైనా అనువాదం జరుగుతుంది.

# జతపరచండి

ప్రపంచంలో ఎక్కువగా అమ్ముడు పోయిన పుస్తకాలు, వాటి రచయితలు గజిబిజిగా ఉన్నాయిక్కడ. ఏది ఎవరి పుస్తకమో గుర్తించగలరేమో ప్రయత్నించండి..

| | |
|---|---|
| 1. వార్ అండ్ పీస్ | ఎ. నెపోలియన్ హిల్ |
| 2. హారీపోటర్ అండ్ ది ఫిలాసఫర్స్ స్టోన్ | బి. లియో టాల్‌స్టాయ్ |
| 3. ది బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్ | సి. అన్నా సీవెల్ |
| 4. థింక్ అండ్ గ్రో రిచ్ | డి. జె.కె. రౌలింగ్ |
| 5. బ్లాక్ బ్యూటీ | ఎఫ్. జాక్వెలిన్ సుసన్ |
| 6. ది నేమ్ ఆఫ్ ది రోస్ | జి.. స్టీఫెన్ హాకింగ్ |
| 7. ఫియర్ ఆఫ్ ఫ్లైయింగ్ | హెచ్. అంబర్టో ఎకో |
| 8. వాలీ ఆఫ్ ది డాల్స్ | ఐ. ఎరికా జాంగ్ |

జవాబులు ఈ సంచికలోనే..




### వ్యక్తిగత సమస్య!



వికాస్ : మేనేజర్ గారూ! త్వరగా మా రూముకు రండి. మా ఆవిడకు నాకు మధ్య గొడవ జరిగింది. తను కిటికీ గుండా దూకుతా నంటోంది!

హోటల్ మేనేజర్: అది మీ వ్యక్తిగత సమస్య, దానికి నేనేం చేయగ లను?

వికాస్: ఈ కిటికీ తెరుచుకోవడం లేదు.. ఇది మీరు చేయాల్సిందే కదా?

### అన్నీ పెట్టా!

ఎల్కేజీ చదివే స్వీటీ స్కూలు నుంచి వచ్చింది..



తండ్రి : హాయ్ స్వీటీ! ఈ రోజు స్కూలు ఎలా జరి గింది?

కూతురు: నేను అలసిపోయాను డా డీ! నా ఫేస్‌బుక్‌లో అన్ని విషయాలు పెట్టా, చూడండి.

### చక్కని అవకాశం!



భర్తుడు: జీవి తానికి అర్థం చెప్పండి స్వామీ!

దేవుడు : జీవి తానికి ప్రత్యేకంగా ఏ అర్థమూ లేదు నాయనా! ఇది నీకో చక్కని అవ కాశం, జీవితానికో అర్థాన్ని ఏర్పరచుకోవడానికి.

# నువ్వు పప్పుండలు






## కావలసిన పదార్థాలు

| | |
|---|---|
| ★ నువ్వులు | - 1 కప్పు |
| ★ బెల్లం | - 1/2 కప్పు |
| ★ పల్లీలు | - 2 టేబుల్ స్పూన్లు |
| ★ నెయ్యి | - 1 టేబుల్ స్పూను |
| ★ యాలకుల పొడి | - 1/2 పొడి |

### తయారుచేసే పద్ధతి

ముందుగా నువ్వులు దోరగా వేయించి పెట్టుకోవాలి. పాన్‌లో సన్నని సెగ మీద నెయ్యి వేడి చేయాలి. తర్వాత దానిలో మెత్తగా చేసిన బెల్లం వేసి కలుపుతూ ఉండాలి. ఉండ పాకం వచ్చాక దానిలో యాలకుల పొడి, వేయించిన నువ్వులు, పల్లీలు కలిపి మంట తీసేయాలి. చేతికి నెయ్యి లేదా నూనె రాసుకుని కొద్దికొద్దిగా ఆ మిశ్రమాన్ని తీసుకుని చల్లారకముందే చిన్నచిన్న ఉండలుగా చేసుకోవాలి. మిశ్రమం చల్లారిందంటే గట్టిబడుతుంది. ఉండలు చేయడం కుదరదు.

# బొప్పాయితో సోయగం

సంవత్సరం పొడవునా దొరికే బొప్పాయిలో ఆరోగ్యాన్నిచ్చే ఔషధ విలువలతోపాటు చర్మ సౌందర్యాన్ని పెంచే సుగుణాలెన్నో ఉన్నాయి.

★ బొప్పాయిలోని విటమిన్ ఎ, పాపెయిన్‌లు చర్మంలోని మృతకణాలను తొలగిస్తాయి.

★ సోడియం తక్కువగా ఉండడం వల్ల చర్మం నిర్జలీకరణం చెందకుండా కాపాడుతుంది.

★ ఆపిల్, సీతాఫలం, జామ వంటి పండ్లతో పోలిస్తే కెరోటిన్ ఎక్కువగా ఉంటుంది.

★ నూరిన పచ్చి బొప్పాయి ముద్దను ముఖానికి రాసుకుని 25 నిమిషాల పాటు ఉంచుకోవడం వల్ల మొటిమలు, ఇతర మచ్చలు మాయమవుతాయి.

★ ప్రతిరోజూ బొప్పాయి పండు తిన్నా, ఆ గుజ్జును ముఖానికి రాసుకున్నా చర్మం మృదువుగా, కాంతిమంతంగా మారుతుంది.

★ పగిలిన పాదాలకు బొప్పాయి గుజ్జును రాయడం వల్ల మంచి ఫలితముంటుంది.

★ బొప్పాయి ముసలితనపు ఛాయలను దరిచేరనీయదు.

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**చిలుముల ప్రమీల నసీరుద్దీన్**

ఇం. నెం. 7-1-593/ఎ,
మంకమ్మతోట వీధి, కరీంనగర్
పిన్ : 505001

## చతురంగం - 63 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 య | 2 న | మ | 3 ల | | 4 క | 5 ల | వ | 6 రం | |
| 7 మ | తి | | 8 కు | 9 వ | ల | యం | | 10 భ | 11 ద్ర |
| లో | | 12 కా | మ | రూ | ప | | 13 వె | | వి |
| 14 కం | 15 గా | రు | | ధి | | 16 ష | ణ్ము | 17 గ | డ |
| | య | | 18 సి | ని | 19 మా | లు | | జం | |
| 20 క | ని | గి | 21 రి | | 22 మి | గు | 23 లు | | 24 బ |
| | | రీ | | 25 బ | డి | | 26 పా | 27 త | కం |
| 28 శి | 29 వ | శం | 30 క | రి | | 31 నో | | ల | |
| 32 ఖ | రం | | వా | | 33 వి | రా | 34 ట | రా | 35 జు |
| రం | | 36 ఆ | టం | కం | | 37 ర | జ | త | ము |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. టి. రాంకిషన్, హైదరాబాద్, 2. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 3. కె.వి. దుర్గామోహన రావు, వనస్థలిపురం, 4. పి. దేవసేనమ్మ, జూబ్లీ హిల్స్, 5. ఆర్. చంద్రశేఖర్, చెన్నై, 6. చింతల పాటి శివశంకరశాస్త్రి, రామచంద్రాపురం, 7. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 8. పి. శుభ, బంజారాహిల్స్, 9. సి.జి.యస్. రావు, ఎ.ఎస్. రావు నగర్, 10. డా.సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 11. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 12. వి.వి. రమణమూర్తి, మౌలాలి, 13. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 14. పూల రమాదేవి, వనస్థలిపురం, 15. నియాజ్ అలి, హైదరాబాద్, 16. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 17. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 18. ఎ. రంగనాథం, బెంగళూరు, 19. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 20. క్రోవి లలితావాణి, బేగంపేట, 21. బిరుదు సురేష్‌బాబు, పేరాల, 22. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 23. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 24. ఎస్. మణిమేగలై, తిరుపతి, 25. లింగబత్తుల భవ్యశ్రీ, పెద్దముప్పారం, వరగంల్ జిల్లా, 26. తొయ్యేటి వెంకటసూర్యం, విశాఖపట్నం, 27. తూములూరు సత్యనారాయణ మూర్తి, ఖమ్మం, 28. జనమంచి సత్యవతి సమత, దమ్మాయిగూడ, 29. జి. నాగమణి, చిక్కడపల్లి, 30. బచ్చు రోహిత్‌సత్య, కొత్తగూడెం, 31. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, 32. కె. ప్రభావతీదేవి, గుంటూరు, 33. ధరణి పద్మాసన, నల్లకుంట, 34. డా. ధరణి పార్థసారథి, నల్లకుంట, 35. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 36. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 37. ఎం. హేమలత, గోదావరిఖని, 38. జి. రజని, వెంకటగిరి, 39. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 40. వి.వి. సుబ్బారావు, బెంగళూరు, 41. ఏకా సావిత్రి, బాపట్ల, 42. ఎం. వసంత, బోరబండ, 43. సి. నిర్మల, తిరుపతి, 44. డా. సి.కె. శాస్త్రి, గుంటూరు, 45. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజీగూడ, 46. ఎం.వి. చలపతి, భీమవరం, 47. నోరి శివప్రకాశం, నెల్లూరు, 48. లోకే పుష్పలత, మంథని, 49. ఆకెళ్ల శశికళ, అక్కయ్యపాలెం, 50. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 51. జి. శోభ, తిరుపతి, 52. పేర్వేల రాంబాబు, హైదరాబాద్, 53. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 54. గానుగపాటి సరోజినీదేవి, మల్లాపూర్, సికింద్రాబాద్, 55. అత్తిలి కస్తూరిబాయి, తిరుపతి, 56. పి.బి. సీతాదేవి, నరసాపురం, 57. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 58. కె. ఉషాదేవి, నల్లకుంట, 59. పెమ్మరాజు సావిత్రి, నాగోలు, 60. ఎ. స్వరూపరాణి, హైదరాబాద్, 61. డి. పద్మజ, సూర్యాపేట, 62. ఈ. కృష్ణకుమారి, విజయవాడ, 63. తోకల నరేంద్రకుమార్, ఇంకొల్లు, 64. పప్పు శ్రీదేవి, అమలాపురం, 65. సౌదామినీ నాగరాజన్, వైజాగ్, 66. దేవగ్రాజు వెంకటనరసింహారావు, హైదరాబాద్, 67. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, 68. గురుజు నాగేశ్వరి, మెహిదీపట్నం, 69. వి. భవాని, వరంగల్, 70. నాగలక్ష్మి, సైనిక్‌పురి, 71. ఎ.వి. రామకృష్ణ, కాట్రేనికోన, 72. యు.ఎస్. మూర్తి, లాలాపేట, 73. బి. రామమోహనరావు, దిల్‌సుక్‌నగర్, 74. కట్టా సాయిసిరిదత్త, హిందూపురం, 75. దేవగ్రాజు లక్ష్మీప్రసాద్, చంద్రాల, కృష్ణా జిల్లా, 76. నెల్లుట్ల ప్రేమలత, హైదరాబాద్, 77. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 78. ఎల్. మహాదేవశర్మ, ఒంగోలు, 79. గోగాడ వెంకట సింహాచలపతిరావు, హోస్పేట, 80. సూరి నాగరాజు, బెంగళూరు, 81. మొల్ల ఆసిఫ్ పాషా, కర్నూలు, 82. సయ్యద్ జమీలాబేగం, కర్నూలు, 83. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 84. ఉదాలి భాస్కరయ్య, చెన్నై, 85. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, 86. సముద్రాల సంతోష్‌కుమార్, కొడిమ్యాల, 87. యర్రమిల్లి ప్రభాకరరావు, విశాఖ, 88. ఎం. వసంతవీరేశ్, మద్దికెర, 89. ఎస్.వి.ఎస్. భగవానులు, ఒంగోలు, 90. ఎస్. హైమారాణి, విజయవాడ, 91. బి. విజయలక్ష్మి, కాకినాడ, 92. సి. నారాయణ, కర్నూలు, 93. పక్కి శ్రీదేవి, గంట్యాడ, 94. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 95. టి. మహాలక్ష్మి, బెంగళూరు, 96. పెనుమచ్చ నాగేశ్వరి, తుని, 97. ఎం.ఎల్. సుజాత, గుడివాడ, 98. ఆర్. భవ్య, ఎమ్మిగనూరు, 99. దండు రామరాజు, మెరకముడిదాం, 100. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 101. చక్రవర్తి మధుసూదనరావు, వికారాబాద్, 102. పొత్తూరి నారాయణబాబు, గుంటూరు, 103. కె. నాగభూషణం, మౌలాలి, 104. యం. నర్సింహులు, వికారాబాద్, 105. కె. శంకరయ్య, వికారాబాద్, 106. పువ్వాడ కమలారజని, గుంటూరు, 107. కె.ఎ. శ్రావ్య, నంద్యాల, 108. పెమ్మరాజు, శ్రీవెంకట సుబ్బారావు, భీమవరం, 109. బలుసు అమరసురేంద్ర ప్రసాద్, చాగల్లు, 110. వడ్డీ సుశీల, సికింద్రాబాద్, 111. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 112. బి.వి. నరసింహారావు, పేరాల, 113. మారెడ్డి ప్రభాకర్, కొత్తపేట, 114. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 115. సత్రసాల సుభాషిణి రామకృష్ణ, అనంతపురం, 116. సి. భారతి, మన్సూరాబాద్, 117. ధఫ్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 118. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 119. ఎస్. లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్, 120. డా.కె. శివభూషణం, కర్నూలు, 121. శీతేపల్లి శశికుమార్, విజయవాడ, 122. ఎ. అరుంధతి, పుణె, 123. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 124. బి. సుబ్బారావు, కాశీబుగ్గ, 125. ఎం. రమాదేవి, మోతీన *(..128లో)*

# చతురంగం - 64 ఆధారాలు

## అడ్డం

1. ఉద్యోగం, పదవి నుంచి వైదొలగినపుడు ఇచ్చే పత్రం (4)
4. తెలుగు సంవత్సరాల్లో మొదటిది (3)
8. తెలుగు సినిమాల్లో ప్రసిద్ధ విలన్ (2)
9. సిగ్గు (2)
10. సలక్షణానికి భిన్నం (4)
12. తిరగబడిన జాతిపిత బిరుదు (3)
14. చప్పుడు (2)
16. మంచు (4)
18. తినేసేది (3)
19. జబ్బు (2)
21. స్త్రీ (2)
22. లోలోపల నిక్షిప్తమైన, ముకుళించే (3)
23. శ్రీరాముడి మామగారు (4)
25. తెలంగాణ తిరుమలగా ప్రసిద్ధమైన నారసింహక్షేత్రం (3)
27. ఇల్లు, నివాసం (3)
28. ఆరుద్ర తన శ్రీమతిపై రాసిన శతకం (2)
29. మొదలుపెట్టు (3)
32. సొంత పనుల కోసం ఇతరులను పొగడడాన్ని ఇలా అంటారు (2)
33. నడక, దిక్కు (2)
34. పెళ్లిలో పేలాలతో చేసే యజ్ఞం (4)
36. అడ్డం 29 మరో రూపంలో (4)
37. ఈనెల ఆంగ్ల నామం (2)
38. కర్ణుడు మహా - - (2)

## నిలువు

1. ప్రత్యర్థులు ఏకమై పోవడం (2)
2. భగవంతుడు పరమాత్మ అయితే ప్రాణి - - - (3)
3. మాలల సంక్షేమానికి ఏర్పడిన ఉద్యమ సంఘం (6)
5. భవిష్యత్తును ఇలానూ అంటారు (3)
6. చేపలను, పక్షులను పట్టుకునే సాధనం (2)
7. ఎరుపు రంగు (2)
11. వెంకటేష్, శ్రీదేవి, వర్మల సినిమా (4)
13. ఆపద (2)
14. ముఖం (2)
15. తామరపువ్వు (4)
17. మన్మథుడి సతి (2)
18. శ్రీరామనవమి వైభవంగా జరిగేది ఇక్కడే (3)
20. తిరగబడిన పర్వతం (2)
22. నెమ్మది (3)
24. గొడ్డలి (3)
25. శ్రీకృష్ణుని వంశం (3)
26. చక్రవర్తి కింద ఉండేవాడు గందరగోళమయ్యాడు (5)
29. రూపం (3)
30. చెరుపు, అవమానం, ఆటంకం (3)
31. జనం, ప్రశ్న- జవాబును కుదిస్తే (2)
32. రంగారెడి జిల్లాలోని ఒక మున్సిపాలిటీ (2)
34. శీర్షాసనం వేసిన మజ్ను ప్రియురాలు (2)
35. ప్రత్యేక - - కోసం ఆంధ్రప్రదేశ్ ఆరాటం (2)

(127వ పేజీ తరువాయి...)

గర్, 126. గన్న అభిరామ్, తణుకు, 127. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 128. గరికిపాటి సూర్యశ్రీ, కాకినాడ, 129. డి.వి.ఎ. హిరణ్మయి, విశాఖ, 130. కె. సరోజమ్మ, అనంతపురం, 131. పి.యస్. చంద్, ఏలూరు, 132. కె. సుబ్రమణ్యం, అనంతపురం, 133. జి. జనార్దన్‌రెడ్డి, నిజామాబాద్, 134. ఒజ్జల రాజ్యలక్ష్మి, కరీంనగర్, 135. హెచ్.జె. సువర్ణ, కర్నూలు, 136. జి. ముత్తుమారన్, చర్లపల్లి, 137. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, 138. ఎస్. కల్పన, సీతాఫలమండి, 139. పి.వి.ఎల్.ఎన్. సూర్యసంతోష్, హైదరాబాద్, 140. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 141. సిహెచ్. రాధాకృష్ణమూర్తి, రాజమండ్రి, 142. తల్లాప్రగడ సుందరరామయ్య, రాజమండ్రి, 143. ఎం. శ్రీవాణీగిరిజాదేవి, రాజమండ్రి, 144. ములగ సాయికృష్ణ జాహ్నవి, విజయనగరం, 145. పక్కి శ్రీదేవీ చక్రవర్తి, విశాఖ, 146. గుర్రప్ప పురుషోత్తము, హనుమకొండ, 147. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 148. దేవులపల్లి లలిత, ఉయ్యూరు, 149. సయ్యద్ జమీలాబేగం, కర్నూలు, 150. దూసనపూడి శ్రీలత, తాడేపల్లిగూడెం, 151. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 152. కంజర్ల అనంతాచార్యులు, జగిత్యాల, 153. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 154. ఎస్. జయరామ్‌మోహన్, నిజాంపేట, 155. పొన్నపల్లి వెంకటప్పయ్య, విజయవాడ, 156. ప్రతాపురం రామానుజాచారి, హనుమకొండ, 157. పి. శ్రీజరెడ్డి, మహబూబ్‌నగర్, 158. వడ్లమన్నాటి సరోజిని, మచిలీపట్నం, 159. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు.

# చతురంగం - 64

రూ.150/- బహుమతి

గడువు తేది : జులై 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ■ | 4 | 5 | 6 | ■ | 7 |
| 8 | | ■ | 9 | | ■ | 10 | | 11 | ఐం |
| ■ | 12 | 13 | | ■ | 14 | | ■ | | ■ |
| 15 | ■ | 16 ని | | 17 | | ■ | 18 | | |
| 19 | 20 | ■ | 21 | | ■ | 22 | | | ■ |
| 23 | | 24 | | ■ | 25 | | | ■ | 26 |
| | ■ | రా | ■ | 27 | | | ■ | 28 | రా |
| ■ | 29 | | 30 | ■ | | ■ | 31 | ■ | |
| 32 | | ■ | 33 | | ■ | 34 | | 35 | |
| 36 | | | | ■ | 37 | | ■ | 38 | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------------

----------------------------------------

-------------------- పిన్ : ------------ ఫోన్ : --------------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# విచిత్ర బహుమతి...!

తల్లిలేని లోటు తెలియకుండా అల్లారుముద్దుగా పెంచిన తండ్రికి ఎవరూ ఇవ్వలేని బహుమతినిచ్చి రుణం తీర్చుకున్నాడా పుత్రుడు. ఇంతకీ ఏమిటా బహుమతి? చదవండి **గోపాల్ ఠాకూర్** సింధీ కథ **తండ్రి రుణం**

పెద్దవాళ్లు కూడా చేయలేని సాహసం చేశారా చిన్నారులు. కాలువపై వంగి ఉన్న చెట్టుపై నుంచి పాక్కుంటూ రక్తపుటేరులు పారిన గ్రామంలో ఎందుకు అడుగుపెట్టారు? ఫోర్త్ ఎస్టేట్ అని పిలుచుకునే మీడియాలో నీతి, నిజాయతీ, మానవతా విలువలకు ఖర్చు రాసేస్తున్న ఆధునిక పోకడలను ఆవిష్కరించిన **మనోజ్‌కుమార్ గోస్వామి** అస్సామీ కథ **రాబందులు**

అన్నం పెట్టిన ఇంటికే కన్నం వేయాలనుకున్నాడతను. అతడి విషయం తెలిసినా ఆ ఇల్లాలు భర్తకు చెప్పలేదు. కారణం? చదవండి **ఎడ్వర్డ్ మూనీ అండ్ గకురో కుకుడా** జపాన్ కథ **కడిగిన ముత్యం**




'కూటికోసం కోటివిద్యలు' అన్నారు పెద్దలు. ఆ కోటి విద్యల్లో ఆమె ప్రదర్శించే విద్య ఉందో, లేదో తెలీదు కానీ, ఆమెకు మాత్రం ఎదురులేదు. చదవండి **జెఫ్రీ ఆర్చర్** ఇంగ్లండ్ కథ **బతకనేర్చినతనం!**

* **అంబటిపూడి వెంకటరత్నం ప్రభువు** కథకుల ఫైల్ లో..!
* **గైడీ మపాసా** ఫ్రెంచ్ కథ **దారం ముక్క**
* కామెడీ జాడీ.. **పేరడీ బీరెడీ**
* జూన్ విపులపై సుప్రసిద్ధ రచయిత్రి **జలంధర** మనోగతం **పరామర్శ**లో..

మరెన్నో మీకోసం జులై విపులలో!

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Ranga Reddy District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# పెళ్లంటే మునిగిపోవడమా?



"శై.. రా! మనం ఈతకొడదాం రా!" ప్రతాప్ పిలిచాడు.

ఈతలో నేర్పరులైన వారిద్దరూ వేగంగా గంగా నదీజలాల్ని చీలుస్తూ ముందుకు దూసుకుపోతున్నారు! ఒడ్డునున్న వాళ్లంతా వెనక్కి రండంటూ ఆందోళనగా అరుస్తున్నారు.

చాలా దూరం ముందుకు వెళ్లాక "శైవలినీ! ఇక్కడే మన పెళ్లి" అన్నాడు ప్రతాప్.

"ఇక్కడా? !" ఆశ్చర్యంగా అంది శైవలిని.

"ఆc! ఇక్కడే.. నేను మునుగుతున్నాను. నువ్వూ మునిగిపో.." అంటూ ప్రతాప్ ఠక్కున నీటిలో మునిగిపోయాడు!

ఆ తర్వాతేమైంది? శైవలిని నదిలో మునిగిందా? ఇంతకీ ప్రతాప్ అలాంటి నిర్ణయం తీసుకోవడానికి కారణమేంటి? ఆద్యంతం ఉత్కంఠగా సాగే 'వందేమాతరం' గీతకర్త **బంకించంద్ర ఛటోపాధ్యాయ** బెంగాలీ చారిత్రక నవలకు **ధవ్వూరి శ్రీధరాచార్యులు** తేటతెనుగు అనువాదం **చంద్రశేఖర్** చతుర ఆగస్టు కానుక!

## బోనస్‌గా...

✱ **నవలావలోకనం**లో.. మూడున్నర దశాబ్దాలకు పూర్వం 'చతుర నవలల పోటీలో బహుమతి పొందిన ప్రసిద్ధ రచయిత **వసంతరావు దేశ్‌పాండే అడవి** పై అపురూప విశ్లేషణ. 'ఇంద్రవెల్లి' కాల్పుల ఘటన నేపథ్యంగా సాగే ఈ నవల శిల్పం వినూత్నం. నైజాం పరిపాలనా కాలంనాటి అడవి బిడ్డల చరిత్రను, సంస్కృతిని జమిలిగా అక్షరీకరించిన అద్భుతమైన అరణ్యకావ్యం **అడవి!**

